అని చెప్పియుండెను. అతనికిని అది సొంతము గాక పూర్వమునుండియే కలిగిన సూక్తిగాఁ దోఁచును. నన్నయభట్టు ఉభయాంధ్రకవి సకల భాషావాగనుశాసనుఁడు

స్వస్థాన వేష భాషాభిమతాః
  సన్తో రస ప్రలుబ్ధ ధియః
లోకే బహుమన్యన్తే వైకృత
  కావ్యాని దాన్య దపహాయ.

అని రసప్రలుబ్ధ ధీశాలులు అన్యమును (= సంస్కృతమును) మాని వైకృత (= తెలుఁగు) కావ్యముల బహుమానింతు రనియు, ఉభయకవి మిత్రుఁడు తిక్కన ఆంధ్రమున భారతము రచించుటయె కాక, ఉత్తర రామాయణమున "ఒప్పైనను జాత్యము గామిచే నెయ్యెడను సంస్కృతము చొన్ప" ననుటయుం ఇత్యాదింబట్టి చూడ 'దేశభాషలందుఁ దెలుఁగు లెస్స' యనునది సంప్రదాయముగా 'నానుడి'వలె దేశమున నెంతయు నానినదిగాఁ జూపట్టుచున్నది. కన్నడరాయఁడు తెలుఁగుపై మమత గొనుట కీ. శే. వేదము వేంకటరాయ శాస్త్రులవారు తాము పుదూరి ద్రావిడులు అలవలు-అయ్యు తెలుఁగుపై పుట్టుతెలుఁగులకన్నను వేయింతల పక్షపాతము గొని తమ యెల్ల సరస్వతీసేవయు తెలుఁగునకె కావించుటను జ్ఞప్తిసేయును. 'అమిఅం పాఉఅ కవ్వం పఢిఉం సోఉం అ' అనియు 'పరుసా సక్కిఅ బన్ధా పాఉఅ బన్ధో వి హోఇ సుఉమారో పురుస మహిలాణం జేత్తి అమిహన్తరం తేత్తిఅమిమాణం.' అను ప్రాకృత ప్రశంసయు దీనికి దిక్కుచూపునదే అగును. ఆ 'లెస్స' యగు 'కంద' కు ఉదాహరణముగాను సమర్థనముగాను రచింపఁబడినది, ఆముక్తమాల్యద. ఆంధ్రమున ఇంత కంటెను ప్రౌఢమగు కావ్యము లేదు. సంస్కృతమున మురారి యనర్ఘరాఘవమ్మున ఎట్టి ప్రౌఢిని సాధింపఁగోరెనో తెలుఁగున అట్టి ప్రౌఢి సాధింపఁబడినది. ఆ ప్రయత్నమున సంస్కృతమురారికంటెను తెలుఁగుకృష్ణరాయఁడు శ్లాఘ్యతరవిజయమును సంపాదించినాఁడని కవిసహృదయచక్రవర్తి శ్రీ వేదము వేంకటరాయశాస్త్రుల యభిప్రాయము. వాక్ప్రౌఢియె కాక కల్పనప్రౌఢియు అసదృశము. ఇది షష్ఠ్యంతాశ్వాసాం తర్తువర్ణనల యందు నిరూపమై యున్నది. పాండిత్య వైదగ్ధ్య సంస్కృత ప్రతిభా సముత్పన్న వాక్ప్రౌఢోదారకమగు నని భవభూతి భట్టహర్ష మురారులు వావిచ్చి చెప్పినారు. 'మాఘే గతం వయః' అనియు 'నారికేళ ఫల సమ్మితం వచో భారవేః సపది తద్విభ

జ్యతే' అనియు మాఘ భారవుల నిర్దేశించి మల్లినాథుఁడు వాని ప్రౌఢినే సూచించి ...రి వాక్కు రస నిర్భరము రసికాస్వాద్యము అన్నాఁడు. తన యాశ్వాసాంతపద్యా...చే అనుకృతుఁ డగు సర్గాంతశ్లోకాల 'విద్వదౌషధ' మగు నైషధము చెప్పిన కవి శ్రీహర్షుఁడు తన కబ్బము 'మధువర్షి' యనియు 'సుధ' యనియుం జెప్పినాఁడు.

ఇట్టి మెప్పుతోడనే రాయని పూర్వగీర్వాణరచనలంగూర్చిన ఘనపద్వాక్యముస ఆయాకావ్యమును విశేషించిన తెలంగుపలన రాయనికి కవనమున ఏ గుణములు ఇష్టములో తెలియును.

పలికి తు ప్రేక్షోపమలు జాతి పెంపెక్క
రసికు లౌనన మదాలస చరిత్ర,
భావ ధ్వని వ్యంగ్య సేవధి గాఁగ జె
ప్పితిని సత్యావధూ ప్రీణనంబు,
శ్రుతిపురాణోపసంహిత లేర్చి కూర్చితి
సకలకథాసారసంగ్రహంబు,
శ్రోత్రఘచ్ఛటలు పిచ్చుగ రచించితి సూక్తి,
నైపుణీ జ్ఞానచింతామణికృతి

ల్లాటియు రసమంజరీముఖ్య మధురకావ్య
రచన మెప్పించుకొంటి గీర్వాణభాష
నంధ్రభాష యసాధ్యంబె ? యందు నొక్క
కృతి వినిర్మింపు మిఁక మాకుఁ బ్రియముగాఁగ.

ఉత్ప్రేక్షలు ఉపమలు జాతి భావధ్వనివ్యంగ్యసేవధిత కథాకథన నైపుణియు అని. దశావతారస్తోత్రము, అంగాష్టకయోగము, యామునశ్రీరంగము, గోదావిష్ణుచిత్తుల శ్రీరంగము, అమ్మవారి పెండ్లి సదస్సు-ఇవన్నియు, విన్నమాత్రన, అచుచ్చటల విప్పునవే. అమ్మవారి వయఃసంధి, రూపసౌభాగ్యము, అయోగవేదన, ప్రియో పాలంభము, అనంగదశలు, కృష్ణగోపికల స్మరణ, గుడికి పోయిముచ్చటలు - ఇవన్నియు ఎంతయు మాధుర్యమునకు నెలవులు. శ్లేష అత్యంతవిరళము. అది అజోలియే పెట్టుకొనని కాళిదాసునందు నయితము నూటి కొకటి కోటి కొకటిగా నుండును. ఉన్నంతమాత్రన అతిసహజముగను అత్యంతహృదయంగమము గను ఉండును.

ఇందును అట్టివి పుష్పలావికా విట స్థితః నరసపరిహాసోక్తులంటోని యెంతం రవంత కలదు. అది అత్యంతలలితము. భవభూతి మాలతీమాధవ శృంగారమున కథావస్తు వశముననే శ్మశానబీభత్సమును చెప్పి అంచులకు ఎంతయో పేరుగన్నాఁడు. ఆలంకారికాచార్యులందఱి బీభత్సోదాహరణములకును అదే 'ఆస్తి.' రాయఁడు బొమ్మరాకాసి మట్టిచెట్టుల బీభత్సమున అతనితో నవలేశమైనను న్యూనత లేక తులతూఁగినాఁడు. ఇందలి నగరవర్ణనలలోను ఋతువర్ణనలలోను సర్దేశించిన ఉత్తమాదారములును అభ్యాసములును తా నెఱింగిన వగుటయే కాక తన యనుష్ఠానమున కలిగినవియు కాఁదగును. రెండు నగరములు విల్లిబుత్తూరును మధురయు వర్ణించిన, ఒక్కదాన పుణ్యక్షేత్రసదృశతను ఒక్కదాన రాజధాని సదృశతను నిరూపించినాఁడు. విష్ణుచిత్తీయ యామునీయ చరితములను కైశిక ద్వాదశీవ్రతానుష్ఠాన మహిమను గోదను ఆకల్యాణమును తాను చెప్పఁ గడఁగి అట్లు తాత్పర్యముతో నిర్వహించుటచేత రాయని వైష్ణవంపు నైశిత్యము శీలసంపత్తి భక్తి ప్రపత్తులును ఊహింపఁదగను. అట్లే ఇందలి రాజనీతి యుపన్యాసము నుండి రాయని గుణాతిశయములు కొన్ని ఊహింపఁదగును. తాను రాజై అనుష్ఠింపకుండునా ?

అట్లేగదా :—

కృష్ణరాయఁడు మిక్కిలి నాగరకుఁడు. విల్లిపుత్తూరి వేశ్యల నాగరకతను ఎంతయో సుకుమారముగా చెప్పినాఁడు. రాయఁడు మహాదాత.

"పాత్రతఁజూతు లెస్స బరికించి, యతఁ డడు
గకయు నొకఁడు సెప్పకయు....................
ఒసఁగి వెలుఁగుపఱుచు టొప్పు."

అని దానవైఖరిం జెప్పినాఁడు. దీనిని వ్యాఖ్యానించుచు సంజీవనియందు 'ఈ యుపదేశము కృతయుగధర్మాశ్రితముగా నున్నది 'అభిగమ్య కృతే దానం' 'కృతే ప్రదీయతే గత్వా' అని ప్రతిగ్రహీతను దాత తాఁ జేరఁబోయి యిచ్చుట అని మాత్రము చెప్పఁబడినది. ఆ యభిగమనమున దాఁగిన రహస్యమును గాబోలు 'అతఁ డడుగకయు ఒకరు సెప్పకయు' అనియు అకస్మికముగాను అతిపుష్కలముగాను అనియు రాయఁడు నిజౌదార్యముతో నిందు వ్యాఖ్యానించినాఁడు. మఱి కలియుగాన 'సేవయా దీయతే కలౌ' అని యేదేని పని చేయించుకొని దానికి ప్రతిఫలముగా—కూలిగా—ఇచ్చుట దానక్రమము

అను స్మరించినాఁడు. ఈ పాత్రముఖ్యులలో చెప్పిన ప్రకారము ఎంత ఉత్కృష్టముగా హృదయంగమముగా నున్నది! రాయఁడు అట్లు ఆశ్చర్యము గొల్పునట్లు దానములు చేసిన వాఁడుగా నున్నాఁడు. తాను మెచ్చినదానినే కాదా గ్రంథస్థము చేయును. రాయఁడు మహావీరుఁడు, జేత. విజయనగరరాజ్యము ఏ యుద్దేశముతో నెలకొల్పఁబడినదో, తురకల ప్రాభవమును అడంచి హిందువులకు ఆపదలేని యోగక్షేమ ప్రతిష్ఠ గూర్చుట యను నాయుద్దేశమును కృష్ణరాయలవలె సాధించినవారు మఱిలేరు. అష్టాంగయోగమును జనకుఁడు ఉపదేశించినదానిని గ్రంథమున తాను జీవనువుట ఆసాక్షాత్కారానందమును తా ననుభవించినవాఁ డగుటచేతనే ఆ భావింపఁదగును. ఒక్క యల్పాంతివాక్యమున "ఇంతకంటె సులభోపాయం బాయోధనమున నయ్యధోక్షజుఁడు గాండివి కుపదేశించిన శరణాగత ధర్మంబ నిరపాయ ధర్మంబు' అని చెప్పినను, ఆయోగోపదేశంపు విరివిచే తనకు అంద తాత్పర్యమని సూచించి తన యనుష్ఠానమును ఊహింపఁజేసినాఁ డని తలంపఁదగును. ఆయాశ్వాసము ముగియఁగానే ఆశ్వాసాంతపద్యమున వేంకటేశునికి తొలి విశేషణంబుగా 'వకుళాలంకృత యోగిహృన్నిలయు' డన్నాఁడు.—ఆయోగి జన్మాది ప్రయాణపర్యంతము ఒకే దీప్తయోగముననే ఉన్నవాఁడు, తా నున్నచోటినుండి కదలకయే ఆవేశసేవాయోగముననే సేవించినవాఁడు, తపస్సుచేసి సాక్షాత్కా రించుకొన్న మహాయోగి [illegible] దేవశయందె సర్వ వాపిడ వేదమును ఉపదేశించినవాఁడు. ఇట్లు ఆయోగాన ఉపాయములును ఉపపత్తియు. రాయఁడు పరమ భాగవతుఁడును శిష్టుఁడును ఏకాదశీవ్రతానుష్ఠాతయు. అతిసము అనుచితం గన్నవాఁడు, తన యనుష్ఠానమునే పాంథ్యమహిపుయందు

"దశమినాఁ డేకభుక్తము సేసి. యవలినాఁ
డోర్చి జాగరముతో నుండు నిద్రి,
బారసి పోసీదు, ప్రైసిద్రఁ బాఱుట
క్కలి పాడు మత్స్యణ్యకధటఁద్రోయు."

అని అంత విపరముగఁ జెప్పినాఁడు. సత్యావధూప్రీణనమును రసమంజరిని తన రచనలుగా పేర్కొన్నవాఁడు తా నెంత రసికుఁడో! అంతఃపురవ్యవహారమున తాను ఎద్దిరో వికృతిగని, పారిజాతాపహరణమున "వామపాదంబున నా దొలఁగఁ ద్రోచె లతాంగి' యని వివి ప్రస్తుతం గన్నాఁ డని తన్నుంగూర్చిన యొక్క 'పుక్కిటి పురాణ' వ్యాప్తి

గలవాఁడు ఆ నత్యావధూప్రీణనమును ఎట్లుంగి వ్రాసెనో! వికృతిమాట మృష కాఁబోలు.

"పవలెల్ల దీర్ఘికాంబువు చల్లు పోరాట
నలసి, మృణాళికా జడములైన
బాహువులు....ఇత్యాది...
ప్రియల వేఁకువఁ దొరద నెవ్వరించి కలసి
రెలమి ధన్యులు దళవివెన్నెల బయళ్ళ - (II-61)

అనుటయందును హృదయములు తాఁకని వెడకౌఁగిలింతలతోఁడియు మేలుకార్యములకు చొలని సల్లాప చమత్కారములతోఁడియు దంపతుల పొందు (III-62) అనుటయందును రాయఁడు తన సొంత వృత్తమునే ఉటవినాఁడా అని నంటీవనిలో నందేహము సూచితము. విల్లుబుత్తూరిలో విష్ణుచిత్తుని భాగవతసేవను అతిథిసపర్యను 'తదీయారాధనను'

"ఆనిష్ఠానిధిగేహసీమ నడురే యాలించిన న్రోఁయు నెం
తే నాగేంద్రశయాను పుణ్యకథలుం దివ్యప్రబంధాను నం
ధానధ్యానము 'నాస్తిశాకబహుతా, నాస్త్యుష్ణతా, నాస్త్యపూ
పో, నాస్త్యోదనసౌష్ఠవమ్ చ, కృపయా భోక్తవ్య' మన్మాటలున్."

అని యిట్టివి భావించినవాఁడు, అట్టి భాగవతగృహాలు సొంతాన కలిగియు, చూచియు, తాను ఇట్టి జరుగుపాట్లు కలుగనట్లు పుణ్యక్షేత్రములు నందేందు తగిన యవేక్షణతోఁ సత్రములు ఏర్పాటుచేయకుండునా ?

## ఇది అది

కవికి ఎంత భావనాబలము గలవానికైనను, ఎంత ప్రతిభాశాలికైనను. తన పైని తన దేశకాలముల మహిమను అతిక్రమింప నలవిగాదు. కృష్ణదేవరాయఁడు ఆముక్తమాల్యదను చెప్పుచున్నాఁడు. ఆమెకాలపు దేశకాలస్థితులను ఆ కథలో ప్రవేశింప వలయును కాని తన కాలమువానిం జెప్పంగూడదు. వాల్మీకి వ్యాస కాళిదాసాదులు యుగాంతర పురుషుల కథలం జెప్పినారు. వారికి భావనావ్యాపారము ఎక్కువవలయును. రాయఁడు చెప్పిన కథ ఎంత ప్రాతదైనను ఈ యుగమునదే; కాఁగా వారికన్నను అందులకై తనకు పలయు భావనపని తక్కువయే. అంతియ కాక, వసంతగ్రీష్మాదుల

వర్ణనమున ప్రకృతి నాఁడును నేఁడును, ఎన్నఁడును ఒక్క తెలుంగే యగును. పరదేశమును, మెడిటరేనియన్ పట్టు, కాంగో మిసిసిపి అమేజాన్ తీరదేశములు-అను నటువంటిదానిని తన కావ్యమున వస్తువశమున ఆకర్షించు నక్కఱ లేకయున్న, మఱియు మనదేశమున జనులకు ఎంతలైన బాహ్యవుఁ బెను సంస్కృతి కరదములు తగిలినను, అవి ఎంత మార్పు జాలిసను, జనసంస్కృతి "నివేశః శైలానాం తదిద మితి బుద్ధిం ద్రఢయతి" అను న్యాయమున హిందూసనాతన ధర్మప్రవాహమున, రామాయణ మహా భారతములం దోఁచునదే, పైపొరలలో ఎట్లైనను, కంతలోను మూలకందానను మార్పు లేనిదే అని తలంపఁదగును. కావున ఆముక్తమాల్యద దేశ కాలములను గూర్చి ఇంచుక-

ఈ కథ పాండ్యమండలమునకు, విశేషముగా విల్లిపుత్తూరు, మధుర, శ్రీరంగము, కురుంగుడి మొదలగు శ్రీవైష్ణవ దివ్యక్షేత్రములకును, విష్ణుచిత్త యామున చండాలగాత్ర ప్రభృతి దాక్షిణాత్యులకును చెందినది గావున ఇందు ప్రాయికముగా అందలి క్షేత్రారామాదులును ఆ దేశముల జనులును తత్సంస్కృతి ధర్మము ఆచారములును పరామృష్టము లగుచుండును.

ఇండ్లవాకిళ్ళ ద్వారబంధముల మీద, గృహలక్ష్మి సింగారించు భావనతో, గజలక్ష్మియు ఆమెకు ఇటు నటు శంఖచక్రములను వ్రాయించి యలంకరించు వైష్ణవ గృహాలంకరణప్రక్రియ రాయని మెప్పువడసినదే. నగరవీథులు వట్టి మట్టి దొంకలుఁ గాక తెల్ల రాతి కంకరతో మట్టితములు అగుట కలిగినదే. వానికి ప్రక్కల అలంకరణార్థమును నీడకోసమును చెట్లు నాటుటయు. అందు పథికులు దప్పి తీర్చుకొనుటకును, గృహోపయోగమునకును కావలసినవారు చేదుకొనుటకును, వీథులలో కావలసినప్పుడు నీరు చల్లుటకును ఉపయోగపడుటకును అటనట బావులుండుటయు పౌరుల యారోగ్యాది రక్షణ (Sanitation)కు సౌకర్యమునకును, సంబంధించిన ఏర్పాటు. దేవళములలో ఆట పాటలునేర్చిన దేవదాసీజనము ఉండెననుట అబ్బురముగాదు, అది యిటీవలి వఱకునున్న దేవళముల యాచారమేగదా. బ్రాహ్మణులు శ్రీవైష్ణవులు అరుణోదయమునకే నదులున్న నదులలో, చెఱువులున్న వానియందు, జలసమృద్ధిగల వంటకాలువలయందు నములమును స్నానముచేసి తమదోవతి యంగవస్త్రములను తామ ఉదికికొని అందముగా పిండి పిడుచల చేసికొని కొంపోవుదురు. అటనట పోలీసులు - ఆరెకులు - విశేషముగా రాత్రులు, పురరక్షణకై కావలి 'beat'- తిరుగుచుందురు. పట్టణపరిసరములందును వరిచే లుండును. పండ్లయు పూవులయు తమలపాకులయు తోఁట లుండును. శ్రీ వైష్ణ

వులు భాగవతులు ఎక్కువ చదువులు చదువుకొననివారును తమ యింటను బయటను నిజమత సంప్రదాయమున ప్రబలి నాటుకొన్న భగవచ్ఛేషతయు భాగవత శేషతయు, అన్యోన్య నైర్యానుసంధానమును స్ఫురించు పరిభాషను, సంస్కృతమునకును ద్రావిడమునకును చెందినదానిని అప్రయత్నసులభముగా వాడుచుందురు. దాననే విష్ణుచిత్తుంవారి యింట నిత్యమందును జరుగు తదీయారాధనలందు "నాస్తి శాక బహుళతా, నాస్త్యుష్ణతా, నాస్త్యపూపో, నాస్త్యోదన సౌష్ఠవంచ, కృపయా భోక్తవ్యమ్." అన్మాటలు వినబడుట. [ఇది 'అతిథి దేవోభవ' అను వేదానుశాసన నిర్వాహము, 'పంచ నలయదు వేవురువచ్చి రేని నన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి, నతిథు లే తేర నడికిరేయైనఁ బెట్టు వలయు భోజ్యంబు లింట నవ్వారిగాగ — అనుదానికి భంగ్యంతర శ్రీ వైష్ణవ సంస్కారము.] దాననే ఆ విష్ణుచిత్తు గెల్పుటుత్సవమునను 'అద్ధా' 'అహో' 'ఆహా' 'ఆఃకృతతాం గతః కలిః' 'శ్రీ సూక్తి' 'ఇద్దొద్దత్యమగా ల్లయం హి కుధియాం' అను కేకలు వినబడుటయు. మాలదాసరియు - 'ఏను ఫలంబెఱుంగ. ఫలంబు వరమేశ ముఖోల్లాసంబు. ఆజ్ఞాకైంకర్యంబులకు ననుమతి కైంకర్యంబులకు ఫలపరిమాణగణన ప్రపన్నుల కేక్కడియది? (ఆ. 9-22) ఇత్యాది పలుకుటయు. భాగవతాభిఖ్యమునకు మంచి స్థితము లేర్పబడి యుండునా? రాజధానులకు అరుల కభేద్యములగు మిన్నంటు కోటలు పాతాళము దాఁకు అగడ్తలు ఉండెను. వ్యాపారమునకు సముద్రయానమును పరిచితము. అందు సముద్రమధ్యమునకు, నేలం దాఁకకయే ఒక దీవి యోడవారు వేఱుదీవి యోడవారి నరకులను కట్టల కొనలకు మూటలుగాఁ గట్టి అందిచ్చి మార్చుకొందురు. ఇది రూకలు ఎంచకే వస్తువినిమయరూపవ్యాపారము (barter). పాటమాధురికి ప్రమోదంల ఉగురింపను తాఁ గరఁగింపను శక్తి కలదు. ఇది పట్టి అతిశయోక్తియైన దానికి ప్రచారమేల? దోహదములు చెట్ల నకాలపుష్పములు పూయించునట్లు, అందు కొన్ని రాగములు అకాలవర్షములు కురియించుట మొదలగు అకాలకార్యములు సాధించును; ఆమార్గాన మేఘరంజిరాగమునకు వాన కురియును. ఇది దబ్బరయేని దీనికి ప్రతీతి ఎట్లు కలుగును. పొగతో కాటుక చేసికొనుట, పునుఁగును పూసికొననపుడు దానిని పచ్చత కాచి కరఁగించుకొనుట. సతి పసిదియు పతిపాదము లొత్తును. [మఱి యేతద్విపర్యయము కదా శృంగారమునఁ బ్రశస్తము.] విటులు పిలానినులతో తద్దర్శనమున రేఁగిన పచ్చి సరసోక్తు లాడుచుందురు. మాదిగవాడలో కాపురము చేయరాదు. భటుఁడు మఱువు దాల్పకయే యుద్ధజయము గొనుట ప్రౌఢ్యతిశయము. ధనికులు సం[?]ములలో కోట్లకు పడగ లెత్తుదురు.

పిలో పాటలులు పూచును. శాల్మలులు పండి పగలును. బొమ్మలు నేయుటకు బంగరు వెండి రాగి మొదలగునవి కరగించి అచ్చులం బోయుదురు. వేసవిలో ఏళ్లు ఎండగా చెలమలు త్రవ్వికొని ఆ చల్లని నీరుం గొందురు. మొసళ్లు గల యేటిరేవుం జెంత నీళ్లు ఇఱుకగా, ఆ మొసళ్ళు రాత్రులు ఊరిలో తిరుగును, కుక్కలు తఱుముగా బావులలో పడును. పూదోటలకు నీరు ఏతములం బాతింతురు. వానిం ద్రొక్కువారు శ్రమవినోదముగా బిగ్గ పాటలు పాడుచుందురు. చలివందిరులలో వెలందులు నరసాలాడుచు బాటసారులకు దాహము తీర్తురు. ఎండకు కాగిన వీథుల మావటను ఆవిరులు ఎగయుచుండును. వెన్నెలయు వానిని తగ్గింపలేకుండను, పగళ్ల వడకు ఎవ్వరును దిగ్గియలలో ఈదులాడుచునే యుందురు. 'సదావగాహ క్షత వారిసఞ్చయః'. రాత్రులం వెన్నెల బయళ్ళ నిద్రింతురు. వట్టివేళ్ల విసనల వీచుకొందురు. మఱి వేఱు చల్లగాలి యుండదు. చెఱకు తోటల కది నఱుకుడు కాలము. బావుల నీరు లోతునకు క్రుంగిపోయి పగళ్ళు మిక్కిలి చల్లగా నుండును. పొదుగు త్రాళ్లతో చేదుకొనవలయును. వాననకైన కొవ్వులోని మల్లెలు వెంట్రుకల కొనల చిట్లించును; అప్పుడు పాటలములు దానిని మాన్పి వెంట్రుకలం బోషించును. దోర మామిడిముక్కలతోడి చేపవేపుడు చాల రుచిగా నుండును. కాని తరువాత కనరు త్రేన్పులు వచ్చును. దానిని చల్లని యిసుకలో నుంచిన యెలనీటికాయల నీటితో తీర్చుకొందురు. వేసవిలో తెప్ప తిరునాళ్ళ చేయుదురు. అందు చందనము తాపహార ఫలాదులు వడపప్పు పానకములు వినియోగము చేయుదురు. యాత్రికులు వీథి యరంగుల పరుండుదురు. చాలసేపు ఉబుసుపుచ్చి నిద్రింతురు.

కేవలము లౌకికసుఖైకతత్పరుడుగా నున్నవారికి తటాలున దైవికముగా మనస్సు మాఱి మోక్షపరత కలుగుట మానసికశాస్త్ర సమ్మతమే అగును. దానిని 'Conversion' (మార్పు) అందురు. వానిని 'Convert' అందురు. నాటి పాండ్యరాజులు అటి 'Convert' లు, రాజు ఆస్థానమున సభ గూర్చి వాదములు చేయించి తత్త్వనిర్ణయము చేసి తాను దానిని అవలంబించుట లోకాన ఆమతపు బలమునకు వ్యాప్తికి గొప్ప చేయూత 'యథా రాజా తథా ప్రజా'. అట్లే ఒకడు చదువులే ఎఱుగనివాడు దేవుని యనుగ్రహమున ఆకస్మికముగా తటాలున గొప్ప పండితుడగుటయు, చిన్నప్పుడు మొద్దులని పేర్గన్న యెందఱో పిదప అసాధారణ పండితులైన కథలు మన యనుభవంపు నిజములు ఎన్నియో. కృష్ణరాయడు వైష్ణవమతమునకు 'Convert', క్రొత్తగా ప్రవిష్టుడు. అట్టివానికి నడమంత్రపు

ప్రష్ఠమునకు నామాలు మెండు అన్న సామెతగా మతాభినివేశ మెక్కువ. దేవళములకు దేవళ్ళకు ఆచార్యులకు విరివిగా ఇచ్చి పోషించినవాఁడు. ఇదెల్ల అతని పాండ్యరాజ కథాభిరుచిచేతను యామునుఁడు రాజై పాలించిన కథచేతనుం గూడ ఊహింపఁదగును. చారిత్రకముగాను అది సత్యమే.

పరాజితరాజు అడవికి వలసపోయి తన హితులం గూర్చుకొని యందుండి మరల తన దానిని జయించుకొనుటకు ప్రయత్నము చేయుచుండెను. కేశిధ్వజుఁడు ప్రాయశ్చిత్త ముపదేశించినందులకు ఖాండిక్యునకు గురుదక్షిణ యీఁగోరి వచ్చెను. ఖాండిక్యుఁడును కేశిధ్వజునకు తనకు పరతత్త్వమును దానిం జేరు యోగమును చెప్పినందులకు అర్పన గావించెను. సౌజన్య మన కట్టిది! గొప్ప పండితులు అందళంబుల రాకపోకలు గావింతురు. కూడ పరిజనము పాదూవాహులంటోనిదియు నుండును. అది ఆచారము. వాద జయ రూఢికి జేతను ఊరేగించుటయు. వాహన ఖగరాజు రెక్కల మ్రోఁత నేఁటి వాయువిమానముల మ్రోఁతను జ్ఞప్తి సేయును. మాననీయులకు మ్రొక్కు నప్పుడు గొడుగు విప్పుకొని యుండఁగూడదు. అది యపచారము. మూయుట మర్యాద. వరికళ్ళాన తరకలు పోవుటకు చేటలతో తూర్పాఱఁ బట్టుదురు. సాధ్వి సావిత్రికథలో యమవరమున పునర్జాతుఁడైన సత్యవతునిం గూడి తన మహారాజ సౌధమును జొచ్చెను, కుచేలుఁడు కృష్ణుం జూడవచ్చిన వాఁడు అచట నాతిథ్యము గొని యింటికి మరలఁగా అట నంతయు తనకు గుఱుతు తెలియనట్లుగా తన యిల్లు ఇంద్రస్థితి కోటీశ్వరునివి అనునట్లు మాఱియుండెను. ఇవి యుగాంతర పురాణ ప్రస్తావములు. మఱి విష్ణుచిత్తుఁడు వాదము గెలిచి తన యింటికి మరలినప్పుడు "నానాలంకారసహితంబును రత్నకాంచనమయంబును అగు నాత్మీయభవనంబుం గాంచి విస్మితుఁడై పుండరీకాక్ష మహిమాభిలబ్ధ వైభవంబుగాఁ దెలిసి ప్రవేశించి, తొంటికంటె శతగుణంబుగా భాగవతపూజా ప్రవణుండై యుండెను." ఇది ఈ యుగాన జరిగిన కథయే, అవిశ్వసనీయమగునా? ఐనను ఇది ఔచితిఁబట్టి రాయకల్పితంబుగా కన్పట్టును. ఆ కరములయందు మృగ్యము.

ఊరేగింపునకు చెవులు గింగురుమనునట్లుగా నానావిధవాద్యములు ఒక్కుమ్మడి మ్రోగింపఁబడును. దేనిమట్టుకు అది నిపుణముగానే వాయింపఁబడుచున్నను అన్నియుం గలసి పెద్ద ఘోషగా నుండును. ఏది యిష్టమైనవారు దానిచుట్టును మూఁగి వినుచు సాఁగుచుందురు. అందు అటనట ఊరేగింపు కొంత కొంత సేపు నిలిచి, నట్టు

పచెలువలు ఎదు రెదురుగా తిరిగి లాస్యమాడుచును మరల ఊరేగింపు సాగుచుండును. వీథి నిండిన జనము పొడుగున్నను ఇటునటు సామంతులు రాజకుమారులు అధికారులు ఏనుగులమీఁదను గుఱ్ఱాలమీఁదను ఎక్కి నడుచుచుందురు. ఇతర పట్టణాలయు పల్లెలయు జనము ఉత్సాహముతో అందు కలిసికొని నడుచుచుందురు. వేశ్యమేళములు అనేకములు వచ్చియుండును. నటులు గాయకు లందఱు సమాగతులై యుందురు. అందఱు పూర్వ పరిచితులు మిత్రులు ఒండొరులం గాంచి ఎచ్చరికలు చేసికొనుచు ఎగతాళు లాడుచు ఇట్లు అతి కోలాహలముగా నుందురు. ఇట్లు దక్షిణదేశమున గొప్ప తిరునాళ్ళ యుత్సవములు ఊరేగింపులు ఇప్పటికిని ఇంచుమించుగా ఈ విధముగానే జరుగుచుండును. బయటి యూళ్ళ నుండి వచ్చినవారు ఆ పూట బంధులయు మిత్రులయు నిండ్ల గొప్ప యాతిథ్యమును అంగీకరించి తమ యూళ్ళకు తరలుదురు.

'యథా రాజా తథా ప్రజా' అనునది మత విషయమున చాల పాటింపు గలది. రాజవలంబించిన మతమువారికి ఆస్థానమున ఆదరగౌరవములు. రాజువలన అట్టివి కోరి దాంభికులును ఇచ్ఛకులును అందు చొచ్చుటయు కలదు. ఇతర మతముల వారికి రాజ చేతో వైశాల్య సంకోచములం బట్టి ఆదరానాదరములు.

జనులకు జ్యోతిషమందు విశ్వాసము గలదు. 'జన్మరాశికి మూఁడవరాశియందుండు సూర్యుఁడు శ్రేయఃప్రదుఁడు. కూఁతులు అత్తగారింటనే కాపురము చేయుచుండి గర్భిణులైనపుడు కాన్పునకు పుట్టింటికి వచ్చు నాచారము గలదు [మఱి శాకుంతలమున కణ్వముని గర్భిణిని లేఁతచూలు దానిని శకుంతలను మగనింటికి పంపివేసెను. 'మరల నేనెపుడు ఇక్కడికి వచ్చుట' యని యడుగఁగా, 'మునులితోవ వానప్రస్థాశ్రమమున చొచ్చు భర్తం గూడి' అని తాను బదులు చెప్పెను కాని, కాన్పునకు పిలిపింతునులే అని యనలేదు. మఱి వాల్మీకి వివాసిత సీతను కఠోర గర్భను రక్షించినపుడు, 'జనకుఁడు నాకు పరమమిత్రము, నాయాశ్రమమును నీ పుట్టినిల్లుగానే భావింపుము' అన్నాడు. 'తన్మా వ్యథిష్ఠా విషయాన్తరస్థం ప్రాప్తాసి వైదేహి పితుర్నికేతమ్.' ఇది భర్తవలని దెప్పరమున రక్షణకు పుట్టినిల్లు ఆశ్రయించుటయు కానోపును.] దొంగతనముం గూర్చి రాజుతో ఫిర్యాదుచేసిన, రాజు దొంగను వెదకించి పట్టింప జతనపడఁగా, దొంగ దండనాదికము తప్పించుకొనుటకై సొత్తుగలవారింటికి అట్లట్లు తానగపడకుండ చోరితమును చేర్చుటయు గలదు. పూర్వము మంచి రాజ్యమున పోలీసులు ధార్మికులై యున్నంతవఱకు దొంగతనము పట్టువడుచును, చోరితము పునర్లభ్యమగుచునుండెను గాని నేఁడు వారు

దొంగలకు షరీకును వారితో రహస్య భాగస్థులును ప్రేరకులుం గూడను ఐపోయిన తరువాత ఇఁక చోరితపునర్లబ్ధి యుండునా ? మార్దంగికులు తమ వాద్యమునకు అక్కఱతో ఎఱ్ఱకుచ్చులు వేలాడు తెల్లజాలరులతోడి బురఖాలు తొడుగుదురు. తిరునాళ్లం జూడ వచ్చినవారు ధ్వజారోహణసమయమున ఆయూరిలోనున్న అవరోహణమునకు ముందు ఆ యూరిని వదలి పోఁగూడదు. అక్షేమకరము - అని జనులకు నమ్మక ముండెను. ఆనమ్మకము ఇప్పడును కలదు. ప్రాయికముగా తోఁటకంచెలలో గేదంగులను నాటుదురు. అవి ముండ్లుకలవగుట తోఁటకు మంచి రక్షకము. అవి వానాకాలమున పూచును. ఆ పొదలలో నాగలు పరిమళలుబ్ధులు కాపురముండు ననుటయు ప్రసిద్ధము. ఇప్పుడును అట్లే. చెఱకును వేసవిలో నాఁటుదురు. అది శరదృతువునకు నిడుపుగడగా ఎదిగి అన్ని రంగల నిండుకొనును. శరత్తులో పండ్రాలును. వర్షలో సూర్యుని చుట్టును గాలి గుడికట్టుట ప్రకృతిలో కలిగినదే కదా. తొలివానలలో వడగండ్లు రాలుట కలదే ఐనను, ఇవు వధి విరళముగానే యన్నది మఱి రాయఁడు వర్షలో వానిని మాటిమాటికిం బ్రస్తావించుట ఆకాలమున ఆయనరాజ్యాన ప్రాయికమగుటను సూచించును కాఁబోలు, వానకు నేలలో-బీళ్ళలో-వచ్చిక దట్టముగా మొలచును. పాయలు ఎండిన నదులలో వెల్లువలు లేచి వడిపడిగా, భయంకరము లగుచునే, రమణీయములునై సముద్రముం జేరును. అడవులలో నెమళ్ళు కూయును. ఇండ్లలో పెంపుడువియు కూసి ఆడుచుండును. పాముల సందారము ఉండును. ఇంద్రజాలికులు ఐనుమను గరిక నెమలికుంచె అనువానిని తమ యాట బరికరముగా వాడుచుందురు. దక్షిణాపథమున ఇప్పటికిని అడవులు, దండకమిగుళ్లు, గలవు. కృష్ణరాయని కాలమున అవి ఇంకను విస్తారముగనే యుండును. రాయఁడు తన పయనములలో వర్షలో అక్కడి ప్రకృతిని చెట్లపూలను కాయలను నెమళ్ళను చూచియే, కేవలము గ్రంథపఠనమునుబట్టి కాక, ఈ వర్షవర్ణన చేసియుండును. ఆటల ప్రేక్షాగృహంబులును అందు వరదాలును పాత్రలాడునపుడు వానిని పట్టుటయు తొలగించుటయు మడ్డెల మ్రోగించుటయు పరిచితములే. వడగండ్లు రాలిన వానిని నోట వేసికొను దావలమును అపుకొనలేరు. మఱి దాన చలివండ్లు పడును. దారుల బురదకు వెఱచి మృగములు కొండలమీఁదనే గుంపులుగా నుండును. పక్షులు గూళ్ళలో పిక్కిలి ముడుచుకొని వడఁకుచు కదలక మెదలక ఉండును. బెగ్గరు లన్ననో మేఘముల దాపున అఱుచుండును. దాల సంతోషకారణము కలిగినపుడు ఆకలిదప్పులు తెలియవు. సంతోషకార్యమే సాఁగును. దుర్దినములు పదిల్లగా సూర్యుం జూడక తినని వ్రతముగలభారికి అతనిం గనిపెట్టుటే పని.

సంధ్యావేళ యెప్పుడో ద్విజులకు తెలియరాదు. సేద్యగాండ్రు అనుకూలించిన యా కాలమున చల్లకము చేయుదురు. అడవిమల్లెలు పూచును, సంతలు చెదరిపోవును. అతిథులు ఎక్కడికిని పోలేక వస్తుంటుండియుండును. ఆకాలమున ఇంకను దేశాన మట్టిమిద్దెలు మెండుగా నుండినవి. అవి వానలో కరియును. ఇక పాంథులబాధ చెప్పవలయునా? సేద్యమునకు దున్నలను ఎడ్లను సమానముగానే పూన్చుచుండిరి. ప్రజలకు కట్టెలు నాని మండనందున వంటవసి చాల క్లేశకారి యయెను. కెరొసీను నూనెయు అగ్గిపుల్లలు లేని ఆకాలమున వానముసురుల నిప్పు చేసికొనుట వినిపించు పని. అందును విశేషముగా అనాథులకు. ఇల్లిల్లు తిరిగి ఒక నిప్పుకణిక సంపాదించుకొని దానిని ఉపాయముల నూది మండించి ఎట్లో వంటచేసిన, ఆవండిన యన్నము ముందు తినువారికే ఐపోవును స్త్రీలు మరల ప్రయత్నము చేసి అది యెంత సేపటికి ముగియక పడుకటిల్లు చేరఁబోరు అక్కడ పీటికై కాంతులు కౌగిళ్ళగై కినుపెట్టుకొని వేగించుచు విసుకకోనుచు ఉందురు పూరింఢ్లవారు గడపకడనే కంచాలు కడిగికొందురు. పెద్ద జల్లులో గాలి గొడుగును వంగఁగొట్టును. బాటసారులు తడియుచునే నడువవలయును. అట్లు వారు వియోగబాధను కొంత తీర్చుకొందురు. రచ్చలు దొరకిన అందు చేరుదురు. అంతలోనే లేనిపోని వాదములు తీవ్రముగానే చేయుదురు. ఇంతలో జల్లు తగ్గిన, ఎక్కడివా రక్కడికి చెదరి పోవుదురు. కాకులు పిథిచెట్లపై గూళ్ళుకట్టుకొనును. వానయైనందున కాపులు సేద్యపుఁబనులకై పంట చేనియందే గుడిసెలో కాపురముందురు. వారికి ఇండ్ల నుండి భార్యలు గూడలు దాల్చి అంబళ్ళు మోసికొనిపోవుదురు. చుట్టును వాన, వాకిలికి గూడ మూత, గుడిసెలో ఆ దంపతులకు చలికి వెచ్చని యొంటిపాటు. వారు ఆ పనులనడుమనే కాముని యాటలను కొంత యాడుదురు. ఆ వానకారులో సంపన్నులగు రెడ్లు అప్పుడు సులభములగు పలు ఆకుల మిశ్రమపు గూరను చింతపండురుతో చేర్చి పొరంటి ఆసాధకముతోనే వేడివేడి చిన్నారుగిబియ్య పన్నమును కలుపుకొని దండిగా నూనె పోసికొని గొంతుదాఁక తినుదురు. చలివినోదముగా మంచముక్రింద మేకెరువు కుంపటి అంటించి పెట్టుకొందురు. ప్రక్కనే కట్టివేసియున్న దూడలచే హితవుగా దేహమును నాకించుకొందురు. అనఁగా సంపన్నులయ్యు, అనాగరికపు భోజనమును పడుకయు ఉబుసును కలిగియుందురు. సంపన్నులయ్యు వినీతనమును పాఁటివాడుకలను మానరు. మఱి రాజులన్ననో భోగులు, ప్రొద్దెక్కి మేలుకొందురు. వారు నెమళ్లను పెంచుదురు. అనెమళ్లకు బంగారు రతనాలవన యష్టులు. వానిపైన ఉండి అవి కూయుట వారికి మేలుకొలుపు. అంతట మంచినువాసనలతో

నలుగు పెట్టించుకొని చాలసేపు వేన్నీళ్లతో స్నానము సేయుదురు. తళతళని సన్నని దోవతి కట్టుకొని మణిహారము వేసికొని వాసనగల మొగలిరేకును తురుముకొని జామైన తరువాత కొలువొసంగుదురు. తరువాత అడవి జంతువుల శ్లాఘ్యంపు మాంసముతో రాజనాల యన్నమును దంచిగా నేయి పోసికొని ఆరగింతురు. కస్తురి యెక్కువగా వేసి గమాయించు తమ్ములము సేసి అగరు చెక్కలు రాజు ఇనుప బండికుంపటి పెట్టుకొని మేడకిటికీలవద్దఁ బ్రియలంకూడి ఉఱుములవాన చూచుచు హాయిగ కాలము గడుపుదురు. ఒక్కొక్క విషయమును రెడ్లకన్నను రాజుల నాగరకత రసికత ఎక్కువగా చెప్పఁబడినది. రెడ్లు అట్లుండకున్న రాయఁడు అట్లేల కల్పించును? హేళన చేయనేల? అది నాఁటి వస్తుస్థితియే యన తలంపఁదగును. ఇటీవలఁ గూడ రెడ్లు వట్టి యొడలును తలకుఁ పలుబారల వెనుమోపు తలగుడ్డయు తమకు ఏకలక్షణముగా చుట్టుకొని యుండిరి కదా.

శరత్తున తామరలును కలువలును పూచి సరస్సులు కనువిందు లగును. ఆకసము నలుపెక్కును. సూర్యచంద్రనక్షత్రములు కాంతియెక్కును. వెన్నెల అతిరమణీయము. వరులు పండును. దోసలును. చెఱకు పండి బ్రాలును. నల్లని మింట తెల్లని మేఘ ఖండములు. ఏడాకులయరఁటులు పూచును ఇందుపుగింజగందము వండునీటిని తేర్చునకుట ఎఱిఁగినవిషయమే. మబ్బువిడిచిన యెండల వేఁడి!

నీచకులజులు గాక ఉత్తమకులజులగు బ్రాహ్మణోత్తములను దుర్గాధిపతులు చేయుట రాజ్యమునకు క్షేమకరము. వారు విశ్వసనీయులు, ఎప్పుడును రాజునకు తిరుగఁబడరు, నీతిశాస్త్ర మెఱిఁగి అధర్మము చేయ వెఱచు : యనుమశ్లీన బ్రాహ్మణులను ఏఁబదియేండ్లు దాఁటి డెబ్బదికి లోనగువారిని మంత్రులుగా నుంచుకొనుట శ్రేయము. అట్టి యుత్తములు దొరకకున్న, గుణహీనులు అపకారు లగుదురు గాన వారిని మాని, సొంతముగానే తోఁచినట్లును చేత వచ్చినట్లును పనులు చేసికొనుట శ్రేయము. గొప్ప కార్యములకు ఒక్కనినే అధికారిగా పెట్టక పలువురిని నియమించుట శ్రేయము. బ్రాహ్మణునే గొప్ప యధికారమున నియమించుట శ్రేయము. అతఁడు క్షత్రియ. శూద్రుల పరిహాసమునకు వెఱచి కార్యసాధకుఁడగును. మఱియు అతఁడు రాజును చక్కఁగాఁ గొలిచి బ్రదుకుట తన ధర్మమని యెఱుఁగును. దేవాలయముల ధనమును పొరపాటుననైనను బొక్కసమునకు రానీకూడదు. ఏలన అది రాజుం జెఱుచును. రాజు రాజ్యమునకు తొలుత బయటి శత్రువుల తొలఁగించుకొని తరువాత

లోపలి క్షుద్రుల నడంపవలయును. కొండెగానిని తటాలున తఱిమివేయఁగూడదు. ఒక పాటిగా ఉంచుకొనియే యుంచవలయును. కొందఱ నడవులనుండు ఎఱుకుల పొరుగూళ్లను కుదురుగ నొక చోటనుండి సేవచేయని శూరుల నిచ్చిన వారొండొరులపై వ్యాపృతులగుట తక్కిన రాజ్యమునకు క్షేమము. పార్వతీయులు స్వల్పమునకే అతిమిత్రు లగుదురు. అది తెలిసి మెలఁగవలయును. [ఇట్లు రాయఁడు యామునాచార్యులచే ఉపదేశింపించిన రాజ నీతియెల్ల ఆ రాజ్యాన అనుష్ఠానరూఢ మని ఎన్నఁదగును.]

గోద్రాలికి అనుంగు బిడ్డ అదృష్టవశమున దొరకి చిత్తమున వాత్సల్య మేపారిన స్తన్యంబు తానై పుట్టుటయుఁ గలదు. యంత్రకారుఁడు లోహనాళమున అశ్మముల నేయుట అనఁగా ఫిరంగివాఁడు కోటంగూల్ప గుండ్లను పఱపుటం జెప్పుటచే, రాయని కాలమున ఫిరంగులు యుద్ధాయుధములలో నుండెననియు వానిని కోటం గూల్ప నుపయోగింతురనియు తెలియుచున్నది. లోకాన తల్లిపోలిక కూఁతునకు చెట్ట, కొడుకునకు గుణము అనియు, తండ్రిపోలిక కూఁతునకు గుణము, కొడుకునకు చెట్ట యనియు సాముద్రికమునందోని విశ్వాసము అప్పుడును కలిగి యుండినది. దోహదములు గ్రంథ ప్రసిద్ధములే కాని అనుభవప్రసిద్ధములు కానట్లుతోఁచును. దోహదములు యథావిధిగా అనుష్ఠించి చూచినం గదా? రాయఁడైనను చూచియుండునా? మాళవికలో కాలాన పూఁక వెనుకఁజిక్కిన యశోకము మాళవికతన్నుతో నిండార పుష్పించిన దని కాళిదాసు చెప్పినాఁడు. మఱి యవి గ్రంథముల కెక్కెక్కెనో!

ఆ కాలమున దేవళములందలి యర్చలు తాము నోరు విప్పి భక్తులతో మాటలాడుట విశ్వసనీయముగానే యుండెను. స్వప్నమున తెలుఁగు వల్లభుఁడు కృష్ణదేవ రాయనితో ఆముక్తమాల్యదం జెప్పు మని నోరువిప్పి ఆదేశించెను. విష్ణుచిత్తునితో వడపెరుంగోయిలొడయఁడు మధురరాజు నాస్థానికిం బోయి వాదించి గెలువుమని ఆన తిచ్చెను. మఱియు తన కూఁతు వ్యాధిం గూర్చి ఆయనతో మొఱయిడ, దాని కలరూపును తద్వారణోపాయమును తాను నోరు విప్పి - అర్చకముఖముగాఁ గాదు - ఆనతిచ్చెను. శ్రీరంగమున రంగనాథుఁడును విష్ణుచిత్తుఁడు తన కూఁతు రగపడమికి దుఃఖించి తన యెదుర నాగాత్యము చేయఁగా ఆయనతో ఎలనవ్వుచు వావిచ్చి నీయింటం జూచుకొమ్ము, నీకూఁతు రందే ఉన్నది యని పలికెను. ఆమె అట్లే అందు అగపడినది.

ఆ కల్యాణ విభవమంతయు రాయఁడు పూర్ణవిశ్వాసముతోను భక్తిపరాకాష్ఠతోను చెప్పినదే.

భక్తప్రపత్తులకును దేవుని యనుగ్రహమునకును చదువుతో పనిలేదు. జాతితోను పనిలేదు. విష్ణుచిత్తుఁడు చదువు పుట్టుగడ్డియైన బ్రాహ్మణ వైష్ణవ భక్త ప్రపన్నుఁడు. దాసరి మాల, భక్తితత్పరుఁడు పాటలో చెక్కుల నానందాశ్రులు ప్రవాహముగా పాఱువాఁడు. పుట్టుప్రపన్నుఁడు. వినుకలిసాంగత్యాదులచేత జ్ఞాని, బ్రహ్మరాక్షస్సుకు ఎంతయో ఉపన్యసించి 'చంపకు చదువుల' నని యనిపించుకొన్నవాఁడు. "విష్ణుతో నివ్వల నొక్కవేల్పు గణియించిన పాతకినౌదు" ననుటచేతను "ఏనుఫలం బెఱుంగ ; ఫలంబు వరమేశు ముఖోల్లాసంబు; యాజ్ఞాకైంకర్యంబులకును అనుమతి కైంకర్యంబులకు ఫలపరిమాణగణన ప్రపన్నుల కెక్కడియది ? కాన బంధకం బగుట ఫలం బింతంత, యందుఁగొంతఁ గొమ్మన వెఱతు. భగవంతుండ రక్షించు" ననుటచేతను భాగవతప్రపన్నానుష్ఠాన పరమ రహస్యమును అనుష్ఠానపర్యంత మెఱిఁగినవాఁడు. (దీన రాయఁడును ఈ పరమ రహస్యములను తానును నిజానుష్ఠానపర్యంత మెఱుంగు ననుట సిద్ధము.) బ్రహ్మరాక్షసుని పూర్వజన్మవృత్తాంత వివరణమున లెన్నగా చదివిన బ్రాహ్మణులు, పౌరోహిత్యవృత్తులు, అందందు వైదికవేషంబుననే ఎంత నీచపు బ్రతుకును, అతి భయంకర రానంతర జన్మముం దెచ్చుదానిని, బ్రదుకుచుండిరో ఉదాహరింపఁబడినది. అతఁడు అధీతిబోధంబులు ప్రపన్నరహస్యపర్యంతము ఎఱింగి, "విష్ణువుతో నివ్వల నొక్క వేల్పు" ఇత్యాది యొట్టు ప్రపన్నుని నోట ఎంతటిదో ఎఱింగి దాని గణనచేసి వానిని విడిపించినవాఁడు. అతఁడు మరల రాఁగానే అతని ప్రపన్నత నిజమని చిత్తమున కెక్క అతని పాట చరణమైనను తన్నుం గావగల మహిమశాలి యని యెఱింగి, ఇవుడు నమ్మకము పొసఁగ, వాని పాదములం బట్టుకొన్నవాఁడు.

ఆ కాలపు దారి దోపిళ్ళ విధమును ఆ దొంగల పన్నుగడలను పాంథులు వారికి బలియగు విధమును వారిని తప్పించుకొను విధములును ఆకాలమున అందందు జరుగునవి రాజై తాను ఎఱుంగఁగలిగినవి, రాయఁడు దీన నుదాహరించెఁగావలయు.

## ఆముక్తమాల్యద రచయిత ?

ఆముక్తమాల్యదను కృష్ణదేవరాయఁడు కలలోని దేవుని యాదేశముబడి తా రచించితి నని అందు తన స్వప్నవృత్తాంతమును దాని తన యనుష్ఠానమును చెప్పి

యున్నాఁడు. ప్రతి ఆశ్వాసాంతమును 'కృష్ణరాయవసుధాధ్యక్షోదిత...... ఆశ్వాస మాద్యంబు' 'కృష్ణరాయ మహీభృన్నామాస్మత్... ఆశ్వాసము ద్వితీయంబు...' 'కృష్ణరాయమహిజాన్యుత్పాదిత.... ఆశ్వాసము సప్తమంబు....' అని విస్పష్టముగా ఏడింటి యవసానమునను చెప్పుకొనియున్నాఁడు. శ్రీహర్షుఁడు తన నైషధమున విలక్షణముగా ప్రతి సర్గకును కడపట ఇన్నవ సర్గ ముగిసినది అని "....దశమ స్తస్య వ్యరంసీ న్మహా కావ్యే చారుణి నైషధీయచరితే సర్గో నిసర్గోజ్జ్వలః" అనియు, "....మహా| కావ్యే తద్భువి నైషధీయచరితే సర్గోఽగమత్ షోడశః" అనియు, "ద్వావింశో నవసాహసాఙ్కచరితే చమ్పూకృతోఽయం మహా| కావ్యే తస్య కృతౌ నలీయ చరితే సర్గో నిసర్గోజ్జ్వలః" అనియు అందలి యిరువదిరెండు సర్గలయు కడపట అద్భుత ప్రౌఢప్రసగ్ధరలు చెప్పినాఁడు. శ్రీ రాయఁడును ఇందు అట్లే అతులితమత్తేభములం జెప్పి ఆ మహాకవిని అనుకరించినాఁడు. ఇట్లు మఱి యెందుండనో, ఇఁకను "రచయిత ఎవరు" అను విప్రతిపత్తికి ఎడము ఎక్కడనున్నది ? కవి తన పేరును ఇంత సుఘటితము చేసియుండఁగ ఇఁక నేమి ?

ఐనను రాయనికాలమువాఁడైన తెనాలి రామకృష్ణకవి ఒక చాటువున "అల్లసాని పెద్దన తెల్పె ముది మది దప్పి యాముక్తమాల్యద" అని చెప్పినట్లు కొంత జన విశ్వాస ముండుటచేతను, అప్పకవియు "ఆంధ్రకవితాపితామహుఁడు 'కొనియె' ననుటకు 'కొనె' నని చెప్పె.... విష్ణుచిత్తీయమునందు" అని చెప్పి యుండుటచేతను, అట్లే పూర్వ వ్యాఖ్యాతలు దీనిని పెద్దనకృతం బనుటచేతను, నిజముగా ఆముక్తమాల్యద రచయిత యెవరు అని విప్రతిపత్తి పొడమి దానిని నిర్ణయింపవలసి ఏర్పడినది. "కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే" అని యిత్యాదిగా కావ్యప్రయోజనములం జెప్పుచు కావ్యప్రకాశమున మమ్మటాచార్యుఁడు 'అర్థకృతే-' అన్నందులకు "శ్రీహర్షాదేః ధావకాదీనా మివ ధనమ్." అని వివరించినాఁడు. దీనింబట్టి కొందఱు ధావకుఁడనువాఁడు శ్రీహర్షునివలన ధనముగొని, తన పేరుం జెప్పక, హర్షుని పేరనే ప్రియదర్శికారత్నా వళ్యాది నాటకాదులను రచించినాఁడు, "శ్రీహర్షో నిపుణః కవిః" అనుట ఉత్తమాట యనిరి. అదియైనను ఎంత సత్యమో ఎవ రెఱుంగఁగలరు ? రుజువు ఏది ? అట్లే రాయఁడు పెద్దనకు ధన మొసంగి, మడిమాన్యము లిచ్చి, తన పేర ఆముక్తమాల్యదను వ్రాయించు కొనెను.-అని. "అర్థకృతే" అను శాస్త్రమునకు దీని నొక యుదాహరణముగా

కొందఱు గ్రహించునట్లున్నవి. అంతట రచయిత రాయఁడా? పెద్దనయగునా. అవి ఇపుడు వాదములు సేయఁబడుచున్నవి.

రాయఁడేమో పుట్టాంధ్రుఁడు కాఁడు తెనుఁగు అతని తల్లిభాష గాదు. అతఁడు కర్ణాటుఁడై నృపులతో 'బాసాడి', ఆంధ్ర మెఱింగినవాఁడు. అట్టివాఁడు ఇంత ప్రౌఢ కావ్యము వ్రాయఁగలఁడా ? — అని ఒకటి. మఱి బృహదాంధ్ర నిఘంటు నిర్మాత, సకలాంధ్ర కావ్యములను వ్యాఖ్యానింపించి అచ్చు వేయించినవాఁడు, ఆంధ్రతత్త్వవేది, ఆంగ్లుఁడు బ్రౌన్‌దొర ఎట్టి యాంధ్రమును వ్రాసియుండునో, మాటాడియుండునో. ఉదాహరణము మృగ్యము గాని, అతఁడు ఆ భాషనిగూఢ రహస్యములతో ఈ యాముక్త పర్యంతము తా నెఱింగినవాఁడు. పుదూరు ద్రావిడులు, ఆలువలు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారు. మఱి వారికన్నను ఆంధ్ర కవియు పండితుఁడును ఉండునా? వారివి ఎన్ని పద్యములో అచ్చము కృష్ణరాయనివే పెద్దనవే అను భ్రమగొల్పునవి తన్నాటకములం గలవు. కావున ఇది నిలుచు వాదము గాదు. రాయఁడు తన గీర్వాణ కృతులుగా ప్రస్తావించిన మదాలసచరిత్రాదులలో కొన్నింటిసుండి ప్రపంచదర్పణ మను నొక యప్రకాశిత లిఖిత పుస్తకమునుండి రసమంజరి సత్యావధువులవి అని శ్లోకములు ఒక్కెడ ఉదాహరింపఁబడినవి. మఱి ఈవియు అల్లసాని పెద్దన పేరనే ఉన్నవి. దానిం బట్టి రాయఁడు చెప్పిన సంస్కృత గ్రంథము లన్నియు ఉత్తవి కావు నిజములే అనియు, లోకాన ఏకారణముచేతనో అవియు నిశ్చితముగ పెద్దన మహాకవి పేరనే వ్యవహృతము లనియు ఎట్లో భ్రమమైపోయె ననియు ఊహింపఁదగును. సకల భాషావాగనుశాసన నన్నయయు, ఉభయ కవిమిత్ర తిక్కనయు డిండిమజేత శ్రీనాథుఁడును పెద్దనయు సంస్కృత రచనలును ఏవేని చేసియుండరా? అవి ఉత్త బిరుదులా ? మఱి తెలుఁగునాఁడు సంస్కృతయుగము దాఁటిపోయినది. కావున వానికి ప్రచారము సంపాదించుట సులువుకాక పోయినది. ఆ రచనమున్నచో రచయితృ ప్రీతికిని తాత్కాలిక పండితగోష్ఠి మెప్పునకును కొంత రాజసమ్మానమునకును పర్యాప్తమై మఱి క్రిందికి ఇవలికి దిగదాయెను. అది యుండనీ. రాముచాదకము లందు రాయని ముందలి తాత్పర్యముతోనే వ్రాయఁబడినవానియందు, ఈ కృతిం గూర్చిన ప్రస్తావము లేదే అని యనుచున్నారు. మఱి స్వప్న వృత్తాంత కావ్యరచనా ప్రతిజ్ఞతోను ఆశ్వాసాంత పద్యములతోను ఇట్టిది యొకటి దీపించుచుండఁగా, ఇది యుండుట మన కన్నను ఎంతో సన్నిహితులుగా వా రెఱుంగరా ? వారు ఎఱ్ఱంగెనైన, ఇటో అటో, దానిని సూచింప

కయే ఏల విడుతురు ? తెనాలిరామకృష్ణుఁడు ఒక తట్టునకు మ్రొగ్గియే యుండెను. కావున అందు లేకపోవుట ఏ కొటికిని బలము గూర్పదు. ఇఁక చిరకాలమునకు తరువాత వ్రాయఁబడిన వ్యాఖ్యాతలమాట ఇట్లు నూడిగా లేపఁబడిన విప్రపత్తి కలిగినపుడు న యమునకు సాయపడదు. వ్యాకరణ దోషాదుల కలిమిలేములును ఏకాంతముగ నిర్ణ మునకు ఒదవవు. దోషమా అను నిశ్చయమే తొలుత తేలదు. కృష్ణరాయని యాస్థా శ్రీనాథుఁడు విరాజిల్లిన యాస్థానలను, వాని యనుషంగమున వేదాద్రిమంత్రి యాస్థాని తలఁచుకొని సౌరిది నన్నింటిందలపోసికొన్న "ఇట్టి కవులకు నేను వాకట్టుకొ చెప్పినాఁడ..............పాండురంగ విజయ"మను రామకృష్ణునియా 'వాకట్టు', ధీ అదెట్టిదో అబ్బ ! మఱియు 'కృష్ణరాయఁడే యైన ఉపనిషదాదులను ఎఱిఁగి చెప్ప పెద్దనయే యైన దేఁవ వేషుడు మొదలైనవి ఎఱింగి చెప్పునా, అను విచారము మంద ప్రతిభకు అన్నింటి యెఱుకకు దారులుండును. నామిత్ర మొకఁడు నాతో టోడుపి తిరుగుచుండువాఁడు ఎన్నఁడును అంతగా వ్రాయనివాఁడు ఒకప్పుడు నాకన్నను మేఁ దగిన వ్రాఁతలను సొంతముగా, నా తెలుక లేకయే ప్రకటింపఁగా అన్మదుభయపరి లెంతటో అవి యాతని పేరి నా వ్రాఁతలే యగును అతనివిం గావన్న యవిశ్వాసమ ఎంతయో పలుకుచుండి రనుట విజానుభవవిదితము. మఱియు రాయని నాటి చారి విషయములందు, నందేహముల యెడ, ఇట్లే అట్లు గావను నిర్ణయమును రూఢిసేయు ఇంకను ఎంత సామగ్రి వలయునో ఎంత విచారము వలయునో. మన దిపు డ సామరస్యయుగము, అన్ని మతములకు చోటుగలది, నమాధానములు సులువయిన కావున ఈ విప్రతిపత్తియందు గ్రంథములో పొందినదానిని అటులే అంగీకరింప శ్రేయము. అదియు శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రులవారి సంజీవనియందు అ కృతము, డాక్టర్ సి. ఆర్. రెడ్డి ప్రభృతులచే అనుగృహీతము.

మనుచరిత్రయందలి రాయలవంశావళి అట్లే తుచ తప్పక ఆముక్తలోను ఉండు మాత్రమే కాదు, అది కారణములచే మర్షణీయ మగును, అంతియ కాక మనువునందలి దశావతారాది యితరపద్యములును అట్లే పదపాదాంశ భేదములతో ఆముక్తలో నున్నవి. మఱియు మనువునందలి పెక్కు పద్యముల ప్రౌఢ మనోహరాసాధారణపు పెత్తు గతలను పోకడలును, అతిశ్లాఘ్యములు. మాలతీమాధవములోనివి ఉత్తర చరితలోను,

ఉత్తరచరితవి మహావీర చరితమునను ఉన్నయట్లు ఆముక్తమున నున్నవి. అక్కడనో భవభూతి యొక్కఁడే, ఇక్కడనో ఇరువురు పెద్దనయు రాయఁడును కలసికొని కూర్చినారు ఏర్చినారు పేర్చినారు, ఏకవాక్యత అని యనిపించినారు— అని యెన్నందగును.— ఒక యుదాహరణము—ఇది మనువులో సాయంకాలపుఁ జక్రవాకి—

"క్రుంకె పంకజబంధుఁడు, ఆ సమయంబున—

ఏవిహంగముఁ గన్న నెలుఁగించుచును సారె-
కును సైకతంబులఁ గూడఁ దారుఁ :
దారి కన్గొని యది తన జోడు గాకున్న
మెడ యెత్తి కలయంగ మింట నరయు ;
నరసి కన్నీటితో మరలి తామర యెక్కి
వదన మెండఁగ సరోవారి నద్దు ;
నద్ది త్రావఁగ సైప కట్టిట్టు గన్గొని
ప్రతిబింబ మీక్షించి భ్రమసి యుఱుకు ;
నుఱికి యెలుకలు దడియ, వేరొక్క తమ్మి
కరుగు, నరిగి రవంబుతోఁ దిరుగు తేంట్లఁ
బొడుచు ముక్కున మఱియును బోవు వెదక
నంజ ప్రియుఁ బాసి వగ నొక్క చక్రవాకి."

ఇది యాముక్తమున శరత్ కేకి—

అర్కమండలి కభ్ర మడ్డమైనంతనె,
యెఱ మాని మోము బిట్టెత్తి చూచి ;
ఘుమఘుమధ్వని గాలి గుహ దూరఁ, బురి యొకిం
చుక యెత్తి కని తలంచుకొని పంచి ;

నిష్కృష్టకేతకి నేత్రాంబు వార్త్రి, భే
కప్పఁదెంకి పడియచోఁ గణఁక మొగ్గి,
కేకతఁ ద్వ్యక్షివనతగ్రీవమై రాక యొ
క్కింతం తార్చి, వాత నేమేమొ కమిచి ;
వెదలు ఓితెందకును శరద్వ్యృక్ష మీఁగి
వార్షికమె యెక్కి, త్రోటి నిర్వంకఁ బక్ష
ములను నివురుచు, వెట్టిచూపుల నురంబు
కెలఁకులఁ గనుంగొనుచుఁ గానఁ గేకులుండె.

రంగనాయకులపేట
నెల్లూరు
1-12-1966

భాగవతశ్రీపాదరేణువు
నే. రామదాసు

శ్రీరస్తు

# ఆముక్తమాల్యద

## ప్రథమాశ్వాసము

### ఇష్టదేవతాస్తుత్యాదికము

శ్రీకమనీయహారమణిఁ
జెన్నుగఁ దానును, గౌస్తుభంబునం
దాకమలావధూటియును
దారతఁ దోఁపఁ, బరస్పరాత్మలం
దాకలితంబులైన తమ
యాకృతు లచ్ఛతఁ బైకిఁ దోఁచి, య
స్తోకత నందుఁ దోఁచె నన.
శోభిలు వేంకటభర్తఁ గొల్చెదన్.

మ. సిరి నొక్కప్పుడు కన్మొఱంగి హరి దర్వీశప్రహర్షించు ను
ర్వరకు న్వంచనఁ గూడఁగాఁ గలుగు భాస్వచ్ఛంద్రశాలాపరం
పర లయ్యె న్పొఱ పైన యెవ్వని ఫణాపంక్తు ల్భజింతు న్నిరం
తరముం దాంతుని నయ్యనంతుని నతిత్రబ్రహ్మకల్పాంతునిన్.

సీ. ఖనటత్పయోద్ధి వీక్ష్య రసాతలాన్వేష్య
పిండీకృతాంగ భీతాండజములు,
ధృత కులాయార్థ ఖండిత సమిల్లవరూప
చరణాంతికక్రమ త్తరువరములు,
ఘన గుహా ఘటిత ఝూంకరణ లోకైక ద్వి
దుంమభీకృత మేరు మందరములు,
చటుల ఝంపా తరస్స్వర్నగరీ విపరీత
పాతితాకాకోణ పరిభ్రాధములు,

తే. శ్రుతిలలిత బాలికాకృతేరమ్మదములు,
కాన్వ్వరేరమ్మదీకృత బాదబములు
వలగ సత్రామాత్పత్ర ప్రభంజనములు,
వృజినతూలౌఘములఁ దూల విసరుఁగాత. ౩

## విష్వక్సేనుని బెత్తమునకు వందనము నల్పుట

ఉ. పూని ముకుందు నాజ్ఞఁ గనుబొమ్మనె కాంచి యజాండభాండము
ల్వానను మీఁదఁ బోవ నడుప న్గొనెఁ దన్నన నగ్రనిశ్చల
త్వానచలత్వనిష్ఠలె సమస్త జగంబుల జాడ్యచేతన
ల్గానుతికెక్కు సైన్యపతి కాంచనవేత్రము నాశ్రయించెదన్. ౪

## పాంచజన్య వర్ణనము

మ. హరి పూరింపఁ దదాస్య మారుత సుగంధాకృష్టమై నాభివం
కరుహక్రోడమిళింద బృంద మెదు రెక్కం దుష్షిక్యయావంక సం
కర చైత్యాను పరంపరం గముచు రేఖం బొల్చు రాకా నిశా
కరగౌరద్యుతి పాంచజన్య మొసఁగుం గళ్యాణ సాకల్యమున్. ౫

## నందక వర్ణనము

మ. ప్రతతోర్ధ్వాధరశాగ పీఠ యుగళీ శాన్పత్త స్వరు స్తంభ సం
స్థితిఁ దీంద్రించెడు జాలువా మొనలివా దీప్తార్చిగాఁ గజ్జలా
న్వీత ధూమాసిత రేఖ పై యలుఁగుగా విజ్ఞాన దీపాంకురా
కృతి నందం బగు నందకం బహులతాశ్రేణి ఛ్ఛిదం జేయుతన్. ౬

## కౌమోదకీ వర్ణనము

ఉ. యాదవసార్వభౌమ భయదాయత బాహునియుక్తిఁ జేసి యెం
దే దనుజేంద్ర సాళ్వపుర హేమమణీవరణంబు నంగతం
బై దివి నాత్మకంకణము లం దొకె కంకణ మయ్యె నట్టి కౌ
మోదకి మోదకీలిత సముజ్జ్వల కల్పకమాల్యఁ గొల్చెదన్. ౭

## శార్ఙ్గ వర్ణనము

చ. విడికెడు కౌనుఁ గొప్పుఁ గని ప్రేమఁ ద్రివక్ర సమాంగిఁ జేసి, తేఁ
బిడికెడు కౌనుఁ గొప్పుఁ బయిఁ బెచ్చు గుణంబును గంటి నంచు, నే
ర్పడఁగ నిజత్రివక్రతయుఁ బాపఁగఁ ద్రొక్కెడు నా, సుమాళిపైఁ
జడిగొన నమ్ము లీను హరి శార్ఙ్గధనుర్లత గాచుఁ గావుతన్. ౮

## సుదర్శన వర్ణన

చ. అతరు గళాస్రధారలు మహాముఖ వాంత సుధాంబు ధారలు
న్వ్రతవగు వహ్నికీలములుఁ బొంగును గాఁ, బెలువైత్యకోటికి
న్వెడిదవుఁ గిన్కతో నెసరు వెట్టిన పెద్దపనంటిఁబోలె, నె
క్కుడు వెన రాహు మస్తకముఁ గొన్న సుదర్శన దేవుఁ గొల్చెదన్. ౯

## పన్నిద్దఱు సూరులం దలంచుట

మ. అల పన్నిద్దఱు సూరులందును సముద్యల్లీలఁ గా పున్న వె
గ్గలవుం దాపముఁ బాప నా, నిజమనః కంజాత సంజాత పు
ష్కలమాధ్వీకఝరి న్మురారి సొగియంగాఁ జొక్కి ధన్యాత్ము లౌ
నిల వన్నిద్దఱుసూరులం దలఁతు మోక్షేచ్ఛామతిం దివ్యులన్. ౧౦

వ. అని యిష్టదేవతావందనంబుఁ జేసి మున్నే కళింగదేశ విజిగీషా మనీషం దండెత్తిపోయి విజయవాటిం గొన్నివాసరంబు లుండి శ్రీకాకుళ నికేతనుం డగు నాంధ్రమధుమథను సేవింపం బోయి హరివాసరోపవాసం బచ్చటఁ గావింప నప్పుణ్యరాత్రి చతుర్థయామంబున. ౧౧

## కలలో ప్రత్యక్షమైన తెనుఁగు వల్లభరాయని వర్ణన

సీ. నీలమేఘముడాలు డీలు సేయఁగఁ జాలు
మెఱుఁగుఁ జామనచాయ మేనితోడ,
నరవిందములకచ్చు లడఁగించుజిగి హెచ్చు
నాయతం బగు కన్నుదోయి తోడఁ,
బలుఁగురాయనిచట్టువలవన్నె నొరవెట్టు
హొంబట్టుజిలుఁగు రెంటెంబుతోడ,

నుదయార్కబింబంబు నొఱపు విడంబించు
దొరలంగనాడు కౌస్తుభముతోడఁ,
తే. దమ్మికే లుండఁ బెఱకేల దండ యిచ్చు
లేము లుడిపెడు లేఁజూపులేమతోడఁ
దొలఁకుదయఁ దెల్పు చిఱునవ్వుతోడఁ గలఁ ద
దంధ్ర జలజాక్షుఁ డి ట్లని యాన తిచ్చె. ౧౨

భగవద్వాక్యము

సీ. పలికి తుత్ప్రేక్షోపమలు జాతి పెం పెక్క
రసికు లౌనన మదాలసచరిత్ర,
భావ ధ్వని వ్యంగ్య సేవధి గాఁగఁ జె
ప్పితివి సత్యావధూ ప్రీణనంబు.
శ్రుతి పురాణోపసంహిత లేర్చి కూర్చితి
సకలకథాసారసంగ్రహంబు,
శ్రోత్రఘుచ్ఛటలు విచ్చఁగ రచించితి సూక్తి
నైపుణి జ్ఞానచింతామణికృతి,
తే. మఱియు రసమంజరీ ముఖ్య మధురకావ్య
రచన మెప్పించుకొంటి గీర్వాణభాష,
నంధ్రభాష యసాధ్యంబె యందు నొక్క
కృతి వినిర్మింపు మిఁక మాకుఁ బ్రియము గాఁగ. ౧౩

ఉ. ఎన్నిషఁ గూర్తునన్న, విను, మే మును దాల్చినమాల్య మిచ్చు న
ప్పిన్నది రంగమం దయిన పెండిలి సెప్పుము; మున్ను గొంటి నే
వన్ననదండ యొక్క మగవాఁ డిద, నేను దెలుంగురాయఁడ,
గన్నడరాయ, యక్కొడుకుఁ గప్పు ప్రియాపరిభుక్తభాక్కథన్. ౧౪

ఆ. తెలుఁగ దేల యన్న, దేశంబు దెలుఁ, గేను
దెలుఁగు వల్లభుండఁ, దెలుఁగొ కండ,
యెల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి,
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స. ౧౫

క. అంకితమో యన;. నీ కల
వేంకటపతి యిష్ట మైన వే ల్పగుటఁ దవీ
యాంకితము సేయు; మొక్కొ-క
సంకేతముగా కతఁడ రస న్నేఁ గానే. ౧౬

తే. పొత్త మిటు సేయ నీ కు త్తరోత్తరాభి
వృద్ధి, యని పోవ, మేల్కొ-ని, వెలుఁగుతోడి
భక్తిఁ ద ద్గృహగోపుర ప్రణతిఁ జేసి
వేగుటయుఁ గల్యకరణీయ విధులు దీర్చి. ౧౭

వ. నిం డోలగం బుండి దండనాథ సామంత సందోహంబులం బిలిపించి బెండల కదన మందిరంబుల కనిపి వివిధ వేదాగమ విదులగు విద్వజ్జనంబులఁ గాని పించికొని నమస్కరించి యాశుభస్వప్నంబు వినిపించిన హర్షించి వారును సవిస్మయస్వాంతులై 'దేవా, దేవదేవుండు విజయంబు చేసిన యాస్వప్నం బనేక శోభనపరంపరలం దెలుపుచున్న యది. ఎట్లనిన, ప్రథమ మ వ్వత్మేక్షణు స్వప్నసాక్షాత్కారం బితోధికభక్తియు, నతండు ప్రబంధనిబంధనంబుఁ గావింపు మనుట యితోధికాగాధసారస్వతోద్బోధంబును, నతని దేవీసమాగమం బితోధికాఖండభాండాగారసమృద్ధియు, నతని యాసతిచేతి విశదశతచ్ఛదం బితోధికాద్వితీయసితచ్ఛత్రితయు, నతం డశేషనృపసేవం దత్త ద్భూష లెఱుం గవె యనుట యితోధిక సమస్త సామంత సమాజ సమాకర్షణంబును ప్రియోపభోగ పరిశిష్టభోగం బింపనుట యితోధిక బహుప్రేయసీప్రాప్తియు కృతిచెప్పు మ త్తరోత్తరాభివృద్ధియగు ననుట యితోధికాపత్య పరమాయుర వాప్తియు, నగు. నఖర్వమహిమాతిధూర్వహుండగు తుర్వసువంశంబునం బుట్టినట్టి నీకిట్టి శోభనపరంపర లేమద్భుతంబు, లవధరింపుము. ౧౮

సీ. కలశపాథోరాశిగర్భ వీచిమతల్లి
గడుపార నెవ్వానిఁ గన్నతల్లి,
యనలాక్షు ఘనజటా వనవాటి కెవ్వాఁడు
వన్నె వెట్టు ననార్తవంపుఁ బువ్వు,
సకలదైవత బుభుక్షాపూర్తి కెవ్వాఁడు
పుట్టు కామని లేని మెట్టపంట,

కటికి చీకటితిండి కరముల గిలిగింత
నెవ్వాఁడు తొగకన్నె నవ్వఁజేయు,
తే. నతఁడు వొగడొందు మధుకైటభారిమఱఁది,
కళల నెలవగువాఁడు చుక్కలకు ఱేఁడు,
మినిమినివరసీమ వలతాలు మేనమామ,
వేవెలుంగులదొరజోడు రేవెలుంగు. ౧౯

తే. ఆసుధాధాము విభవ మహాంబురాశి
కుబ్బు మీఱంగ నందనుఁ డుదయ మయ్యె
వేదవేదాంగశాస్త్రార్థ విశదవాన
నాత్రధిషణాధురంధరుం డైన బుధుఁడు. ౨౦

క. వానికిఁ బురూరవుఁడు ప్ర
జ్ఞానిధి జనియించె సింహసదృశుఁడు తద్భూ
జానికి నాయువు తనయుం
డానృపతికి తనయుఁడై యయాతి జనించెన్. ౨౧

క. అతనికి యదు తుర్వసులను
సుతు లుద్భవమంది రహితసూదనులు కళా
న్వితమతులు వారిలో వి
శ్రుత కీర్తి వహించెఁ దుర్వసుఁడు గుణనిధియై. ౨౨

తే. వానివంశంబు తుళువాన్వవాయ మయ్యె,
నందుఁ బెక్కండ్రు నృపు లుదయంబు నొంది
నిఖిల భువన ప్రపూర్ణ నిర్నిద్రకీర్తి
నధికు లైరి. తదీయాన్వయమునఁ బుట్టి. ౨౩

మహాస్రగ్ధర

ఘనుఁడై తిమ్మక్షితీశాగ్రణి శతమఖగ్రావ సంఘాతవాతా
శనరాడాశాంతదంతి స్థవిరకిరుల ఝంఝాటముల్ మాన్పి యిమ్మే
దిని దోర్దండైకపీఠిన్ జిరము వఱిచి కీర్తిద్యుతుల్ రోదసిన్ బ
ర్వ నరాతుల్ నమ్రులై పార్శ్వములఁ గొలువఁ దీవ్రప్రతాపంబు నూఁపెన్,

క. పితృజనని యత్తిమ్మ
క్షితిపగ్రామణికి దేవకీదేవికి నం
చితమూర్తి యీశ్వరప్రభుఁ
డతిపుణ్యుఁడు పుట్టె సజ్జనావనపరుఁడై. ౨౫

చ. బలమదమత్తదుష్ట పురభంజనుఁడై పరిపాలితార్యుఁడై
యిలపయిఁ దొంటియీశ్వరుఁడె యీశ్వరుఁడై జనియింప రూపతెన్
జలరుహనేత్రలన్ దొఱఁగ శైలవనంబుల భీతచిత్తులై
మెలఁగెడు శత్రుభూవరులు మేనులఁ దాల్చిన మన్మథాంకముల్. ౨౬

సీ. నిజభుజాశ్రిత ధారుణీ వజ్రకవచంబు
దుష్ట భుజంగాహితుండికుండు,
వనజేక్షణా మనోధన పశ్యతోహరుం
డరిహంసనంద దభ్రాగమంబు.
మార్గణగణపిక మధుమాస దివసంబు
గుణరత్నరోహణ క్షోణిధరము,
బాంధవసందోహ పద్మవనీ హేళి
కారుణ్యరస నిమ్నగాకళత్రుఁ.

తే. దన జగంబుల మిగులఁ బ్రఖ్యాతిఁ గాంచె
ధరణిధవదత్త వివిధోపదా విధా స
మార్జిత శ్రీవినిర్జిత నిర్జరాల
యేశ్వరుఁడు తిమ్మభూపతి యీశ్వరుండు. ౨౭

క. ఆయీశ్వర నృపతికిఁ బు
ణ్యాయతమతియైన బుక్కమాంబకుఁ దేజ
స్తోయజహితు లుదయించిరి
ధీయుతు లగు నారసింహ తిమ్మనరేంద్రుల్. ౨౮

క. అందు నరసప్రభుఁడు హరి
చందన మందార కుంద చంద్రాంశు సితా
స్పంద యశస్తుందిల ది
క్కందరుఁడై ధాత్రి యేలెఁ గలుషము లడఁగన్. ౨౯

సీ. అంభోధి వసన విశ్వంభరావలయంబు
ఘనబాహుపురి మరకతముఁ జేసె;
కకుబంత నిఖిల రాట్కటకంబుఁ జరణ మం
జీరంపు సాలభంజికలఁ జేసెఁ
మహనీయ నిజ వినిర్మల యశస్సరసికి
గగనంబుఁ గలహంసకంబుఁ జేసె;
సత్రాంతర విప్రాణ నాసారలక్ష్మికిఁ
గవికదంబముఁ జాతకములఁ జేసె;

తే. నతిశిత కృపాణ కృత్త మత్తారివీర
మండలేశ సకుండల ముకుటనూత్న
మస్తమాల్య వరంపరా మండనార్చి
తేశ్వరుండగు నారసింహేశ్వరుండు. ౩౦

తే. ఆ నృసింహప్రభుండు తిప్పాంబవలన
నాగమాంబిక వలన నందనులఁ గాంచె,
వీరనరసింహరాయభూవిభుని నచ్యు
తాయతాంశజు శ్రీకృష్ణరాయ నిన్న. ౩౧

క. వీరనృసింహుఁడు నిజభుజ
దారుణ కరవాల పరుష ధారాహత వై
రారి యగుచు నేకాతప
వారణముగ నేలె ధర నవారణమహిమన్. ౩౨

క. ఆవిభుననంతరంబ ధ
రావలయముఁ బూని తివు రహిమై దిరుమ
ల్దేవియును నన్నపూర్ణా
దేవియుఁ గమలాబ్జముఖియు దేవేరులుగాఁ ౩౩

సీ. తొలఁగెను ధూమకేతుక్షోభ జనులకు,
నతివృష్టి దోషభయంబు వాసెఁ,
గంటకాగమభీతి గడచె, నుద్ధత భూమి
భృత్కటకంబెల్ల నెత్తువడియె

మాసె వపుస్స్ఫూర్తి, మరుభూములందును
నెల మూఁడు వానలు నిండఁ గురిసె,
నాబాల గోపాల మఖిల సద్ద్విజమును
నానందముగ మన్కి నతిశయిల్లెఁ,

తే. బ్రజల కెల్లను గడు రామరాజ్యమయ్యెఁ,
జారుసత్త్వాఢ్య, యీశ్వర నారసింహ
భూవిభుని కృష్ణరాయ యభ్యుదయమొంది
పెంపుతో నీవు ధాత్రిఁ బాలింపఁగాను. ౩౪

క. భువియలు తొమ్మిది యఁట! పదు
నెనమండ్రఁట మోచువా రనేకప కిటి కూ
ర్మ నగాహు! లేటి లావరు!
లని తావకబాహు వొకటి యవని భరించెన్. ౩౫

సీ. తొలుదొల్త నుదయాద్రిశిలఁ దాఁకి కెరలు నీ
యసి లోహమున వెచ్చనై జనించె;
మఱి కొండవీ డెక్కి. మాఱ్కొని నలియైన
యల కనవాపాత్రు నంటి రాఁజె;
నట సాఁగి జమ్మిలోయఁ బడి* వేగ దహించెఁ,
గోన విట్టేర్చెఁ; గొట్టానఁ దగిలెఁ;
కనకగిరి స్ఫూర్తిఁ గరఁచె; గౌతమి గ్రాఁచె;
నవుల నాపొట్నూర రవులుకొనియె;

తే. మాడెములు వ్రేల్చె; నొడ్డాది మసి యొనర్చెఁ;
గటకపురిఁ గాల్చె గజరాజు గలఁగి పఱవఁ
దోఁక చిచ్చన; నౌర నీ దురవగాహ
ఖేలదుగ్రప్రతాపాగ్ని కృష్ణరాయ. ౩౬

ఉ. చిత్రము, కృష్ణరాయనృపశేఖర నీదగు ధాటి కోడి న
ర్వత్ర నిలింప కామినుల వాడకుఁ గాఁపులు పోయి, రుత్కల

* పా. వేఁగి.

క్షత్రియపాత్రులెల్లఁ గనుగందని మేనులఁ దొంటిపెద్ద లే
సూత్రముఁ బన్నినారొ బలసూదనుపీఁటికిఁ గొండపీఁటికిన్! ౩౭

ఉ. కూరిమిఁ గృష్ణరాయ నృపకుంజర చేరెఁ గళింగ రాజ్యల
క్ష్మి రమణీ లలామ నిను మిన్నులు ముట్టిన మోహనాలతోఁ.
గారణ మట్ల. లక్ష్మి గనుగందని వేడుకఁ గృష్ణరాయవిం
జేరువకాక, వావి సెడఁ, బెందునె సోదరుఁడైన రుద్రునిన్? ౩౮

సీ. కచనక్త ఫణికంచుకము మౌళి పీరకే
దారంపుఁ బాగ చందంబు నొందఁ,
గలయ నంగమున మర్కటకీటకృత మైన
మగ్గంబు నేత్రసంపద వహింప,
ధ్వాంత గహ్వర శిలాతాడితాశిక చిక్క
జాత్రవంతము చంద్రవై పొనంగఁ,
దను భృశ క్రాంతవేష్టన లగ్న బర్హిబ
ర్హంబు మువ్వన్నె చుంగై చెలంగ,

తే. నిద్ర మేల్కాంచి, సెలయేట నీరఁ గాంచి,
గోపవేషంబు నెడి, తొంటి భూపవేష
మగుట యవ్వనమహిమగా నలికి యచటు
విడుచు గజరాజు పీఠాటి వింధ్యవాటి. ౩౯

చ. అభిరతిఁ గృష్ణరాయ విజయాంకము లీవు లిఖించి తాళన
న్నిభముగఁ బొట్టునూరికడ నిల్పిన కంబము సింహభూధర
ప్రభుతిరునాళ్ళకుం దిగు సురప్రకరంబు కళింగమేదినీ
విభు నవకీర్తి కజ్జలము వేమఱు పెట్టి పఠించు నిచ్చలున్. ౪౦

సీ. సనకాది దివిజ మస్కరి పాలి గోపి చం
దనపుండ్రవల్లిక ల్మాకి నాకి,
సెలపి హాహాహూహూవుల దండియల తంత్రి
త్రెవ్వ సింగిణులుగాఁ దివిచి తివిచి,
సప్తర్షి కృతవియజ్ఝర వాలుకాలింగ
సమితి ముచ్చెలంకాళ్ళఁ జమరి చను?,

రంభాప్రధానాప్సరఃస్పృహూరోజకుం
భంబు లెచ్చటఁ గన్నఁ బట్టి పట్టి,

తే. తిరుగు హరిపురి సురతరు సురల మరగి
బహుళ హళహళి కృత కలబరిగనగర
సగర పురవర పరివృఢ జవన యవన
పృతన తవ దని ననిఁ దెగి కృష్ణరాయ. ౪౦

మ. అలుక స్ఫోటక తట్టికా ఖురపుటీ హల్య స్ఫురాసాని ప
చ్ఛలు వోఁ దున్ని తలచ్ఛముఁ గజ మదాసార ప్లుతి స్ఫీతి వ
ష్కల సస్యం బిడి, యేకధాటి బళిరా కట్టించి తౌ దృష్టి తే
దులఁ బా వోగ్ర కపాల మర్దప హరి ద్రాఘాంగల శ్రేణికిన్! ౪౨

చ. సుమతిఁ బునఃపునా రచిత షోడశదాన పరంపరా వసం
తముల ననంత విత్తము ననంత ననంత మహాగ్రహార బృం
దముల నొసంగు విన్నారని తా రెన రాక కదా విలింప భూ
జములు వహించు దుర్యశము షట్పద కోకిల కైతవంబునన్. ౪౩

తే. ప్రబల రాజాధిరాజ వీరప్రతాప
రాజవరమేశ్వ రార్థదుర్గానదేశ
సాహితీసమరాంగణసార్వభౌమ
కృష్ణరాయేంద్ర కృతి వినిర్మింపు' మనిరి. ౪౪

వ. అంతఁ బ్రహృష్టాంతరంగుండ నై. ౪౫

షష్ఠ్యంతములు

క. అంభోధి కన్యకా కుచ
కుంభాంభిత ఘుసృణమసృణ గురువక్షునకుఁ
జంభారి ముఖాధ్యక్షున
కంభోజాక్షునకు సామి హర్యక్షునకున్. ౪౬

క. మర్దితకాళియఫణికిఁ గ
వర్ధ కృ దళ బింబితాచ్ఛవదనఘృణికిన్.

దోర్దండ శార్ఙ్గకిణి కషు
కర్దమదినమణికి దనుజకరివరసృణికిన్. ౪౭

క. గుహవృష్కరిణీతట మున
గహనగుహాఖేటవంచక పుళిందునకుఁజ
ద్రుహిణాండతుందున కయా
వహదీర్ఘాపాంగదృక్ కృపాస్యందునకున్. ౪౮

క. బంధురరథాంగధారా
గంధవహోత్పత్త్యలబ్ధికావటలపున
స్సంధుక్షణమ్మృతతాహుప
లాంధోన్నృత్యత్ప్రతతికి వేంకటాచలపతికిన్. ౪౯

## కథాప్రారంభము

వ. నా విన్నవింపఁ బూను నాముక్తమాల్యదా మహాప్రబంధమునకుఁ గథాక్రమం
బెట్టి దనిన. ౫౦

## విలుబుత్తూరివర్ణన

మ. లలితోద్యాన వరంపరా పిక శుకాలాప ప్రతిధ్వానము
ల్వలభీ నీల హరిన్మణీ పిక శుక స్వానభ్రమం బూన్ప మి
న్నులతో రాయు సువర్ణ సౌధముల నెందుం జూడఁ జెన్నొందు శ్రీ
విలుబుత్తూరు సెలంగుఁ బాండ్య నగరోర్వీ రత్నసీమంతమై. ౫౧

చ. మలిచి పయోజ కోశముల మాడ్కి నొనర్చిన పద్మరాగపుం
గలశపు బెట్టిడాల్పొమిడికంబులతో నవరంజి యోడుబి
ల్లల వల వై జయంతముఁ జలంబున గెల్వఁగ దంశితంబు లై
నిలిచిన యట్లు మాడువు లనేకము లుల్లసిలు న్పురంబునన్. ౫౨

సీ. పాథోధి జలయుక్తిఁ బ్రాఁచిపట్టిన దిశా
కరులు నాఁ దగు మరకతపుఁ గరులఁ,
గరులఁ దొండము నిక్కఁ గబళించి ప్రమింగిన
హరులు నాఁ దొండ మొప్పగుఁ ధదళ్ళ

శివ సిద్ధ ద్వంద్వ బృందాలయ విలసట కల్యాణమంటపద్రుమలో నా
నవజాక్షస్యందనద్వంద్వము లిఖిత వరావాప్త దాంపత్య మొప్పన్. ౫౮

సీ. నవలయధ్వని గాఁగ సారెఁ ద్రేయు వదల్చి
యతినైన గుండె జల్లనఁ గలంప,
నుడివిన మొగమెత్తి చూడకుండు పరాకు
కుసుమబాణుని నైనఁ గువిటుఁ జేయ,
శ్రీకార్య పరులఁ గాంచిన లేచి మ్రొక్కు నం
జలికి నింద్రుండు నక్కొలువుఁ గోర,
హరిగృహావసరశంఖాకర్ణనకుఁ ద్రిప్పఁ
గళగంటి జిగి వ్రజుఁ గాఁడి పాఱఁ,

తే. గవఱ లుంకించి వ్రేయఁ గొప్పవియ నవలి
కరముచ నమర్పఁ బైఁటతో మరుని బటువు
విల్లుత్రియఁ బట్టఁ గంచెలఁ బిగువుఁ జన్ను
నిక్కఁ దిన్నెలఁ బాత్రాళి నెత్తమాడు ౫౯

సీ. పిడెంపుఁ బలుకెంపు విరిసి వెన్నెల గాయ,
వరిగింజ నొకటఁ బల్వరుసఁ దోమ,
నొరసి యెత్తిన మణుం గొందక మ్మైనెని
గ్గులు దేరఁ బసు పిడి జలక మాడ,
ముదుక గాకుండఁ బయ్యెదలోనె గేలార్చి,
కలయఁ జంటను నొట్టఁ గలప మలఁద,
రతిరయచ్ఛిన్న సూత్రముఁ జిక్కక ముత్తె
ములు రాలఁ గరగరికలు వహింపఁ,

తే. రొంసినవి యొట్టువరునైనఁ గులమ్ముఁ దెలియఁ
బ్రభుత సెడి వల్లవుఁడు ద్రేఁద వడిన నేఁడ,
నృపతి వెలియంతిపురముగా నెన్న మెలఁగ,
దాసఁ గృతి సెప్ప వలఁతు రప్పద్మముఖులు. ౬౦

ఉ. అంచిత హారవల్లి వలయాభరణంబుల తక్కఁ ద్రోయఁ బి
ల్కంచుఁ బసిండి, యేణమద మంగముఁ జేర్చుట తక్క రోయ బి

ర్ధించు జిరాది, ధూపితమ యందుట తక్క విదుర్చుఁ బూవుఁ జె
మ్మంచు, జిలుంగెదక్క నగుయౌవత మొత్తు నటించు నన్యముల్. ౬౧

ఉ. వేచిన మేతఁబై వంభి వేణికఁ జంట వహించి విప్పఁగాఁ
బూవులు గోట మీటుతతిఁ బోయెడు తేఁటుల గ్రమ్మఁత కామి శం
కావహ మౌఁ గృతాభ్యసన లౌటను దంతవు మెట్ల వెంబడిం
జే వడి వీణ మీటుటయుఁ జి క్కెడలించుటయు న్స్మరింబడన్. ౬౨

క. ఆశివచః కార్పణ్యం
బా లేమల చెవులు సోఁక దధమాన్వయ జీ
ర్ణాలావణ్యం పిలుపున
కై లాభముఁ దెలిపెనేని నవి శ్రీలగుటన్. ౬౩

చ. ద్రవిడ కుటుంబిను ల్పనుపు రాచిన రత్నపుఁ దావ క్రింద నం
బువు దెరవాబఁగా నిదురపోయి గరుత్తల వచ్చబాతినన్
శవనరోమరాశములు ధర్మమయద్చద గుచ్ఛవిస్ఫుర
ద్ద్విజధునీ మరాళ వితతి భ్రమఁ బూన్చుఁ బురి న్స్ఫురించుచున్. ౬౪

మ. తలఁ బక్షచ్ఛట గ్రుచ్చి బాతువులు కేదారంపుఁ గుల్మాంతర
స్థలి నిద్రింపఁగఁ జూచి యార్తకు లుష స్స్నాతప్రయాతద్విజా
వలి పిండీకృత శాటిక ల్పవి దదావాసంబుఁ జేర్పంగ రే
వుల డగ్గ న్మోనఁ బాబువానిఁ గని నవ్వ న్మాలిగోప్యోమముల్. ౬౫

మ. సొరిదిం బేర్చిన తీఁగమల్లియలు ఖర్జూరంబులు న్పుష్పమం
జరులు న్మామిడిగుత్తులు న్గసుమము ల్పంపెంగలు స్వచ్ఛగ
న్నెరులు న్పాళలు గల్గి రాజనపుఁ గాంతం దారు ము ల్పూవి చే
లరుదార న్మగుఁ బూవుఁదోఁటల బలాతానీకదంభంబునన్. ౬౬

చ. బలసిన నాల్లకచ్చటలపైఁ దమ జుంజుబుముద్దు రాయఁగాఁ,
గలమము లుండుఁ బండి యొఱగంబడి పి రెతలింపఁ దృప్త లోఁ
దం కొన, వంగి ముల జలముఁ ద్రావెడు క్రిందటి వ్రేళ్ల మీదటన్
నిలిపి, మరంద మాను కరణి న్నికటోపవనానిలాహతిన్. ౬౭

చ. అడుగునఁ బండి ప్రేలి యనలై మధువుట్టఁగఁ, ద్రావఁ దేంట్లు మ
ల్లడి గొవి చుట్టు రాఁ, బనసల న్పొలుచు న్గలుగుండ్లతోడ పీ

ద్వేషు పేనుఁబండ్లు, దిన్నకట పొంసుల ధూళి మదాంబుసేచనా
జడద్రుఢశృంఖలాయుత వసంతనృప ద్విరదాధిపాకృతిన్. ౬౮

ఉ. బాల దళంబుగాఁ బృథుల చంపక కీలనఁ బొల్చు పొందుఁ దో
మాలె లవంగఁ బంధి మహిమండలిఁ జీఱుచు వ్రాలి గంధ మూ
ర్చాలస యైన భృంగతతి నాఁ దుదక ప్రమర ప్రలాపకు
ల్యాలి గెల ల్సుగంధికదళీ వన పంక్తుల నొప్పు నప్పురిన్. ౬౯

చ. మన కనురక్తి హెచ్చ నిదె మం దని కంఠముఁ గౌఁగిలించి ని
క్కిన ఫణిరాజవల్లి యొఱఁగింపఁగ నో యనఁ బూగము ల్పరం
బుగఁ బడు మట్టచేఁ జెఱకు ముత్తియము ల్పదలించి తద్రసం
బనిశము పండు నంటిక తలాంతికఁ జూర్ణముఁ జేయు నప్పురిన్. ౭౦

చ. అలరుఁ బురంబునం గొగల నంతర దామరఁ బ్రాఁచిఁ గ్రప్పునన్
పలవులు మీఱ, లో వలుద వాలుగ మొత్తము పోర, నీరుకో
క్కొలఁ కొల మంచుఁ బ్రుంకు మెఱ గుంపుల వంపులు దోఁప, మావితోఁ
పుల విరుల న్వయి న్నదువఁ బొల్చు పురాతనతీర్థకుండముల్. ౭౧

శా. సాయంకాలములం దదీయ మురజిత్సద్మస్వనద్దుందుభి
ప్రాయత్కాహళికాప్రతిస్వనత దోఁప న్గుంజగర్భంబులన్
మ్రోయుం గేళిసింగులాయ గమన ప్రోత్క్షిప్త దత్నస్వర
స్థాయి స్ఫీతగుదద్గరుత్పటపటాత్కారంబుఁ గ్రేంకారముల్. ౭౨

మ. పొలయుం గాడ్పు లుదజ్జ్మహాలయవ దంభోజాక్షవక్షస్స్థల
వ్యాలఘుప్రసృమరకందబిందువులఁ బణ్యారంపుఁ బణ్యంపుఁ గం
పుఁ దాన్వర్తయి పిటి పీట నటన ప్రోద్యోగ సజ్జీభవ
ల్లలనావర్ధిత కైశిక స్ఫురిత కస్తూరాళి నల్లార్చుచున్. ౭౩

చ. మలయపుగాలి రేలు వనమాలివిమానపతాక ఘల్లుఘం
ఘలియఁ, బసిండి మువ్వగమి నొక్కొకమాటు గదల్ప, నుల్కి వి
ద్యలము తదీయ హేమ వరకాంచలచంపకశాఖలందుఁ బ
క్షులు రొద సేయ, వేగె నని కూడుదు రల్కలు దీఱి దంపతుల్. ౭౪

చ. కలశపుఁబెంటుకు ల్ధ్రువిదకన్యలు ముంగిటఁ గాఁచుచుండి, త
జ్జలరుహనాభగేహ రుచిరాంబుమ సొకఁ దొక్కులాడఁ, గొం

దెలవయి కమ్మ గ్రామ్యతరుణీతతి డించిన పేఁపగంపలం
దల మగుచున్న చెంగలువ దండలఁ దోలుదు రప్పురంబునన్. ౭౫

భాగవతులు

సీ. ఎదు రేఁగి సాష్టాంగ మెరఁగి పాద్యం బిచ్చి,
నారికేళకటానసముల నునిచి,
నునుఁబోఁకపొత్తిఁ గట్టిన దొప్పగమితోఁద
రంభావిశాలపర్ణములు వఱిచి,
శాల్యన్న సూపాజ్యకుల్యా బహువ్యంజ
న క్షీర దధు లర్పణంబు చేసి,
వార్చినపిదప నంవాహన మంత్రముల
కొనరిచి, తాంబూల మొసఁగి, కుశల

తే. మడిగి, పోయెదమన్న ద వ్వనిచి, సిరిఁ
దగినసత్కృతి చేసి, ఖేదమున మగిడి
యర్చ గావింతు రెవుడు ని ట్లతిథు లైన
భాగవతులకు నప్పురి భాగవతులు, ౭౬

విష్ణుచిత్తుఁడు

(77)

శా. అం దుండుం ద్వయసద్మపద్మవదనుం డద్వంద్వుఁ డక్రాంతయో
గాందూబద్ధ మధుద్విషద్ద్విరదుఁ డన్వర్థాభిధానుం డుదు
చ్ఛందోబృందతదంతవాగ్పఠనా సంజాతతజ్జన్యని
ష్పందవైరతనునంవిదాలయుఁడు నిష్ణ న్విష్ణుచిత్తుం డనన్. ౭౭

వ. అమ్మహీసురవరుండు ప్రకృతికంటెఁ బరుం డగు తన్నును, దనకంటెఁ బరుం డగు వరమేశ్వరుం, బరమేశ్వర ప్రసాద బహుజననకృత సుకృతఫల రూప యగు నాచార్యకృప గుప్తదానంబు నిధానంబుఁ దెలిపిన గతిం దెలుపఁగా, నాత్మీయ తదీయ శేషశేషిత్వ సంబంధం బనాద్యంబుగాఁ దెలిపి; "యీ తెలివి గలిగి యఖండనిర్వృతిం గాంచి సుఖించు పరమయోగికి బహుక్లేశదంబు లగు చదువులం బనియేమి? యీ వివేకంబు లేనివాని హేతువాదంబు ధాతువాదంబు, శాబ్దంబు ప్రౌఢవాదంబు, కాపిలంబు చాపలంబు, మీమాంస

హింస, వ్యాకరణం బందురు; ఇటు గాక పడుక దొరకొనిన నరునకుఁ గాలంబు నాలంబు, విఘ్నంబులు సకలలోకవిఘ్నంబులు, అందులకు సామగ్రి గిటగిటవ; కొంత తెలియంగ నగు మదంబు పుట్టును; పదము ముట్టం జదివె నేనియు సముత్పన్న విజ్ఞానుండై తైర్థికజ్యోతిషయంబు లనుభవించి నాసితధాన్యంబు నిష్ఫలం బైన పలాలంబును లబ్ధముఘుంపు నిర్వికంపుండు విడుచునట్లు విడువవలయుఁ, గావున శాంతిదాంతిపరతంత్రత బరిష్కృతాంగు నైన నాకు మొదల నివి యధిగమింపం దొడఁగి విసర్జింప నేమి ప్రయోజనంబు; వాదిభంజనంబు రాజరంజనంబును జేయుచుఁ బుస్తకాసనంబులకు విసువనిజనంబులకుఁ గా నిమ్ము, మాదృశులకుఁ దదీయశుశ్రూషయ యాగంబు, లాభంబు మోక్షంబు, పూజనం బుద్వేజనం బని వితర్కించి యుద్వేగంబు పూర్వంబున సౌవీరభూరమణునకు గౌరవం బంగీకరించి బోధించి ముక్తి కనిచిన భరత భూమిసురవతంసంబునుం బోలె దుర్విభావ్యబోధుండై పరమపదంబునను భాగవతుల కప్రాకృతంబు లగు బహు భద్రమూర్తులు ధరియించి భగవత్పరిచర్య సేయుటయ పరమపురుషార్థం బగుట యెఱిఁగి యచటి పుష్పచరణపాణిమాలికాకరణ కైంకర్యంబున కంకురిత కౌతూహలుం డై చేయుచుండె. మఱియును, ౭౮

క. న్యాయార్జిత విత్తంబున
నాయోగీశ్వరుఁడు వట్టు నన్నం బాప్రా
లేయ పటీరాచల ప
ద్యాయాతాయాత వైష్ణవావలి కెల్లన్. ౭౯

చ. గగనము నీటిబుగ్గ కెనగా జడివట్టిననాఁడు భార్య క
న్నొగ సొరకుండ నారికెడపుంబొఱియ ల్దిగిలించి వంట న
య్యగపల ముంచిపెట్టుఁ గలమాన్నము నొల్చినప్రప్పు నాలు గే
న్నొగవినకూరలు న్వడియము ల్వరుగు ల్తెరుఁగు న్ఘృతప్లుతిన్. ౮౦

చ. తెలిసులివెచ్చ యోగిరముఁ దియ్యని చారు బఁ దిమ్మనంబులున్
బలుచనియంబళు ల్చెఱకుపా లెనసీళ్లు రసావళు ల్ఫలం
బులును సుగంధిశీతజలము ల్వకపిందెలు నీరుఁజల్లయు
న్నొలయఁగఁ బెట్టు భోజనము పేరిటఁ జందనచర్చ మున్నుగన్ ౮౧

మ. పుష్పందావి నవోపచనంబు మిరియంపుం బొశ్యతోఁ జట్టి చు
య్యను నా దాఱవిహారసంపు, మకుమం దై యేర్చునావం జిగు
రొక్కనుపచ్చళ్లును. బాయసాన్నాలు, నూరుంగాయలున్, జేసుఱు
క్కనునేయుం, జిఱుపాలు పెల్లువగ నాహారం బిడు న్నీతునన్. ౧౩

చ. కదళగభిరపుష్పపుటకాచ్ఛాఁ జేతుల నష్టిండిపైఁ
గుదురుగ నిల్పి, యొప్పుగత గాసల సుగంధియ నించి, త్రాట ము
స్నడికినశాటి ప్రేరి నని సౌఖ్యముఁ బ్రంకిశి వత్తు రెందటే
వదలక యాతనంట శివారమున స్పృదేశిప్రష్ఠపుల్. ౧౭

శా. ఆనిష్ఠానిధిగేహసీమ సదురే యాలించిన న్శోత్రియు నెం
తే నాగేంద్రశయానపుణ్యకథలుం దివ్యప్రబంధానుసం
ధానధ్యానము 'నాస్తి శాకబహుతా నాస్తి ... తా, నాస్త్యపూ
పో, నాస్త్యోదనసౌష్ఠవం చ. కృపయా ... స్తవ్య' మన్మాటలున్. ౧౮

తే. ఇత్తెఱంగున నవ్వైష్ణ వోత్తముండు
జాగరూకతఁ బెర్తిక ఖాసపతుల
కితర మెఱుఁగక యెవ్వ రే వేమి వేఁడి
రలయ కవి పెట్టి సంతుష్టి సలుపుచుండె. ౧౯

## ఆశ్వాసాంత పద్యములు

శా. బాలార్కాంశువిజృంభితామలశరత్పద్మాక్షి పద్మాక్షనూ
నీళాజాంబవతీశ యూశ బలభి న్నీరేరుహోద్భూత ది
క్పాలామూల్యశిరోమణిద్యుతికనత్పాదాబ్జ పాదాబ్జపా
లాలంకారకచావలీ మకరదీప్యత్కుండలాంచన్ముఖా ౧౬

క. జలచర కిటి హరి వటు భృగు
కుల రఘుకుల సీరి బుద్ధ ఘోటి ప్రముఖో
జ్జ్వల జనికృత రక్షా
యలమేల్మంగాభిధేందిరాలయవక్షా. ౧౭

భుజంగప్రయాతము.

ఖలద్విడ్ద్వినిర్దిష్టపాథోధరోరూ
పలాసారధారాతపత్రీకృతాద్రీ
ఫలన్మూర్ధదాఙూర భంగోగ్ర బాహా
కలా కృత్తకంసా శిఖండావతంసా. ౮౮

మ. ఇది కర్ణాటధరాధృతిస్థిరభుజాహేవాక లబ్ధేభరా
డుదయోర్వీధర తత్ప్రత్యవ్యకృత నవోత్పాయనోష్ణీష ర
త్నదృగ్గంచత్పద కృష్ణరాయ వసుధాధ్యక్షోదియముక్తమా
ల్యద నాశ్వాసము హృద్యపద్యముల నాద్యంబై మహింబొల్పగున్. ౮౯

ప్రథమాశ్వాసము సమాప్తము

—:o:—

శ్రీరస్తు

# ఆముక్తమాల్యద

## ద్వితీయాశ్వాసము

శ్రీనయన కువలయుగళా
నూన జ్యోత్స్నాయి తస్మితోజ్జ్వలముఖ చై
త్యానీతసుర శ్రీ పున
రానయన క్రమణ వేంకటాచలరమణా. ౧

వ. అవధరింపు మానమయంబునఁ బాండ్యమండలంబున. ౨

## మధురాపురవర్ణన

సీ. ఏవీట నతులపాలిండ్లపై గంబూర
నవహారములచిప్పకవుచు మాన్పు,
మలయజం బేవీటఁ దొలుఁజెక్కు దఱిచి మే
తల కిత్తమిగులు భూములకు డిగ్గుఁ,
గలఁచు నేవీటి సింహళగజంబులగాలి
చైత్రవేళ నుదగ్గిరాగజంబుఁ,
దాల్తు రేవీటి ప్రాక్తనభూపవిత్మాల్య
మరకతంబులు పెఱధరణిపతులు,

తే. కవివర నియుక్త గిరినదృ గ్గహననిలయ
గాత్రగాహితకనకముక్తాకవాట
గోపురావేదితోచ్ఛ్రితాష్టోత్యవప్ర
దనరు దక్షిణమధుర సాంద్ర ద్రుమ ధుర.

క. శమనరిపుత్రిపురశిదో
ర్ద్యమవద్దోర్వర్ణ్యవలయితస్వర్ణగిరి

భ్రమదంబై కాంచనవ
ప్రము దీప్రం బగుచు నప్పురంబున కొప్పున్. ౪

తే. సౌరిదిఁ గనుపట్టు హేమరశ్ములు సెలంగఁ
బొదవుకతమున సూక్ష్మమై పొల్చుఁ జూడఁ
బట్టణము కోటకొమ్మలపంక్తి గగన
మండలశ్రీకి సంపంగిదండవోలె. ౫

మ. పరిఖం దత్పురకామినీజనము లంభఃకేళిసల్పంగఁ ద
ద్గురువక్షోరుహలిప్తసంకుమదకస్తూరీమిళచ్చందనా
గురుపంకంబుల సౌరభంబులఁ జుమీ కుంభీనసావాస ని
ర్జరకల్లోలిని కందు భోగవతి నాఁ జన్సంజ్ఞ గల్గె న్నగన్. ౬

తే. కాద్రవేయులు భూమియు గైకొనంగ
నురగలోకంబు వెడలి తత్పరిఖనీట
నెగసి తోడనె క్రుంకుడు న్నిలువ లేక
తత్తటాబద్ధగారుత్మతముల కలికి. ౭

తే. తరుణశైవాల జలజపత్రములఁ బొదువ
మరకతచ్ఛాయఁ బొల్చుఁ దత్పరిఖజలము
కోట బంగారు సేయుటకొలకు మున్ను
బ్రహ్మ పిడిచిన మందాకు పస రనంగ. ౮

చ. అడుగున నుండియు న్నపిడెలమై చదలంబెడఁకోట నొప్పు ప్రో
ల్బెడనికడంక దంచనపుఁ జేతుల గంగను గానెఁ దాఁటఁగా
నడుమన యున్కిఁ జేసి యల నాకపురిన్ సరికై వెనంగి లా
వెడలఁగఁ బట్టి వేయుటకు నెత్తె నన న్జను మల్లుపోరిలోన్. ౯

తే. ఉదుటు గబ్బులు గలకల్పతురము నూచి
గందపట్టెఁ నూచి బంగారు నూచి
వీటివాకిటిబోటనే విడువ కెపుడు
సుట్లు వెట్టుచు నుందురు సోమరపులు. ౧౦

మ. స్థిరసౌధాగ్రవిహారిణీవతఁచరీచ్ఛిన్నాచ్ఛహారస్ఫుర
ద్గురుముక్తావళిఁ బేటిక ల్పిరులతోఁ గూడంగఁ ద్రోయ. న్నిజో

మఱచి విధాత పాటలిమ మధ్యమసంధ్యకుఁ జేయ లేని యా
కొఱఁతయుఁ దీర్చుకోఁ దొగరు కొల్చినకై వడిఁ బట్టణంబునన్. ౧౮

## పుష్పలావికలు

సీ. పెలుచ యీనీదండ వెలయెంత? నాదండ
కును వెలఁ బెట్ట నెవ్వనితరంబు?
కలువఁదావులు గాన మలికదంబక వేణి?
కలువతావులు వాతకయ కలుగునె?
కడివోదు నాతిమ్మ్మ పతఁతి యీగేదంగి
ననఁ, గడివోమి ముందటికిఁ జూడు.
జాతు లే వంబుజేక్షణ? పత్మినులు సైత
మును నున్నయెద జాతు లునికి యరుదె?
తే. యనుచుఁ దొలి నుడి నభిలాష లెనయ మూఁగి
పలుకుతోడనె నర్మగర్భంబు గాఁగ
నుత్తరము పల్లవశ్రేణి కొసఁగు చలరు
లమ్ముదురు పుష్పలావిక లప్పురమున. ౧౯

చ. సరసులనర్మ మింపుల నొసంగఁ గదంబపుదండఁ గట్టుచోఁ
గరఁగుటఁ దెల్పు దృక్తరళకాంతులు నుత్తర మిచ్చునంతరాం
తరముల నవ్వులు న్గలువతండము మొల్లలు నంచు మిన్ను గ్రు
చ్చి రహిని రిత్తనూ లొనఁగి సిగ్గు వహింతురు పుష్పలావికల్. ౨౦

సీ. పద్మాస్య, పురి ననుభవితకు నీవ యె
త్తులు వెట్టె దనఁగ రావలసె నిటకుఁ;
దెలుపుమా, జాముందు నల రింపొ ఘటికాద్వ
యం బిందు నల రింపొ కంబుకంఠి?
యే వేఁదుటకు నీవు బుతు వేల చెప్పెద?
పువిద, మే మందాఁక నోర్వఁగలమె?
చేరఁగా రాదె. జాసికము గేఁలోఁటివ,
యంతనే చెదునె యేజాయుతాక్షి?

తే. యనుచుఁ, బరిభాషఁ బోలెఁ దమ్మాస దొరల
నాడ, మోవిఁ జెఱంగిడి, యాఁగు నవ్వు
కంట నిగుడ, విరుల్గాన్పుకరణిఁ జల్లు
సరసవుఁబలుంబె జాణల మరులు కొల్పు. ౨౧

సీ. ఇందమ స్తతి దంతకుందాభఁ గూడి ని
చ్చలపుఁజూపులు మున్న సంభ్రమింప,
వెల యొప్ప కపలఁ దో విఱుచుమోవియుఁ గోప
మొదవెడుచూపు మోమోటఁ ద్రిప్పఁ,
దిరిగిన సస్మితోక్తియుఁ జూపుటొయ్యార
ములు నగుఁ గా దను పలుకు లుడువ,
నవి గావి కావొ నీ కను పరసాపత్న్య
సంపాదనం బుబ్బు నింపుఁ బెనుపఁ,

తే. చతురవచనవిలాసాంగసౌష్ఠవములఁ
బసిఁడిఁ దా నిచ్చినట్టి యప్పణఁతి మఱవఁ
బతిఁకి గ్రైదువు లందిచ్చు రతివిధమున
విటుల కిత్తురు మఱి వారు విటులు పురిని. ౨౨

ఉ. దల మగు చంద్రఖండములు దారలు, సాంకవ మొప్పుపాలిపా
టల మకుదంతపుంగరవటంబు శశాంకుఁడు, గుంకుమైన చీ
రలఁగిగి కెంపు, గా బయటి రథ్యల నొప్పుదు రిందుకాంతవే
దులవయి సంధ్యయే బహుతఁ దోఁచె నన న్పురి గట్టివాల్సతుల్. ౨౩

సీ. ఉపరిస్థజనవారతోక్తిఁ జెవి దార్చి
యమ్మొగంబై బయల్చిమ్మి చిమ్మి,
గవను వెన్నారయ మిన్నవియ దట్టంచు తో
ద్రతరు బందవుదాంట్లఁ దటిమి తటిమి,
చలువచే ద్వారవేదు లెటింగి నిల్చి త
జ్జనవిమృష్టకఁ గేలు సాఁచి సాఁచి,
డిండిమంబుల కుబ్బి గండాల్పదాన మే
ఘలుగఁ దద్వహా ఖాల బవ్వి బవ్వి,

తే. వేణుకాహతులకు పీడు వెడలి వెడలి,
పరపథగజధ్వనికిఁ బోక తిరిగి తిరిగి,
దృక్పుటలు వైరులకుఁ బంపు కృత్య లనఁగ
శానుగతిఁ జేరు వెలిఁ గరు లగ్గలికల. ౨౪

ఉ.) పై ననిశంబు సల్లుకొను పాంసువుపై ఖగతుండఖండితా
లానమహామహీరుహఫలచ్యుతబీజము లుత్థిత త్కరాం
భోనిబిడాప్లుతి న్మొలవఁ బొల్చు నగమ్యతఁ దూలుచు న్పురో
ద్యానముల న్మదేభములు ప్రాణములో దినగంబులో యనన్. ౨౫

శా. మౌని క్రోధవిధూతపత్త్రిముల మౌ మాతో సవత్త్రి ల్గదా
కానీ రం దని కేకరాక్షిరుచిమొక్క ల్పిక్కల న్మాఙ్గ్నతూ
ణానల్పాహిపకల్పకాంఙతతులం దారం బురిం బొల్చు నా
జానేయంబులు ఫేనహాన మిడి కెజామోర ల్లార్చున్. ౨౬

చ. 'చలమున సింగిణీతరకసంబులఁ గట్టక పూన, రంపపె
న్పెలగతి మాలతి న్వెనుకఁ జిక్కక మానదు, తప్పిదారి వె
న్వెలసినఁ దారు ము న్నెఱుఁగకుండుట యొచ్చెము సాదికోటి' కం
చలమినచింతఁ ద్రవ్వికొను నంఘ్రిఘాతుద న్పురిలోని వాహముల్. ౨౭

ఉ. అంజ సమానవాయుగణ మంతయు ఖంజతఁ జిక్క, నాజవో
ష్మం జని యుబ్బ చిక్కనినమానపువాయువులో నొకండు గ
ల్మం జనియించు దుర్యశము మేల్కొని లేహనవేళ వాజు లూ
ర్పం జెడుమాణిబంధముకురంబుల కాళిమ పేరఁ గార్కొనన్. ౨౮

మ. ఇలఁ బాదద్వయి రాయ నల్కొనఁగు నెంతేఁ బాఱుచో, నంతెవ
న్నెలు రెండై లఘువం దకీర్తియుడు మున్నే యెక్కుచో, నిందు నెం
దుల కే మౌదు మటంచు సాదు లలయన్, దూర్ణోచ్చము ల్వాజు లం
దలరున్ బాహ్లికపారసీకశకథట్టారట్ట ఘోట్టాణముల్. ౨౯

## వణ్య యువతులు

సీ. ముడివిప్ప నడుగుఁదమ్ములనె వ్రాలుటఁ దేంట్లు
నెఱికరులగుట నందియము గలదె ?

కన నెంతవాని లోఁగొనుట నాదర్శంబు
నెమ్మొగం బగుట నందియము గలదె?
ఇటిగొను మింటిపై మెఱయుటఁ జక్రద్వి
తయి చన్ను లగుట నందియము గలదె?
పొలసు దొర్లఁగఁ జూచు కలికిచూపులమీలు
దెలిగన్ను లగుట సందియము గలదె?

తే. పొలసిననె తావి బుగులుకో నలరుఁదీఁగ
తిన్నని శరీర మగుట నందియము గలదె?
యనఁగఁ జెలువొంది సురత వైయాత్య నిధులు
పణ్యయువతులు పొలుతు రప్పట్టణమున. 30

మ. ప్రతత ప్రాంత పిశంగ కుంకుమ జటాపాళీ కురంగీమదా
సిత పీఠాళికలస్వనంబు లెనఁగఁ జెన్నారు కర్పూరపుం
జ తతు ల్కాంటికి నారదత్వమున మించ స్గామినీ కామి నం
తతి కేలా యెద్రతెచ్చుఁ గంతుకల హోన్మాదంబు లాప్రోలునన్. 31

తే. సిం గిటు త్రిశంకుకతన మాతంగవాటి
యయ్యె నిఁక నుండఁ దగ దవి యుపని కరిగి
నట్టి నక్షత్రతారాగ్రహాలి యనఁగఁ
గాంత నవరత్న రాను లంగళ్ళఁ బొలుచు. 32

చ. చిరసముపార్జితాగ్ని తడిఁ జెంది నశించు నటంచునో, కృతా
ధ్వరతఁ దదగ్ని మై నసికి దాన నొకంగము తాచుచేతనో.
పురధరణీసురు ల్నిగమభూధరము ల్జపయజ్ఞ శీలు రా
హరిదనదాది కైన వలహస్తము సాఁపరు దానధారకున్. 33

చ. ఉరవడిఁ బోరికై కవచ మొల్లరు మంత్రములందుఁ దక్క, ను
స్థిరభుజశక్తి నైదువది సేయరు దత్తిన తక్క, మందికై
పొరల రథీశుఁ డీ కమలబుద్ధి ఖఖూరికఁ దక్క, వజ్రదోః
పరిమవశీకృతాన్యనరపాలకు లప్పురి రాకుమారకుల్. 34

(35) చ. దంభాపేతవితీర్ణితోయములు రథ్యం బొట్టి హట్టస్థిత
స్తంభంబు ల్చిగిరించుచన్నవి యన స్థానైకనిత్యార్ణనన్

నంభూతం బగు పైఁడికోటి కొకపై నానాఁటికిన్ హెచ్చు చ
య్యంభోదావళి గప్పఁ గేతువులు వైశ్యశ్రేణి పొల్చున్ బురిన్. ౨౫

తే. నృపులపదహలరేఖల కెల్ల మాఁధు
ర్యాగ్రహరేఖలే మూల మనుచుఁ గోటి
కొండలుగ ధాన్యరాసులు పండుపీట
సుజనభజనైకవిఖ్యాతి శూద్రజాతి. ౨౬

చ. ఉమియఁగఁ దిన్న నవ్వ నన నొచ్చెము గాంచిన కొన్ని ద్రాఁకు లా
ప్రమదల నవ్వగింపఁ దని రండిలు సేఁతలు గన్న చెట్లకున్
దమ కశిక్షృంఖలన్ బెనఁచి నమ్మక పుట్టెఁ బురంబుఁ గంతునై
న్యముఁ గొని నా వెలిన్ శుకపికాదులఁ గేళివనాళి పొల్పగున్. ౨౭

సీ. మదగంధతారతమ్యము యామ్యకరిశిఁ ద
క్కారులకుం గనబెఁ గడము లొంసి,
సురతశ్రమజ మొటఁ జూపోపకయుబెఁ
గామినీమృదుగంధఘర్మ పుడిపి,
పరిమళవాహేచ్ఛఁ బ్రాణమీబలెఁ జించు
మృగనాభిచర్మశత్రికలు దూఱి,
అహితపన్నగభేదు లనిఁబలె గృహవిటం
కపుఁగలావుల నొయ్య గఱులు నిమిరి,

తే. వీటిసామగ్రిఁ గనుగొన వేగపడక,
నడవఁ దనదిక్కు పుష్పదంతద్విపంబు
నెక్కెనో యన జడగతి నెపుడుఁ బొలయు
నందుఁ జందనశిఖరిమందానిలుంకు. ౨౮

మత్స్యధ్వజుఁడు

సీ. ద్విద్వయోపాయ ధీవిద్యద్వైతనంబు,
షాడ్గుణ్యచాతురీ చక్రవర్తి,
క్రీడాచలీకృత శ్రీఖండగిరిరాజు,
కనకాద్రిముద్రణ గ్రంథకర్త,

యందూనిబద్ధాభ్రభ్యుంధవేదండాళి,
వననిధి స్తంభ నాధునికరఘువు.
శాత్రవ ర్దవ్యమలపాథఃకేళిహంసంబు,
లంకేళమైత్రీ ప్రియంకరుండు,

తే. స్వస్తిశ్రీద్వా స్తవస్తుత్య గస్తి. మఘవ
మకుటమోటన శరకోటి మంత్రభృత్య
భూతభూతాత్తశాంభవ భూమికుండు
దత్పురం బేలుఁ బాండ్య మత్స్యధ్వజుండు. ౩౯

ఉ. ఇందుకులావతంస మతఁ డేతటి నేతరిగాఁ; దరిం బ్రజ
ల్కుందఁ గొనం; డొరుం డొరుతల న్విసివించినమాట డెందముం
జెంద ముదంబు దక్కఁ జెడఁ జేయఁ డొరు; న్వినతాన్యుఁ డౌ నుతిం
వం దనుఁ; బందనుం గొఱఁత వల్కఁడు శూరతఁ దాను మించియున్. ౪౦

సీ. పాటీరగిరివసీ వాటిఁ గ్రీడించియు
వహిభయం బెఱుఁగఁ డావంతయైన;
నత్యంతమితభాష నవికత్థనుం డయ్యుఁ
బరులఁ గేరతమున భంగపఱుచుఁ;
బ్రేమఁ దాఁ దామ్రపర్ణికి నాథుఁ డయ్యును
సద్గోష్ఠి చే ననంజనత మెలఁగు,
మహనీయమహిమఁ దా మధురాస్పదుం డయ్యు
లావణ్యకలన నుల్లాన మొందు;

తే. విషధిలహరిభిదోత్పతత్ప్రషతజటిల
వలదుర్మక్రమతిమివర వాలపతన
తులితవరబలకరిశిరస్థ్సలనముక్త
బహుళము క్తావిము క్తానిపాతుఁ డతఁడు. ౪౧

శా. దానత్యాగపతత్త్రిమై తొలువతత్త్రిం బంబుధార వ్సదా
నానం, తత్పితకీర్తిహంసి చను మింటం: గ్రొత్త నా నేల, నా
నానీరార్ద్రపతత్త్రి యయ్యె వడి మింటం బాటు తజ్జాతి కే
లా నిల్చు న్గతి యన్యవత్త్రిగతిఁ బత్త్రైకప్రదేశాప్తతిన్ ? ౪౨

సీ. శుకకదంబము గొలుసులచే విబద్ధమై
వారాంగనాగారకారఁ బడఁగ,
గిరికానికాయంబు లరిశూన్యబహుపుర
హర్మ్యవాటికల౯ జెండాడుచుండఁ,
గ్రందుగా నితరేతరంబు రాయిడి సేయు
రాజులు దననూపురమున నొదుఁగఁ,
నెగడు ననావృష్టి నిజబలేభస్ఫూర్తి
నమవాన్యకరటిగండములఁ జెంద,

తే. దానవేళల నతివృష్టి తనకు హస్త
గతము గాఁగఁ, బ్రతాపాగ్నిఁ గ్రాఁగిపోవు
కంటకులయందు శలభత గలయ నరఁగ.
నేలు నాపాండ్యుఁడు మహి నిరీతి గాఁగ.

వ. అమ్మహీవల్లభుం డివ్విధంబున సామ్రాజ్యవైభవంబు లనుభవించుచుండఁ
గొంతకాలంబున. ౪౪

## గ్రీష్మము

45 తే. పాటలవసుంధరారుహ భాగధేయ
మాతతమరీచికాంబుపర్వాగమంబు
ధరణి బొడసూపె నంత నిదాఘనమయ
మదటుతో శాల్మలీఫల విదళనంబు. ౪౫

సీ. నిర్ఝరప్రపబలవేదిక లింటి జట్టాలఁ
వేసిన ప్రాఁచి పెన్నేఁటు లెగసె;
నెలుకులు పడయనీ రివుల గప్పులఁ బట్టఁ
బోయిన రాడాలఁ బోలము నెఱసె;
సుడిగాలి దపదగ్ధ తరుపద్దతలి రేపఁ
గాపురా లని దేగపదువు దూటె:
నిద్రితద్రుమచ్ఛాయ నిలుపక జరగ వెం
బడిన యధ్వగపంక్తి బొరలు పెట్టె

తే. క్షేత్రపాలున కుదికినచీర లాఁగు
 చాకిరేవులఁగ ముఁగయ్యె సకలదిశలఁ
తెలుపులుగఁ దోఁచు నెండమావుల బయళ్ళఁ;
 గండె నివి యెంత నవ దిఙ్ముఖములు రాఁజె. ౪౬

చ. నరి యగు విట్టిపట్ట నివి నర్వము నం చటమీఁదిసృష్టికై
శరధివ ది జ్మరు జ్వలిత చండతరాతపవహ్నిఁ గాఁగఁగాఁ
గరువు లజుండు పీనిపయిఁ గట్టె ననన్ గనుపట్టె వెచ్చల
న్గరి కిరి కాస రాంగముఁ గప్పిన తూంపులు నంద యాఱఁగన్. ౪౭

మ. దవధూమంపుఁదసుంబులోఁ దమ రసద్రవ్యంబు బంకేజబాం
ధవుభానుప్రతతుల్ హరింపఁ గుయివెంప న్వెల్లి భూన్యోమకూ
పవితానం బనఁ జూడఁ జూపఁ బుశమి న్పాదిల్లి పై విప్పులై
యవనం బంచుల నాడఁగా నెగసె వాత్యాళి ప్రజాళ్చక్రముల్. ౪౮

చ. పకమర వెట్టు నయ్యుదుకు ప్రాశన మొల్లక కూటిపేవలె
బకలిక నూడు నచ్చిలువ ప్రగ్గములన్ రవియాజ్ఞ మాటికిన్
మఱియిడఁ బిచ్చగుంటు రథము న్నిలువ వ్వయనంబు సాగమిన్
జకను వహించె నాఁగ దివసంబులు దీర్ఘము లయ్యె నత్తఱిన్. ౪౯

క. తరణిఖరకిరణశిఖి జగ
మెరియింపఁగఁ బొడమి గాలి నెగసిన భసితో
త్కర మనఁగ శాల్మలితరు
పరిణతఫలతూల మర్కపథమున నెరసెన్. ౫౦

చ. భరితనిజాంబుబింబితవిభాకరబింబవిజృంభితప్రభాం
కురముల నధ్వనీనకృతకూపకవంక్తులు వొల్చె నబ్ధిరా
డ్వరహాభరంబున న్నొవకమువెచ్చకు శాంతి యొనర్ప వాహినీ
తరుణులు మేన దట్టముగఁ దాల్చినము త్తెపుఁబేరులో యనన్. ౫౧

మ. అతివృష్టి న్మను వార్ధిఁ గూర్చెదకాఁ దౌఁ దమిం గూర్చిన
న్మతి లంచంబుగ హేమటంకములు మింటం బొల్చుపర్జన్యదే
వత కీ నెత్తినకే లనాఁ బొలిచె నిర్వారిస్రవంతి న్పయ
శ్చ్యుతి నక్రమచ్ఛదదృశ్యకర్ణికములై యున్నాళనాళీకముల్. ౫౨

సీ. నులివాడునాఁచువల్లుం గొం తొగర్చి లేఁ
బొల వల్చుగాలి వే పోక నెఱిఁగి,
కడకు వెళ్ళఁగ నొక్కకడనుండి త్రొక్కుచు
మలుచలఁ జిఱుతగుల్లల నమలుచు,
నెండ్రి కా లిటికిన నెగసి యొక్కించుక
తొలఁగి శితత్రోటిఁ దూఁటి తినుచుఁ,
దడి యింకునిలఁ జేమమడివోని తమ్మిగుం
[illegible]పులును జీలుగుల నెండలు గడపుచు.

తే. దనరు బకపంక్తులకు జానుదఘ్న మయ్యెఁ
జెరువుగమి; యుదుము లన రే ల్దిరిగెఁ గుక్క
వసికి బావులఁ బడుటకు బసులయెరువు
చెఱలకు మొసళ్లు; మలఁగుమీ న్బొఱియఁ దూఱె. ౫౩

ఉ. మీ టగుమీలనెల్ల మును మ్రింగి క్రమంబున నానె, నెండపె
న్నీటికవెంటఁ దోఁచుతొగ వేరుబడి న్గొడుపై చెలంగఁగా
ద్రోటికఁ గర్దమద్రవముతో నెనయించిన బొమ్మ జాయ దా
తూ్కటకులంపులేజెన బకోటకులం బజలహ్రదంబులన్. ౫౪

శా. ప్రాతర్వేళల నట్టివెట్ట సొగసై పాటిల్లఁ గుంభోంభనో
ద్భూతాంబుధ్వని వాద్యమై మరుదధఃపుంజీభవత్పాటల
వ్రాతామ్రేడితసిక్తభూసురబిళారామాంబుకుల్యాబహు
స్రోతస్సంధుల నంధుయంత్రవతికృత్ప్రోద్గీతగేయౌఘముల్. ౫౫

తే. మెండుమీఱిన పగటి బీఱెండ దాఁకి
యొల్లఁబోయిన లేబొండుమల్లెపొదల
తుదలఁ జప్పటలై కడుదొడ్డ లగుచుఁ
బొడమె మొగ్గలగము లగ్గిబొబ్బలట్ల. ౫౬

మ. నుడి నాభిచ్ఛలన, న్సరోజములు చక్షుఃప్రక్రియ, న్స్వాఁదు క్రొ
మ్ముడి దంభంబున, జక్రఫేనపటలంబుల్ చన్నులన్ నవ్వుఁ[illegible]
వడరంజేసి నిదాఘభీతిఁ సలిలం బాగామిబీజార్థమై
కడవం బెట్టిన వారిదేవతలు నాఁ గాంతాళి యొప్పుఁ బ్రపన్. ౫౭

సీ. నెగ కుల్కఁ మెఱుఁగుఁ జొచ్చినజహ్నురవిజల
సరణి మల్లెలతోడిజడలు మెఱయ,
వలిచన్నుకొమరు ప్రచ్చిలిన దిమ్మనుతెఱఁ
గున ముంచుగరిగ కాఁగలు మునుంగ,
దారలోఁ దోఁచు కన్దుకులు వానితో
త్పలపత్త్రపతనసంభ్రాంతి నొసఁగ,
దెలిమోమువన మెచ్చి తలయూఁచు దెఱఁగి మా
నక నవ్వునేర్పు దెందములఁ గరఁపఁ
తే. దెఱవ లిటు నీరు వోయుపందిరియ చేరి
యవలఁ గొఱగాక పిచ్చుగుం పై చనఁగుఁ
దనువు గొనఁ జొచ్చెఁ గల్లగుట్టమర వారి
కర్వుగులు లాఁచి యిదు విడియముల పేర. ౩౮
చ. తొడిఁబడ నమ్మ లక్కలని తూలుచు దీనత దోయి లొగ్గుచున్.
వడ మఱి తేరఁదేర నలవాక్యము లెన్నక, మోము గుబ్బలున్
గడుకొనుకష్టదీప్తులు నేగాదిగ భ్రన్గొనుచిట్టకంపుఁ ద్రాఁ
గ్రిందుఁ గని సన్నల న్నగిరి క్రోల్పక పాంథుల ప్రపాప్రపాలికల్ ౩౯
తే. ఎసఁగు కట్టావిక్రియ నావి రెగయఁ బగటి
యెండ యుదుకాఱకుండు భూమండలమునఁ
దొలిచె మాపటఁ బండువెన్నెల చకోర
పోతవితతికిఁ జాఁపట్టు వోసినట్టు. ౬౦
సీ. పవలెల్ల దీర్ఘికాంబువుచల్లువోరాట
నలసి, మృణాళికాజడము లైన
బాహువు లమదుకూర్పరముల కెదురుగా
మలఁచి మూఁపులఁ గరతలము లునిచి,
ప్రాల్మాలి మిగుల నార్పని కమ్మ క్రొమ్ముడిఁ
దనిమొగ్గవిరవాదిదంత విరియ,
ధౌతగంధామోదశీతల స్తనములు
వొందఁ గొఁగిళ్ళతో బోరగిల్లి,

తే. నారికేళాసవపుఁదీఁవుటూరు వొలయ,
వలిపెయొంటొల్లెతో నురస్థ్సలులఁ గూర్కు
ప్రియులవేకువఁ దొడ నెచ్చరించి కలసి
రెలమి ధన్యులు దఱపివెన్నెలబయళ్ళ. ౬౧

చ. హృదయము లెప్పుడు న్గదియకే తఱచౌ వెసకౌఁగిలింతలు౯
గదిరెడు మేలుకార్యములఁ గల్గక మాపులయందె కల్గుచె
స్జమయలు వట్టిశైత్యములుఁ జాల ఘనం బయి మందు వేసవిన్
బొదలఁగ నిల్చె దంపతుల పొందు లనార్యుల పొందుకై వడిన్. ౬౨

ఉ. తీలసు కంతుమెంబడినె తెమ్మెరలు ప్రనవిదీప్తి కల్గు పా
తాళముఁ బట్టుచుంతఁ దమతావులు ప్రముచ్చిలఁ బట్టి యోషధీ
పాలున కప్పగించె ననఁ బై సురభిశ్వసనంబు నించెఁ గాం
తాలసవక్త్రసీమ విటు లార్చు నుశీరవుఁదాళవృంతముల్. ౬౩

చ. సమసి కథావశిష్టమగు చందనశైలసమీరణంబుఁ గృ
త్రిమగతి నింద్రజాలమునఁ దేఁ దొడఁగెన్ భువిఁ దాళవృంతజా
లము; లది మాయ యౌటకుఁ దలంపఁ దదీయమయూరపింఛికా
భ్రమణమె సాక్షిగాదె, నగరంబున నట్టికడిందివేసవిన్. ౬౪

తే. అట్టివేసవి పసిదంపు వెట్టకతన
హస్తము సెమర్చి సారెకు లస్తకంబు
మినికిలఁగఁ గాదె సవరింప వసము గాక
పుష్పబాణుని చెఱకువి ల్పుడమిఁ బడియె ! ౬౫

మ. 'పయఃపల్లియొంద్ధ్గచంబు లనుపం దచ్ఛైత్యము ల్దీములై
పెరరేఁపం జపదెంచెఁగాక ! రవిదీప్తిం గ్రుంగి పాతాళగ
హ్వరముల్ తూఱిన వారి నీయదుకుఁద్రాళ్ళా తెచ్చు ?' నా దీర్ఘత
చ్చిరకృష్టిం గనునిటశైత్య మలరించె న్నూతులం దత్తటిన్. ౬౬

మ. స్వ నిదాఘోగ్ర నిదాఘ వైఖరిని యూష్మ న్మల్లిక ల్కామినీ
కనదానీలకచాగ్రపంక్తి నెఱియల్గాఁ బాపఁగాఁ, బాటల
ల్గనతం దేనియసోనఁ గూర్చె; నది యౌఁగాఁ నాభియ న్నిర్భిషం
బుసు టోఁబుట్టువుయయ్యె వేర్పడ గుణంబు లన్నొగాఁ జూడమే ? ౬౭

శా. తారుణ్యాతిగ చూత నూత్న ఫలయుక్తైలాభిఘార స్వన
ద్ధారా ధూపిత శుష్యదంబుహృత మాత్స్య చ్ఛేద పాకోద్గతో
ద్గారంపుం గన రార్చు భోగులకు సంధ్యావేళలం గేళికాం
తారాభ్యంతర వాలుకా స్థిత హిమాంత ర్నారికేళాంబువుల్ ౬౮

క. గ్రామగ్రామంబున నొక
సామంతున కిడినచలువ చప్పరములు త
న్నై మేదినిఁ గుంపటిలోఁ
దామరలుంబోలె నట్టితఱి నొప్పారెన్. ౬౯

తే. తోఁటఁ బగ లుండి, మల్లెలు దుఱిమి, కావు
లమర మాపైన నిక్షుయంత్రముల కొయ్యఁ
జేరుప్రజ వొల్చె బావివృష్టి కిని గ్రుడ్డు
తో మధురిమేచ్ఛ డిగుసెట్టి సీమ లనఁగ. ౭౦

## పరదేశివిప్రుఁడు

క. అప్పెనువేనవి విభవము
విప్పుగఁ దన్నగరనికటవృషగిరి హరికిం
దెప్పతిరునాళ్ళ రా ముద
మొప్ప న్పరదేశివిప్రుఁ డొక్కఁడు భక్తిన్. ౭౧

క. సేవించి పోవుతఱి మధు
రావిభవముఁ జూడ వచ్చి శ్రాంతిమెయిన్ మా
పా వైఘనీటఁ గృతసం
ధ్యావిధి యై నృపపురోహితావాసమునన్. ౭౨

సీ. వరిపక్వసురభిరంభాఫలంబులతోడ,
దళమెక్కు పనసపెం డొలలతోడ,
ఘృతపిండనిభ కర్కటీఖండములతోడఁ,
బలుదెఱంగుల మావిపండ్లతోడ,
గోస్తనీమృదుగుళుచ్ఛస్తోమములతోడఁ,
గప్పులేఱిన మక్రపప్పుతోడ,

సుమధురస్థూలదాడిమబీజములతోడ,
దనుపారు రసదాడిగనెలతోడ,

తే. పానకం బతిథుల కిడఁ, దానుఁ గ్రోలి,
యర్చనాదత్త చందన చర్చఁ దేలి,
విరులు సిగఁ దాల్చి కర్పూరవీటిఁ జౌరు
కొట్టుచు ద్విజుఁడు వెన్నెల కట్టుగాయ. ౨౩

తే. మాత్రనంచి తలాపగా, మార్గవేది,
నొక్కఁ డార్యలు, గీత లొండొకఁడు, దాసు
భాషితంబులుగాఁ, దోడి బ్రాహ్మణౌఘ
ములుసుపోకకుఁ జదువఁ బరున్నవేళ. ౨౪

## రాజు భోగినికడకుం బోవుట

సీ. పన్నీటితోఁ గదంబముసేసి పూసిన
మృగనాభివస రాచనగరు దెలుపఁ,
బాటలానిలము లార్పఁగఁ దపారవుఁజుంగు
లలరుఁదావికి మూఁగు నళులఁ జోఁప,
గర్ణడోలామౌక్తికచ్ఛాయ లెగఁబ్రాఁకు
నురుహారరుచులఁ బ్రదస్తరికిఁ దన్న,
శశికాంతి చెంగావి దశ మలంచిన కేల
స్వర్ణత్సరువు వాఁడి వాలు మెఱయ,

తే. మెలఁత యడపముఁ దేఁ, జరన్మేరు వనఁగ,
దలవరులు గొంద ఱొలసి ముంగలఁ జనంగ,
నర్థి రథ్యాంత రాంతఃపురాంతరమున
భోగినీసంగతికి రాజు వోవుచుండి, ౨౫

చ. వినియె, 'నెల ల్చతుర్ద్వయిని వృష్టిదినాళికి, రాత్రికై దివం
బున, జరకై వయస్సునను, బూని, పరంబున కిప్పు, డుద్యమం
బనువుగఁ జేయఁగా వలయు' నంచుఁ బురోహితధర్మ మాత్మ గీ
ల్కొనఁ నలవిప్రుఁ డాద్విజులలోన సుభాషితము స్మరింపగన్. ౨౬

క. విని, తద్గ్రంథార్థము నె
మ్మనమున నూహించి, తెలిసి, భ్రాన్పడి, కడకుం
దన మోసమునకు భయపడి,
జనపతి యట్లు చనక నిలిచి, సంతాపమునన్. ౨౭

ఉ. 'ఎక్కడి రాజ్యవైభవము ? లెక్కడిభోగము ? లేటిసంభ్రమం !
బెక్కట ! బుద్బుదప్రతిమ మైన శరీరము నమ్మి మోక్షవుం
జిక్కి గణింపకుంటి. యుగసంధుల నిల్చియుఁ గాలుచేతిబల్
త్రొక్కుల నమ్మనుప్రభృతులున్ దుద రూపఱ కుండ నేర్చిరే ? ౨౮

క. ఉన్నట్ల యుంత నద్దరి
కి న్నరులను నావ చేర్చు క్రియ వెసఁ దాఁ బో
కున్నట్ల యుండి కాలం
బు న్నరులకు వయసు బుచ్చి మోనము దెచ్చున్. ౨౯

చ. సగరు నలుం బురూరవుఁద్రిశంకుసుతు న్బురుకుత్సుఁ గార్త వీ
ర్యు గయుఁ బృథుం భగీరథు సుహోత్రు శిబిం భరతుం దిలీపునిన్
భృగుకులు యౌవనాశ్వ శశిబిందు ననంగుని నంబరీషుఁ బూ
రుగురుని రంతి రాఘవు మరుత్తునిఁ గాలము క్రోలుపుచ్చదే ? ౩౦

క. కానఁ దటిచ్చల మగు రా
జ్యానందము మరగి యింద్రియారాముఁడ నై
పో; వింతనుండి పరలో
కానందంబునకె యత్న మాపాదింతున్. ౩౧

క. వర్గత్రయపరత మహా
స్స్వర్గక్ష్మామధ్యమాధ్వజ జ్జాలకతా
దుర్గతియ నొల్ల; మటి యప
వర్గదుఁ దేవే ల్పెటింగి వాని భజింతున్. ౩౨

క. అని తలఁచి మెచ్చి, యవ్వి
ప్రునకు స్ఫటికకరండమున ముద్రిత మై
యునిచిన యొక మడు పార
ఖునిచే నిప్పించి, నగరు సొచ్చి, చనఁగా. ౩౩

క. కొలువై జపఁసమయంబుల
మెలఁగెడ కోవిదులఁ గూర్చి 'మీ మీ శాస్త్రం
బులలో నెవ్వఁడు మోక్షం
బెలయించునొ చూచి నిశ్చయింపుఁ' డటంచున్. ౧౪

తే. వాద మొనరించి గెలిచి తత్త్వంబు దెలుపు
వాని కని బీరపువ్వులఁబోని టంక
సాలవాటులు నించి యాస్థానిఁ గట్టఁ
గాలనర్పముగతి వ్రేలుజాలెఁ జూచి. ౧౫

క. హరు నొకఁ డన, నుమ నొకఁ డన
హరి నొకఁ డన, శిఖి నొకఁ డన, నర్కు నొకఁ డనన్,
గరిముఖు నొకఁ డన, రజనీ
శ్వరు నొకఁ డన, నజు నొకఁ డన, వాదై నతటిన్. ౧౬

తే. విల్లిపుత్తూరిలో నల్ల విష్ణుచిత్తుఁ
డతులతులసీసుగంధిమాల్యమును మూల
మంత్రమున నక్కు సేర్పఁబో మన్ననారు
దారమధురోక్తి నవ్విధ మానతిచ్చి. ౧౭

ఉ. 'నేఁడు, మహామతీ, మధుర నీవు రయంబున జొచ్చి. యందుఁ బాం
డ్యుఁడు దివాణము న్నెఱయ సించినఁ బ్రేలెడు దుర్మదాంధులన్
బోఁడిమి మాన్చి, మన్మహిమముం బ్రకటించి హరింపు శుల్కమున్;
వాఁడును రోసినాఁ డిహము: వైష్ణవుఁగా నొనరింపు సత్కృపన్. ౧౮

తే. అనిన వడవడ వడఁకి సాష్టాంగ మెఱఁగి.
నమ్మదాశ్రులు పులకలు ముమ్మరింప
వినయవినమితగాత్రుఁడై విప్రవరుఁడు
వెన్నునకు భక్తి నిట్లని విన్నవించె. ౧౯

శా. 'స్వామీ, నన్ను, నితఃపురాపఠితశాస్త్రగ్రంథజాత్యంధు, నా
రామక్ష్మాఖననక్రియాఖరఖనిత్రగ్రాహితోద్యత్కిణ
స్తోమాన్విగ్రహు. నృపద్వ్యపసదాసు, న్వాదిఁ గాఁ బంపుచో
భూమీభృత్సభ నోడి మైన నపహాసోల్లాసుఁ గాకుండునే? ౨౦

మ. గృహసమ్మార్జనమో, జలాహరణమో, శృంగారపల్యంకికా
వహనంబో, వనమాలికాకరణమో, వాల్లభ్యలభ్యధ్వజ
గ్రహణంబో, వ్యజనాతపత్రధృతియో, ద్రాగ్దీపికారోపమో,
నృహరీ వాదము నాకు ? లేరె యితరుల్ లీలకుం బాత్రముల్ ? ౯౦

## మన్ననారు విష్ణుచిత్తు ననుగ్రహించుట

తే. అనిన తద్భక్తి కెద మెచ్చి యచ్యుతుండు
మొలకనగ వొప్ప శ్రీదేవి మోము నూచి,
'వా దితనిచేనె గెలిపింతు; నాదుమహిమ
మువిద కను' మని ప్రాభవం బొప్పఁ బలికె. ౯౧

క. 'నీయిచ్చయె ? మిన్నక పో
వోయి; మునిప్రవర, నిన్ను నొప్పింతుసు భూ
నాయకుసభ; నిందులకై
యేయుద్ధము వలవ, దవల నే మన్నాఁడన్.' ౯౨

ఆ. అనిన, మాఱు పలుక నలికి యయ్యోగివా
రియ్యకొనియెఁ బోవ; నింతలోనఁ
బద్మనయనుఁ డతని పయనంబుఁ దూఁగింపు
మనుచు నంబితోడ నానతిచ్చె. ౯౩

## విష్ణుచిత్తుఁడు మథుర కేఁగుట

క. ఆనతిఁ బడి, శ్రీభండా
రాన న్పంబళముఁ దనదు ప్రాఁతందలమున్
స్థానికుఁ డొసంగి వసువం
గా, నానతిబడిన నిమితకాండ్రు వహింపన్ ౯౪

క. లావు గల యద్దెకట్టుపుఁ
జావడములమీఁద మాత్రసంచులు దూలన్,
గ్రేవల నేకాంగులు రా,
వీవధముల నటిసె లవనివిభునకు గొనుచున్.

సీ. భక్తిఁ బ్రోవకు సాధ్వి పరికరంబులు వెట్టి
కట్టిన పొరివిళంగాయ గమియు,
నెనడిపోఁతలు గాఁగ నేర్పరించిన చిరం
తనపు శాలిక్షేమతండులములు,
వడిఁబెట్టి లోఁ జెఱకడము సాఁబా లూన్పఁ
జెలఁగు నంబారంపుఁ జింతపండు,
పెల్లు లోహండికావళ్ళ కొమ్ముల వ్రేలు
గిడ్డిముత్తపు నేతిలడ్డిగలును,

తే. బెరుఁగువడియంబులును, బచ్చివరుగు, బేడ
లురుతరాచ్యుత పూజోపకరణపేటి
కలును, సాత్తిన సాత్తనికులము బలసి
విధినిషేధము లెఱిఁగి తే మధుర కరిగె. ౯౭

ద్వితీయాశ్వాసాంతము

చ. యమనియమాదిలభ్య, ద్రుహిణాది జరన్మరుదీడ్య, సంసృతి
శ్రమహరనామకీర్తన, మురప్రవికర్తన, పాతకావలీ
దమన, రమాంగనాకమన, తామరసాయతనేత్ర, భక్త హృ
ద్భ్రమతృణదాత్ర. భూయువతి రంజన, వర్ణ జితాభ్రఖంజనా. ౯౮

క. దోర్ధూర్ధృతదుర్ధరగో
వర్ధన, రాధానురాగ వర్ధన, లీలా
వార్ధుషికా, యిషికాకృత
వార్ధ్రశవసైక నేత్ర వైకృతినిపుణా. ౯౯

మాలిని.

ద్రుహిణజముఖమౌనిస్తోమని స్తంద్రభాస్వ
ద్దహరవిహరమాణాత్మపాదాంబుజాతా,
బహిరబహిరపారప్రాణికోటి ప్రపూర్ణా,
మహిమవినుతివాణీమాధురీవేద్యపర్ణా. ౧౦౦

మ. ఇది శ్రీమత్కొండవీడుధరణీభృద్దుర్గహర్మ్యాద్రిభి
త్ప్రదిభేదాత్మజవీరభద్రజవజీవగ్రాహరాహూయమా
నద్భుధాంచద్భుజకృష్ణరాయమహీపాల్మన్నామాస్మదాముక్త మా
ల్యద నాశ్వాసము హృద్యపద్యము ద్వితీయం బై మహిం బొల్పగున్.

ద్వితీయాశ్వాసము సమాప్తము

— : o : —

శ్రీరస్తు

# ఆముక్తమాల్యద

## తృతీయాశ్వాసము

శ్రీక్షితినీళావర, దను
జోక్షప్రాణహర, దంష్ట్రికోత్కృత్తహిర
ణ్యాక్షక్షపాచర, కృపా
పీక్షాదృతబాహులేయ, వేంకటరాయా. ౧

వ. అవధరింపు. మట్లరిగి విష్ణుచిత్తుండు. ౨

### విష్ణుచిత్తుఁడు రాజసభ కేఁగుట

శా. నిత్యంబు న్హరిహారి వాద మగుట న్విజ్ఞప్తి లేకంపఁ, దా
నత్యూర్జస్వలుఁ డౌట భూపతియు సత్యవ్రాతము న్శంకమైఁ
బ్రత్యుత్థానముఁ జేసి నిల్వఁగ, సభాభాగంబు సొత్తెంచి యా
న్నత్యప్రోజ్జ్వల రాజదత్త వరరత్న స్వర్ణపీఠస్థుఁడై. ౩

క. అతిథ్యము గొని, హరి తన
చేతోగతి నొలయ, రంతు సేయని విద్యా
వ్రాతంబుఁ జూచి, 'లాఁతుల
మా తరవా యుడుగ ? మాటలాడుం' డనుచున్. ౪

తే. కతిపయోక్తులఁ గోనె తత్ప్రీతిఁ దెలిపిఁ
నగవు దళుకొత్త రాజు నెమ్మొగముఁ జూచి,
'యీవు మాధ్యస్థ్యమున నున్న నేము గొన్ని
నొడివెదము మాట' లని తదనుజ్ఞ వడసి. ౫

## విష్ణుచిత్తుల వాదము

సీ. అందులో నొకమేటి కభిముఖుం డై యాతఁ
డనిన వన్నియు ననువదించి;
తొడఁగి యన్నిటి కన్ని దూషణంబులు వేగ
వడక తత్సభ యొడఁబడఁగఁ బల్కి;
ప్రక్కమాటల నెన్న కొక్కొకవా టనె
నిగ్రహస్థాన మనుగ్రహించి;
క్రందుగా రేఁగినం గలఁగ కందఱఁ దీర్చి
నిలిపి; యమ్మొదలి వానికినె మగిడి;
తే. మఱి శ్రుతి స్మృతి సూత్ర సమాజమునకు
నైకకంఠ్యంబు గల్పించి, యాత్మమతము
జగ మెఱుంగఁగ రాద్ధాంతముగ నొనర్చి;
విజితుఁగావించి దయ వాని విడిచి పెట్టి. ౬

క. 'నీ వే మంటివి ర' మ్మం
చావలివానికిని మగిడి యట్లనె వానిం
గావించి; యొకఁ డొకఁడు రా
నా విప్రుఁడు వాదసరణి నందఱ గెలిచెన్. ౭

### అన్యమత ఖండన

సీ. 'జగదుద్గతికిని బీజము ప్రధాన' మన నీ
క్షత్యాది పేరు నశబ్దవాదిఁ
బోరి 'నీశుఁ డేన' నా భోగమాత్రేత్యాద్యు
దాహృతిస్ఫూర్తి మాయావివాది,
'ఫలియించుఁ గ్రియయ' నా ఫలమత ఇత్యాది
సర్వేశుఁ గానని యపూర్వవాది,
'శాస్త్రయోనిత్వా' ది సరణి 'నీశ్వరునిఁ దె
ల్పెదు ననుమాన', మన్పీలువాది,
తే. 'నిత్యులం దెల్ల నిత్యుఁ,' డన్శ్రుత్యురూక్తి
క్షణికసర్వజ్ఞతేషి సౌగత వివాది,

'ననువపత్తేర్న' యను సూత్రమున యైన
వాణి నృపతికిఁ బ్రత్యక్షవాచి, గెలచె. ౮

శా. విద్వద్వందితుఁడాత డిట్లు సుఖసంవిత్తత్త్వబోధైకమం
చద్వైపాయనసూత్రసచ్ఛ్రుతుల నీశు స్మ న్నిరూపించి, వైఁ
దద్విష్ణుత్వము దాని కన్య ద్వివిషద్వ్యావర్తనంబు స్వశా
స్త్రాద్వైతంబును దేటగాఁ దెలుప మాటాడె న్ప్రమాణంబులన్. ౯

సీ. ఆదినారాయణుం డాయె నొక్కఁడ బ్రహ్మ
లేఁడు, మహేశుండు లేఁడు. లేదు
రోదసి, లేఁడు సూర్యుఁడు, లేఁడు చంద్రుఁడు,
లేవు నక్షత్రము, ల్లేవు నీళ్లు,
లే దగ్ని; యట్లుండ 'లీల నేకాకిత
చనదు; పెక్కయ్యెద ననుచు నయ్యెఁ
జిదచిద్ద్వయంబు సొచ్చి ' యని ఛాందోగ్యంబు
దెలిపెడు; నంతరాదిత్యవిద్య

తే. నక్కలోఁ బుండరీకాక్షుఁ డతఁడ యగుట
కక్షిణీ యని, యష్టదృక్ప్రేక్ష దశశ
తాక్ష విధి రుద్ర శక్రాదులందు నొకఁడు
కామి కాశ్రుతియే విలక్షణతఁ దెలిపె. ౧౦

మ. తుల లేకుండు స్వరూప రూప గుణ భూతుల్దోఁచు నేతచ్ఛ్రుతిన్;
దల మై లో వెలిఁ దానె యున్కిఁ దెలిపె న్నారాయణం; బారుణం
బుల సామాన్యవిశేషరీతి నిఖిలంబు న్శబ్దజాలంబు ని
ర్మలనారాయణశబ్దమందునె తుద న్పర్యాప్త మయ్యె న్శ్రుతిన్. ౧౧

క. వా 'దపహతపాప్మా ది
వ్యో దేవ ' యనంగఁ బరఁగు సూక్తులమీఁదం
బా దగు నారాయణపద
మే దేవాంతరము జేమి కీ శ్రుతిఁ దీర్చెన్, ౧౨

వ. "తొల్లి జామదగ్న్యభయంబునం బరిత్యక్తరాజ్యం డై వైరాగ్యంబున దివో
దాసాత్మజుం డగు ప్రతర్దనుండు జనార్దను నెఱుంగక యపవర్గకాంక్ష నింద్రు

నారాధించిన నతండు సన్నిహితుండై 'మా ము పా స్వ' యనుటయు; ముందు గర్భమునందుండియు నఖండిత తపస్ఫురిత వామదేవుం డగు వామదేవుండు 'సూర్యోఽహం మనురహం కక్షీవానహ'మ్మని శరీరవాచక శబ్దంబు శరీరిపర్యంతంబు వోవుటంజేసి చిదచిచ్ఛరీరకుం డగు నప్పరమాత్ముంగూర్చి యనుసంధించెననియు దెలిపి; చేతనుండైన తా జగత్కారణంబు గామి విబుధులందెల్ల విజ్ఞానవృద్ధుం డగు నా వృద్ధశ్రవుండు తదనుసంధాన న్యాయంబున నుపదేశించె నని శ్రుతిసూత్రముఖంబుల నిగమాంత శాస్త్రపంక్తులఁ జాల వక్కాణింపంబడు; నాత్మయు నవనియు ననల పవన గగన కాల మృత్యు ప్రవృత్త్యఖిల చిదచిత్ప్రపంచంబు లతనిశరీరంబు లనియు నందె వివరింబడు; నట్లగుట నశేష దివిషచ్ఛరీరంబు లన్నారాయణ శరీరంబులే కదా, యని ముముక్షువున కన్నంతరీణాక్షుఁడంగ నేవ్యక్తి నైన నుపాసింపవచ్చునే! విష్ణునకుఁ దత్తత్కాల విగ్రహంబు లపుడు బ్రహ్మ రుద్రార్జున వ్యాస శాను శార్గ వాది భజనంబు త్రైవర్గికునకుం గాక యపవర్గ కాంక్షుంకయుక్తం బని స్మృతి చెప్పు; నదియునుంగాక, యీశ్వరునకుఁ జేతనునకు నిత్యసంబంధంబు 'మాతా పితా భ్రాతా నివాస శ్శరణం సుహృ ద్గతి ర్నారాయణ' యని సమస్తంబునకుఁ బరాయణంబుగా, నతనిం బ్రతిపాదించు శ్రుత్యంతరంబు గల; దట్టి పరమేశ్వరుం గనుఁగొనుటకుం దగిన యోగంబుఁ జెప్పెద; ఖాండిక్య కేశిధ్వజ సంవాదంబు వినుమని యిట్లనియె. ౧౩

## ఖాండిక్య కేశిధ్వజ సంవాదము

మ. జనకాఖ్యాఖిలరాజ మొప్పు నిమివంశం; బందు ధర్మధ్వజుం
డను భూజాని మితధ్వజాఖ్య వసుధాధ్యక్షుం జగద్రక్షణా
వనజాతాక్షుఁ గృతధ్వజాఖ్యుఁ గనియె; న్వారిద్దఱు న్గర్మఠున్
మనవిజ్ఞాన క్రమంబునం గనిరి తత్ఖాండిక్యుఁ గేశిధ్వజున్. ౧౪

మ. వారిరువురు దమలోపల
వైరము గొని, రాజ్యకాంక్ష విజిగీషువు లై
హోరాహోరిగఁ బోరిరి
వారాదిదినంబు లవని ప్రజలు దలంకన్. ౧౫

త. పలవల వేగ నిచ్చలును బోఁజులు దీర్చి యతండు నాతఁడున్
వెలువడి వచ్చి, యిక్షుమతివేదిక యేపిరిగాఁగ నీఁగుచున్

దలపడుచుం బెనంగఁగఁ, గృతధ్వజనందన సైనికావళి
హాళహాళికిం జెడ న్విఱిగె నార్తి మితధ్వజనందనుం దనిన్. ౧౬

క. చెడ విఱిఁగి యడవిఁ బడి, యొక
నెఱిఁ గట్టులతుదలఁ గోటి యిడి, లోఁగడకున్
దడుకు వొడివించి, యాకుల
గుడిసెల వసియించె మంత్రిగురుభటయుతుఁడై. ౧౭

శా. ఆ కేశిధ్వజుఁ డంత నా నృపునిరాజ్యం బెల్లఁ జేర, న్ఫలం
బాకాంక్షింపక 'గెల్తు మృత్యువు నవిద్య న్బుట్టకుండుం, దుదన్
జా కుందు న్వడి' నంచు యోగనియతిం జ్ఞానాశ్రయుండై మఖా
నీకంబు ల్రచియించుచుం దొకటికిం దీక్షించి తా నున్న చోన్. ౧౮

చ. పులు మఖశాలికానికటభూముల మేయుచు నేటివెంటఁ బె
ల్లలమెడుసీఁటముం దటిని యామ్యవతాకన ఘర్మధేను వా
కెళవున నాకువాంఛజగిం గని గోంట్రని యంగలార్చుచున్
గళగతఘంటమ్రోయ నుఱుకం బిడుగుం బలెఁదాఁకి యుద్ధతిన్. ౧౯

ఉ. గబ్బు నమక్షికం బయి మొగం బడువ, స్తరుపర్ణము ల్పతన్
ద్రొబ్బుచుఁ, గార్మొగిళ్ళరొదతోఁ జెలఁగాడెడు బొబ్బరింతగా
ద్బుబ్బి వినంజ్ఞగాఁగ, జెవు లూఁదిన, వల్లవుఁ డుబ్బిఁ గూలఁగా,
బెబ్బులి గొంతుకో ల్గఱచి పెల్లున మార్మెడ ద్రెళ్ళ దాఁటుచున్. ౨౦

ఆ. తనువుఁ గొమ్మ గొరిజ గొనకుండ మలఁపుచుఁ,
జివ్వ దెనఁగఁ దోఁక నవ్వళించి,
శోణితంబు గ్రోలుచునె నేర్పుమై ఘర్మ
గవిని గవికి నీడ్చు నవసరమున. ౨౧

చ. పొంచుచు లంకె కూఁత లిడ, భూసుర లన్నదిలోన వార్చి, ప్రా
కుల కుదలెక్కి, చప్పటులు గొట్టి యదల్పఁగ, సాహిణీలు మా
వులఁ బఱపంగ, వైచి సెలవుల్వెన నాఁచుచుఁ బోయె వృక్షమం
దలికయి తెంచుచున్ గుటగుటధ్వని సాఁచె మలంగి చూచుచున్. ౨౨

క. జుఱుజుఱుకని నెత్తురు వెలి
కుఱుకుచు రొద సేయ, నటితి యొనపినె యూర్పుల్

వఱవ, మిడిగ్రుడ్ల వణకుచు,
గొఱప్రాణముతోడఁ దన్నుఁగొను నమ్మొదవున్.

సీ. విన్నపంచుటయు ఋత్విజులఁ బ్రాయశ్చిత్త
మడిగె రా: జడిగిన నడుగు పనిరి
వారు కసేరువుఁ దా రెఱుంగక పోయి;
యతఁడును శునకుని నడుగు మనియె;
నతఁడు దాను నెఱుంగ నని పల్కి, 'నృప, విను;
మా ఋత్విజులవిందు నాకసేరు
వేను నెఱుంగ లే: మిఁక నొక్కయేమె కా,
దిల మఱి యెవ్వాఁడు నెఱుఁగఁ; డెవ్వ

తే. దేని నష్టాంగములు నీకు నిచ్చి చెట్లు
వట్టి పెన్నాంతివ్వలు వట్టి తిరుగు
నట్టిఖాండిక్యుఁ డొక్కఁడ యరయ నెఱిఁగె
నే నెఱుఁగు; వేఁడు మది కర్గమేని' యనిన. ౨౪

చ. నరపతి పల్కి, 'మౌని వర, నారిపు నిష్కృతి వేఁడఁబోయిన
న్నర హతుఁ జేసెనేని నవనంపు ఫలం బొనఁగూడుఁ; గా కమ
త్పరగతిఁ జెప్పె నేని మఖతంత్ర మతంత్రము గాక పూర్ణ మౌ:
నిఱుదెఱఁగు న్మదీప్సితమె, యేఁగెద' నంచు రథాధిరూఁఢుడై. ౨౫

క. హరిణాజినోత్తరీయుఁడు
నిర్ఆయుధుఁడు నగుచు నతని నెల వగు నడవిన్
జొరఁ, గొట్టికాండ్రు దెక్కెముఁ
బరికించి, యెఱిఁగి, కలయఁబడి, కూఁత లిడన్. ౨౬

ఆ. వలస బెదర, నృపతి కలఁగక వ్రజవగ
లార్పఁ బనిచి, కనుమ లందు నిలువ
వేలు వేల యేర్చి విలుమందిఁ బనిచి, తాఁ ౨౭
దదుకు పెండె మలుక వౌదమ వెడలి. ౨౮

క. వచ్చు రిపుఁ జూపులనె చుఱ
పుచ్చుచు, నిరిఁ గొనుట మగుఁగఁ బొదముట రుష ము

చ్చిచ్చున లావెచ్చఁగ వి
ద్యుచ్చలదాపమునఁ దూపు దొడుగుచుఁ బలికెన్. ౨౮

మ. 'ధన ధాన్య ద్విర దాశ్వ గోగణ సమేతం బెల్ల సామ్రాజ్యమున్
గొనియుం జాలక లాటకేయ పంథు క్కూటాక్షతిం జింకతో
లున నాచన్నుఁగవై ప్రశాంతగతి మాలోఁ జొచ్చి ప్రాణంబులున్
గొన నేతెంచెదె? దుర్మతీ, కెడపెద న్గూర్రంపు ఖల్లంబునన్. ౨౯

మహాస్రగ్ధర.
అనినం, జేయెత్తి, "యోహో,
యలుగక విను; కా నాతతాయి: స్వప్రమాదం
బున వైకల్యంబు యాగం
బునకుఁ బొడమ, నే భూసురశ్రేణి వేఁతన్,
నిను నావేదించి పంపెన్:
'నృప, యతఁ డెఱుఁగు న్నిష్కృతి; న్వేడు పోపొ'
మ్మని, కోప మ్మైన రోష
మ్మయిన విడువు; మె ట్లైన మే లింక' న్ననన్. ౩౦

వ. అనిన, నతండు తరుషంతంబు సొచ్చి, మంత్రి పురోహిత ప్రభృతి సుహృజ్జనంబులకుఁ దద్వృత్తాంతం బంతయుం జెప్పి, మంతనంబునకుం జొచ్చిన మంత్రు లి ట్లనిరి. ౩౧

క. 'పాలు గల వాఁడు మన కొక
జాలి యిడక తానె తారసానకు వచ్చెన్;
వేళ యిదె, తెమ్ము, నృప కృప
చాలు, న్గాదాకు మేపి చంపకు ప్రజలన్. ౩౨

ఉ. అంటులు గట్టి చెక్కలకు నాంగ్రసును బిడ్డలఁ గూరఁగోయఁ బోఁ,
గంటకము ల్పదాబ్జములఁ గాఁడ నొదర్చిన నొప్పిఁ గూయిడన్,
గంటికినిద్ర గాన కొదుఁగంబడి వేఁగెద మిందు; నొక్కమా
కంటయు కాదు; నీవు పడునట్టియవస్థ వచింప శక్యమే ? ౩౩

తే. స్వామ్యమాత్య సుహృ త్కోశ జనపద బల
దుర్గములు స్వామి గలిగిన దొలుతఁ గలవు,

అంగి సుఖియైన సంగంబు లంటకు మునుపె
చాల సుఖ లౌట మనకు దృష్టంబు గాదె ? ౩౪

క. అతనివ౨ దీర్ఘ రాజ్య
ద్వేషయుము నిను జేరు; నెట్టినెరవున నైనన్
క్షితిపుల కరిజయము ధనో
న్నతియుఁ బ్రజానదయరక్షణము ధర్మంబుల్. ౩౫

క. అన్యాయంబున దుస్సహ
మన్యుం డగు ప్రబలరిపుని మడియించిన ధ
ర్మన్యక్కృతి కగు నిష్కృతి
సన్యాయంబుగఁ బ్రజాళి సంరక్షింపన్. ౩౬

క. తనరాష్ట్రము చెడ వచ్చిన
ననిమిషపతి విప్రుఁ దనకు యాచార్యుఁ
డ్రుని దునుమఁడె ? విడువుము దయ;
నిను నమ్మిన ప్రజలు నవయ నీ దయ యేలా ? ౩౭

క. శిష్టు నిను నింతఁ జేసిన
దుష్టాత్ముని విలుకు మార్చి, దురితము పెదపఁ
నష్టంబుగ, భూవల్లభ,
యిష్టాపూర్తములు సేసి యెనఁగఁగ రాదే ? ౩౮

తే. ఇంక రెన్నాళ్ళు నూచి, నీవంకఁ దెగువ
గలుగ కుండినఁ బ్రజ లూళ్ళు దలఁచి పోవ
మౌని వగుటయె యొంచె, విహీనసంధి
నతనిఁ గను టొండె గా కొండు మతము గలదె ? ౩౯

క. జనవర, తపమునకుం జొ
చ్చినఁ గన్నులు మూసికొంటె సెల; వింతియకా
క నిదిధ్యాసకు బ్రహ్మం
బెనయునె పరిభవపుశల్య మెదలో మెఱమఁ ? ౪౦

క. అవమతిఁ బిత్రుఘ్ను లగు భూ
ధవుల వెదకి పిల్లపిల్లతరము దునిమి భా

A—4

చ్చిచ్చున లావెచ్చఁగ వి
దృచ్ఛలదాపమునఁ దూపు దొడుగుచుఁ బలికెన్. ౨౮

మ. 'ధన ధాన్య ద్విర దాశ్వ గోగణ సమేతం బెల్ల సామ్రాజ్యమున్
గొనియుం జాలక కాటకేయ పలభు క్కూటాక్షతిం జింకతో
లున నాచ్ఛన్నుఁడవై ప్రశాంతగతి మాలోఁ జొచ్చి ప్రాణంబులన్
గొన నేతెంచెదె? దుర్మతీ, కెడపెద న్గ్రూరంపు భల్లంబునన్.' ౨౯

మహాస్రగ్ధర.
అనినం, జేయె త్తి, "యోహో,
యలుఁగక విను; కా నాతతాయిః నృప్రమాదం
బున వైకల్యంబు యాగం
బునకుఁ బొరమ, నే భూసుర శ్రేణి వేఁడన్,
నిను నావేదించి పంపెన్:
'నృప, యతఁ డెఱుఁగు న్నిష్కృతి; న్వేడు పోపో'
మ్మని, కోప మ్మైన రోవ
మ్మయిన విడువు; మె ట్లైన మే లింక" న్ననన్. ౩౦

వ. అనిన, నతండు తరుషండంబు సొచ్చి, మంత్రి పురోహిత ప్రభృతి సుహృజ్జనంబులకుఁ దద్వృత్తాంతం బంతయుం జెప్ప, మంతనంబునకుం జొచ్చిన మంత్రు లి ట్లనిరి. ౩౧

క. 'పాలు గం వాఁడు మన కొర
జాలి యిడక తానె తారసానకు వచ్చెన్;
వేళ యిదె, తెమ్ము, నృప కృప
చాలు, న్గాతాకు మేపి చంపకు ప్రజలన్. ౩౨

ఉ. అంటలు గట్టి చెర్కులకు నాంధ్రుసును బిడ్డలుఁ గూరఁగోయఁ బోఁ,
గంటకము ల్పదాబ్జములఁ గాఁడ నొదర్చిన నొప్పిఁ గూయిడన్,
గంటికినిద్ర గాన కాదుఁ గంబడి వేఁగెద మిందు; నొక్కమా
కంటయ కాదు; నీవు వదునట్టియవస్థ వచింప శక్యమే? ౩౩

తే. స్వా మ్యమాత్య సుహృ త్కోశ జనపద బల
దుర్గములు స్వామి గలిగిన దొలుతఁ గలవు,

అంగి సుఖియైన సంగంబు లంటకు మునుపె
దాల సుఖ లౌట మనకు దృష్టంబు గాదె ? ౩౪

క. అతని వలె దీర్ఘ రాజ్య
ద్వితయము నిను జేరు; నెట్టినెరవున నైనన్
క్షితిపుల కరిజయము ధనో
న్నతియుఁ బ్రజానందయరక్షణము ధర్మంబుల్. ౩౫

క. అన్యాయంబున దుస్సహ
మన్యుం డగు ప్రబలరిపుని మడియించిన ధ
ర్మన్యక్కృతి కగు నిష్కృతి
సన్యాయంబుగఁ బ్రజాళి సంరక్షింపన్. ౩౬

క. తనరాష్ట్రము చెడ వచ్చిన
ననిమిషపతి విప్రుఁ దనకు యాచార్యుఁ
డ్డనిఁ దునుమఁడె ? విడువుము దయ;
నిను నమ్మిన ప్రజలు నవయ నీ దయ యేలా ? ౩౭

క. శిష్టు నిను నింతఁ జేసిన
దుష్టాత్ముని బిలుకు మార్చి, దురితము పిదపన్
నష్టంబుగ, భూవల్లభ,
యిష్టాపూర్తములు సేసి యెనఁగఁగ రాదే ! ౩౮

తే. ఇంక రెన్నాళ్ళు నూచి, నీవంకఁ దెగువ
గలుగ కుండినఁ బ్రజ లూళ్ళు దలఁచి పోవ
మౌని వగుటయె యొంటె, విహీనసంధి
నతనిఁ గను టొండె గా కొండు మతము గలదె ? ౩౯

క. జనవర, తపమునకుం జొ
చ్చినఁ గన్నులు మూసికొంటె సెల; వింతియకా
క నిదిధ్యాసకు బ్రహ్మం
బెనయునె వరిభవపుశల్య మెదలో మెఱమన్ ? ౪౦

క. అవమతిఁ బిత్రుఘ్ను లగు భూ
ధవుల వెదకి పిల్లపిల్లతరము దునిమి భా

ర్గవుఁడు ముని యయ్యె; మఱి వై
భవము వలదు, శాంతి కైనఁ, బగ దెగ కగునే ? ౪౧

తే. పగయు వగయును లేక యేపాటి గన్న
నలరు సామాన్య సంసారి యగుట మేలు;
మఱి తగిలెనేని శాంతిచే మఱవఁ దగదు
రాజ్యభూమికఁ దాల్చిన రాజునకును. ౪౨

క. పులి మల డిగ యూళ్ళకు న
ఖులరుజ రా జనము మాన్పుకోఁ బనిచి, గవిన్
నెలకొన సురియలు గొని చని
పొలియునొ ? యూరఁ గయిరేఁగి పొడుచునొ ?-చెప్పుమా, ౪౩

క. ఈవేళ బలియు నతనిం
బో విడిచితి పొమ్ము పాడిఁ, బోయినరాజ్యం
బే విధిఁ గ్రమ్మఱు ? నావెర
పీవెర వని వ్రేలు మడిచి యేర్పడఁ జెపుమా. ౪౪

తే. అలసతఁ బరున్న మనుజుండు కలియుగంబు;
ద్వాపరం బెన్నఁ గూర్చున్న వాఁడు; త్రేత
యుత్థితుఁడు; యాయి మఱి కృతయుగ; మ టన్న
నముచిదమనోక్తి ఋగ్బ్రాహ్మణమున వినమె ? ౪౫

క. ఛిద్రప్రహారి, రాష్ట్రో
పద్రవ పరిహారి, యాప్తభాషణ రుచి, వే
శోద్రిక్తుండు నవేళా
న్నద్రిక్తుఁ, డనల్పకాల మొర్విఁ భుజించున్. ౪౬

వ. లే తెమ్మనుటయుఁ బ్రధానులకు భూనాథుం డిట్లనియె. ౪౭

క. మీ నాఁడి వినయది కార్యం
బౌ; నివ్వని సేయ రాజ్య మంతయు మనకున్.
వానికిఁ బరలోకము జిత
మౌ నొక్కట; నిందు వాసు లరయఁగ వలయున్. ౪౮

క. పరలోక సుఖము శాశ్వత
మరయ; మహీరాజ్యసౌఖ్య మల్పానేహః
పరిభోగ్యం; బిందులకై
దురితము గావించి తొలఁగుదునె పరమునకున్ ? ౪౯

క. 'బద్ధాంజలిపుటు దీనుఁ
గ్రుద్ధుండై శరణు చొరఁగఁ గూల్చుట కడుఁ గీ;
డుద్ధతి పరలోకార్జన
బుద్ధికి ' నను కణ్వవాక్యములు దలఁప రాకో?' ౫౦

ఆ. అనుచు వెడలి వచ్చి, యారాజు నడిగి, త
ద్ధర్మ్మ వైదికీ వధ క్రమంబు
దెలిసి, తగన విష్కృతి వచింప నాతండు
మగుడఁ గ్రతువు సాంగముగ నొనర్చె. ౫౧

ఆ. అవభృథాప్లుతోత్తమాంగుఁడై : ఋత్విక్స
దస్యగణముఁ బూజఁ దనివి, విదవ
సూత మగధ వంది వైతాళిక ప్రభృ
త్యర్థికోటి కభిమతార్థ మొసఁగి. ౫౨

తే. మఱియుఁ గోరినవారి యక్కఱలు తీర్చి
యును మనఃపూర్తి చాల కొయ్యనఁ దలంచి,
'యకట గురుదక్షిణ యొసంగ నయితి' నంచు
మగుడఁ జని, శంక నతఁడు సంభ్రమపడంగ. ౫౩

క. వారించి, 'నీకు నెయ్యది
కోరిక ? యేతెంచినాఁడ గురుదక్షిణ యీ,
ధీరమణ, వేఁడు' మనుటయు,
నారాజన్యుండు మఱియు నాప్తులతోఁడ. ౫౪

క. 'గురుదక్షిణ యిచ్చుట కీ
నరవరుఁ దేతెంచె ; మీరు నా కనురక్తుల్;
పరికించి పడింబడిగా
నరయుఁడు మది నెద్ది మేలు ప్రార్థించుటకున్.' ౫౫

ఉ. నావుఁడు, వార లమ్మనుజనాథున కిట్లని రుబ్బి; "నేఁడుగా
దైవము గల్గె; వేగ గురుదక్షిణగాఁ జతురర్ణవీవృతో
ర్వీవలయం బశేషమును వేఁడుము, భూవర ; మమ్ము నందఱం
బ్రోవుము ; బాంధవాప్తజనపోషణకన్నను బుణ్య మున్నదే ! ౫౬

ఉ. ఎన్నఁడు లావు గూడు మన ? కెన్నఁ డగు స్థితి ? యయ్యె నేని పో
రెన్నిక యౌనె ? పోరన జయింపనె చెప్పిరె ? నీదుభాగ్యసం
పన్నతఁ జేరెఁ గార్య మిటు : బంధు సుహృత్తతి కొక్కకీడు రా
కున్నటు లుండఁగానె, సిరు లూరక చావక నోవ కబ్బునే ?' ౫౭

చ. అనవుఁడు నల్ల నవ్వి మనుజాధిపుఁ డిట్లను:- "మీర లర్థసా
ధనపరతంత్రకోవిదులు దక్క, మహాసుఖదాయి మోక్షమా
ర్గ నయ విచారకోవిదులు గా, రతిచంచల రాజ్యలక్ష్మి నే
మని చని వేఁడు వాఁడఁ, బరమార్థము వేఁడక యన్మహామతిన్ ? ౫౮

క. నిమివంశోత్పన్నుల మఁట,
మముబోఁటుల కొకట రాజ్యమా లక్ష్యముఁ ? వాఁ
డమలిన యోగాశ్రయుఁ ; డు
త్తమయోగము గొనుట యురవో, ధరఁ గొను టురవో ? ౫౯

సీ. విడుఁ." డని పీడు వెల్వడి వచ్చి ఖాండిక్యుఁ
డారాజుఁ గనుఁగొని గారవమున,
'గురునిష్క్రియంబు నిక్కువముగా నొసఁగెదే ?'
యని పల్క, 'యిత్తుఁ దథ్యముగ' నన్న;
'నవనీతలేంద్ర, నీ వధ్యాత్మరతుఁడవు ;
దక్షిణ గురున కీఁ దలఁచితేని,
సకలభవక్లేశ సంక్షయం బెయ్యది
యవ్విద్య బోధింపు' మనిన నవ్వి,

తే. 'యహహ ! నిష్కంటకాస్మదీయాధిరాజ్య
మడుగ నొల్లక యిది యేటి కడిగి తివుడు ?
క్షత్త్రియుల కెల్ల రాజ్యంబు కంటె మఱి ప్రి
యంబు గలదె ?' యటన్న ని ట్లనియె నతఁడు. ౬౦

మ. 'విను, కేశిధ్వజ, ధాత్రి వేఁదమికి నావేదించెద న్హేతు : వ
జ్ఞునకుం గాక వివేకి కేల జనియించుఁ లౌల్య మెందుఁ ? రణం
బునఁ బాడిన్ రిపు గూల్చువాఁడియుఁ బ్రజాపోషంబు ధర్మంబు రా
జున కౌ; నైన నశక్తుఁ ద్వద్విజితరాజ్యా న్న న్నఘంబంటునే ? ౬౧

సీ. నరనాథ, యీ రాజ్యపరిపాలనారాతి
హననాదికృతరూప యగునవిద్య
యనధికారికి విసర్జనముఁ గావింపంగఁ
గలుషంబు రా; దధికారి యైన
వాఁడు విసర్జింప వచ్చు వర్ణాచార
లోపంబుచే నగు పాపలేప;
మైన నేనిత్తుఁ గొ మ్మన గొనుధరణి భో
గమునకుఁ గాక ధర్మమున కగునె ?

తే. కాన సత్ క్షత్రియులకు భైక్షంబు కీడు ;
మత్ప్రధానులు వేఁడు సామ్రాజ్య మనెడు
పలుకు ధర్మచ్ఛలంపులోభం, బయుక్త;
మిది యెఱిఁగి రాజ్య మడుగ నే నిచ్ఛగింప. ౬౨

తే. అనవడుదురె బుధులు, రాజ్యంబు, మమత
మానని జడాత్ముల ? ట్లహంమాన పాన
మత్తులకుఁ గాక యవి యేల మాదృశులకు ?"
ననిన హర్షించి మెచ్చి యజ్జనకుఁ డనియె. ౬౩

ఉ. "ఏ నవిద్యవలన మృత్యువుఁ దరియింప,
ననఘ, రాజ్యములు మఖాదికములుఁ
జేయుచున్నవాఁడ, క్షీణింపఁ జేయుదుఁ
బుణ్యఫలము భోగ భుక్తిచేత. ౬౪

క. మన యీ నిమివంశము పా
వన మగుభాగ్యమున, మనుజవర, తత్త్వవివే
చనచింత నీకుఁ బొడమెను ;
విను మిఁక వినిపింతు నే నవిద్యావిధమున్. ౬౫

ఆ. ఆత్మకాని మేన నాత్మబుద్ధియును న
స్వంబునందు మిగుల స్వత్వమతియు,
నవనివర, యవిద్య యను మహాతరువు ను
త్పత్తి కిద్వయంబు విత్తు మొదలు. ౬౬

క. నరనాథ, పాంచభౌతిక
శరీరమున దేహి మోహ సాంద్రతమతమః
పరివృతుఁడై, 'యే నిది నా
పరికర' మని యవధి లేని భ్రమఁ బడి తిరుగున్. ౬౭

క. జల వసు ధాంబర పవన
జ్వలనంబులకంటెఁ దా నజస్రంబు వెలిన్
వెలుఁగొందు నాత్మ యుండఁగఁ
గళేబరము నెవ్వఁ డాత్మగాఁ దలపోయున్? ౬౮

సీ. వపు రుపభోగ్యముల్ నృప గృహక్షేత్రాదు;
లవి బొంది వౌఁగాక, యాత్మ వగునె;
య ట్లన పుత్రపౌత్రాదికములు నాత్మ
కాని మైఁ బుట్టుటఁ, గావు తనవి;
గాన మృత్యువుఁ గను కాయంబున జనించు
పుత్రాదులెడ స్వత్వబుద్ధి దగదు;
ఎవుడేని యాత్మ వేఱే యనునప్పుడె
యదరు భోగంబు లీయాత్మ కంట;
తే. వట్లుగా కీమొదలె యాత్మ యున్న నంటు;
మద్గృహము నిల్చె నెట్లు మృజ్జలాది
వట్ల భౌతికభోగాశనాది భౌతి
కాంగములు నిల్చు; భోగ మిం దాత్మ కెద్ది? ౬౯

మ. జనిసాహస్రమహాప్రయాణ మగు సంసారంపుఁ ద్రోవ న్సదా
చనుచుండు న్ఘన మోహఖేద మలమ స్సంసారిపాంథుండు, వా
నవ లన్ ధూళి మునుంగు గాఁగ; నెపుడేన్ జ్ఞానంపు టుష్ణోదకం
బునఁ దత్క్షాళన సేయు, వాని కవు దమ్మోహశ్రమంబున్ననున్, ౭౦

తే. అట్టి మోహాశ్రయం బాఱ నాశరీరి
స్వస్థుఁ డై తా ననన్యాశ్రయ మబాధ
మనఘ విలసిల్లు నిర్వాణమును భజించు
ననఘ తొల్లియు నిర్వాణ ఖనియ కాన. ౭౧

వ. విను జనేశ్వర! జలం బస్పృష్టదహనం బయ్యుఁ దదీయ యోగంబునఁ గల శోదరంబున నునికిం దా నతిశీతలం బయ్యు నుడికి; శబ్దోద్రేకాది ధర్మంబులం బొందున, ట్లాత్మయుం బ్రకృతి సంబంధంబున నహమ్మానాది దూషితుండై. ప్రాకృతంబు లగు ధర్మంబులం బొందు; వీని కత్యంత విలక్షణుండు నక్షయుండు నాత్మ ; య ట్లగుట నింత యనర్థమూలం బగు నీ యవిద్యాబీజంబు నీ కెఱింగించితి. నేవం విధంబు లగు సకల క్లేశంబులకును నంక్షయకరంబు యోగంబుదక్క మఱియొం డుపాయము లే." దనుటయుఁ బ్రీతుండై ఖాండిక్యుండును "మహాత్మా, యిన్నిమివంశంబున విజ్ఞాత యోగశాస్త్రార్థుండ వీవు; నాకు నయ్యోగంబు నమస్తంబు విస్తరింప వలయు." ననినఁ గేశిధ్వజుండు కృపాళుండై, "మహీపాలా, విను మెందేని సంస్థితుండై ముని మఱి పునర్భవంబునకు రాక బ్రహ్మసాధర్మ్యంబుఁ బొందు నట్టి యోగంబుఁ జెప్పెద, సావధానుండవై విను." మని యిట్లనియె. ౭౨

ఆ. "ప్రాణికోటి కెల్ల బంధంబు మోక్షంబు
చేరుటకును మనసు కారణంబు ;
విషయసంగి యైన, విను బంధకారి ; ని
ర్విషయ మైన, ముక్తివిభవకారి. ౭౩

సీ. విజ్ఞానమునఁ జేసి విషయాదివలన నె
మ్మన మాహరించి బ్రహ్మముఁ బరేశుఁ
జింతింపవలయు నిశ్శ్రేయసంబున ; కట్లు
చింతింప నతఁడు తచ్చింతకునకు
నాత్మభావం బిచ్చు, నాకర్షకము వికా
ర్యశ్మసారముఁ దార్చునట్లు ; యోగ
మన, యమాదివిషయమైనది యాత్మప్ర
యత్నంబున కధీన యైన సాత్త్వి

తే. కపుమనోగతి యెయ్యది గలదు దాని
బ్రహ్మసంబంధినిఁగఁ జేయు బ్రౌఢి నూవె;
యిట్టి వైశిష్ట్యధర్మ మెందేని గలుగ,
నట్టి యోగంబు గలిగిన యతఁడె యోగి. ౭౪

వ. మఱియు, బ్రహ్మచర్యాదులగు యమంబు లేనును, స్వాధ్యాయాదులగు నియమంబు లేనును, నిష్కాముండై యోగి యగు వాఁడు మనోనైర్మల్యసంపాదనకు నాచరింపవలయు; నివి కామ్యంబు లైన, విశిష్టఫలదంబులు; నిష్కామంబులు ముక్తిదంబు లగు, నట్టి యమ నియమంబులు వదలక భద్రాసనాదులందు నొకటి నవలంబించి ప్రాణాభిధానం బగు పవనంబు నభ్యాసవశంబున వశ్యంబు సేయవలయు; నదియె ప్రాణాయామ మనంబడు; నట్టి ప్రాణాయామంబు సబీజ నిర్బీజ సంజ్ఞలం బరఁగు; నదియె ప్రాణాపానంబుల మిథోనురోధంబుల నుభయ నిరోధనంబున రేచకాది త్రైవిధ్యంబునుం బొందు: మొదల నా చెప్పిన సబీజనిర్బీజ సంజ్ఞలందు నంతస్స్థూల రూపావలంబి యగునదియ సబీజం, బితరం బబీజంబు; మఱి శబ్దాదివిషయంబులం బ్రవణంబులగు నింద్రియంబులం ద్రిప్పి మానసంబున కధీనంబులు సేయుట ప్రత్యాహారం; బిట్టి ప్రత్యాహారంబు ముముక్షున కవశ్య కర్తవ్యంబు; దీనివలన నతిచంచలంబు లగు నింద్రియంబులకు నాత్మవశ్యత గలుగు; నివి గన వశ్యంబులు గాకుండిన నాయోగి యోగసాధకుండు గానేరండు; ప్రాణాయామంబునఁ బవనంబులు, ప్రత్యాహారంబున నింద్రియంబులు, వశంబులైన విమ్మటఁ జిత్తంబు శుభాశ్రయంబునం దిడునది." యనుటయు ఖాండిక్యుఁ డిట్లనియె. ౭౫

క. 'మనమున కెద్ది శుభాశ్రయ
మనఘ, యెఱింగింపు, మఱి సమస్తాధారం
బనఁ జను యద్వస్తువు? య
న్మనన మశేషోరుదుఃఖ మంతరిఁ జెఱుచున్?' ౭౬

తే. అనినఁ, గేశిధ్వజుఁడు వాని కనియె; ' బ్రహ్మ
మాశ్రయంబు మనంబున; కదియు పరము
నపరము ననంగఁ బొలుచు; నం దపర మనఁగ
మూర్తము, పరం బనంగ నమూర్త మనఘ. ౭౭

మ. మును నాచెప్పిన రెంటిలోఁ బర మనఁగ ముక్తాత్మ: దూరం బుపా
సనఁ గావింప సమూర్త; మింక పరసంజ్ఞం బబ్జరాగ్భృది బ
ద్ధవికాయం బది మూర్త మైనను బరిత్యాజ్యంబు శశ్వత్త్రిభా
వనలం గూడుట నారురుక్షున కసేవ్యం బీద్వయంబు న్దుదన్.

వ. అభావనాత్రయం బెద్ది యనినఁ జెప్పెద:- బ్రహ్మభావనయుం గర్మభావనయు
బ్రహ్మకర్మోభయభావనయు; నందు బ్రహ్మభావనాయుతులు సనందనాదులుం
దేవాది స్థావరాంతరులగు ప్రాణు లందఱు కర్మభావనాభావకులు, హిరణ్యగర్భాదు
లుభయభావనాపరు; లీమూఁడు తెఱంగులవారు భావనాత్రయాన్వితులు గావున
నీత్రివిధాత్మక రూపంబు సేవ్యంబు; సనందనాదులును బ్రాగ్బ్రహ్మకల్పంబుల
నంసరించుట భావనాబద్ధులె; యిబ్భావనాత్మకంబగు విశ్వంబు సంస్థితికి నవధి
దేవమనుష్యాది విశేషజ్ఞాన కర్మంబులు క్షీణించుటయ; యట్టి విశ్వంబై
తోఁచు హిరణ్యగర్భాదులకంటె నన్యంబు పరాఖ్యం; బది ముక్తరూపం
బమూర్తంబై యుండునని మొదల సూచించితిం గదా; తదాకారంబుఁ దేట
పఱిచెద; పూర్వోక్త దేవాది భేదరహితంబై తద్భేదరాహిత్యంబున నిట్టి దట్టి
దని వచించుటకు గోచరంబుగాక యపక్షయాది రహితంబును సచ్ఛబ్దవాచ్యం
బును నాత్మసంవేద్యంబునునై, జ్ఞానైకనిరూపణీయం బగుచు జ్ఞానశబ్ద
వాచ్యంబునుం దానయై, బ్రహ్మాత్మకం బగుట బ్రహ్మసంజ్ఞయుం గాంచి
యొప్పు: మఱి భావనాత్రయాత్మక విశ్వ వైలక్షణ్యంబె లక్షణంబుగాఁగల యీ
రూపం బభ్యస్యమాన యోగుండగు యోగికిం జింతింప నశక్యంబు; మఱి
యపరంబని చెప్పంబడిన హిరణ్యగర్భుండు వాసవుండు ప్రజాపతులు మరు
త్తులు వసువులు రుద్రులు ఆదిత్యులు తారకంబులు గ్రహంబులు గంధర్వ
యక్షరక్షో దైత్యాది సమస్త దేవయోనులు మనుష్యులు పశువులు అద్రులు
సముద్రంబులు ద్రుమంబులు వెండియు నేకపాద ద్విపాద బహుపా దాపాదంబు
లగు నితర భూతంబులుం దదుత్పత్తి హేతువులుగా విలసిల్లునట్టి ప్రధానాది
విశేషాంత చేతనా చేతనాత్మక ప్రపంచభావం బగు స్థూలరూపం బుపక్రాంత
యోగునకుఁ జింతింప శక్యంబు. శక్యమేనియుఁ దద్భావనాత్రయాత్మకం
బగుట నశుభాశ్రయంబుగావున ముక్తిసాధనంబు గా; దీ చెప్పంబడిన సకల

ప్రపంచంబును విష్ణుశక్తి సమన్వితంబై యతనికి శరీరంబునునై యుండు; నట్టి విష్ణుశక్తులు మొదల నేఁ జెప్పిన పరాపరాఖ్యలను దదతిరిక్తయగు కర్మాఖ్యయును ద్రివిధములై యుండు; నందుఁ గర్మాఖ్య శక్తిచేత వేష్టితయై యపరాఖ్య యగు క్షేత్రజ్ఞశక్తి జన్మజరామరణాద్యనేక సంసారతాపంబు లనుభవించుచుఁ దత్తత్కర్మానుగుణ శరీరంబు లెత్తి విజ్ఞాన తారతమ్యంబులఁ బొందుఁ; దత్ప్రకారం బాకర్ణింపుము.

సీ. ఉండు నప్రాణులం దొక్కించుక శక్తి ;
స్థావరశ్రేణిఁ దజ్జాతికంటె ;
నెట్టి రోఁకటిబండ జెట్టి మస్తింపి ము
న్నగు సరీసృపములం దంతకంటె ;
ఖగములయం దంతకంటె మృగావలి
యందు నూహింపంగ నంతకంటె ;
దంతి గోముఖ పశుతతి నంతకంటె, మ
ర్త్యప్రపంచములయం దంతకంటె,

తే. యక్ష గంధర్వ నాగాళి నంతకంటె,
నంతకంటె నిలింపులం, దంతకంటె
హరిహయునియందు, దక్షునం దంతకంటె,
నాద్యుఁడగు హిరణ్యగర్భునం దంతకంటె. ౮౦

ఆ. ఇట్టిరూపకోటు లెల్ల నవిష్ణుని
తనువయంబు సుమ్ము ధరణినాథ,
యతఁ డచింత్యశక్తి నఖిలభూతముల నా
కసమువోలె నిండి యునికిఁ గాన. ౮౧

సీ. ఇటు మున్నెన్నిన పరాఖ్యమునకు ద్వితీయమై
విష్ణుసంజ్ఞునకు సంకీర్తితేశ
యోగిహృద్ధ్యేయమై యొప్పు సమూర్తరూ
పం బొందు ; నత్సంజ్ఞఁ బ్రాజ్ఞకోటి

దాని వచించు; నేతద్రూపమె నమ స్త
శక్తుల కెల్ల నాశ్రయతఁ బొంది,
ప్రాగు క్త విశ్వరూపవిలక్షణతఁ గాంచి,
కల్యాణగుణ భూతి గరిమఁ దనరి,

తే. యుతిమహత్త్వంబుచే వెల్గు; నట్టిశక్తి
నలరు బ్రహ్మంబు దేవతిర్యఙ్మనుష్య
నామచేష్టావ దవతరణముల నాత్మ
లీల జగదుపకృతికిఁ గల్పించుచుండు. ౮౨

ఆ. కర్మభుక్తికొఱకుఁ గా దిట్టి తల్లీల;
యతఁడు సకలజాతులందుఁ బుట్టుఁ;
బుట్టినట్టి యతని భూరిచేష్టితము ల
వ్యాహతములు రావణాదివలన. ౮౩

వ. అట్టి పరమేశ్వరునకు బద్ధముక్తాది రూపంబు లనేకంబులు గలిగిన ముముక్షునకు జ్ఞానసిద్ధికిఁ బరమవ్యూహ విభవాది రూపంబులే చింతనీయంబులు; ప్రజ్వలిత శిఖుండగు పవనసఖుండు నీరస నికుంజంబు నెట్లు దహించు. నట్లు చిత్తస్థుం డగు నవ్విష్ణుండు యోగిజనంబుల సకల కిల్బిషంబులు నిర్దహించుఁ గావున సకల శక్త్యాశ్రయుం డైన యప్పరమాత్మునియందుఁ జిత్తంబు నిల్పుట విశుద్ధయగు ధారణ యనంబడు: నర్వసంగంబునఁ జలాత్మకం బగు చిత్తంబు నకుఁ ద్రిభావభావనాతీతుం డగు నద్దేవుండు శుభాశ్రయుండై ముక్తికరుండగు; నేతద్వ్యతిరిక్తులగు బ్రహ్మదిదేవతలు కర్మయోనులగుట నశుద్ధులు గావునఁ జిత్తంబున కవలంబనీయులుగారు; మఱి నిరవలంబధ్యానంబు పొందుపడదు గావున, ధారణాధ్యాన విషయంబై శుద్ధంబగు స్థూలరూపాంతరం బయ్యనం తునకుం గలదు, దాని సవిస్తరంబుగాఁ జెప్పెద నాకర్ణింపుము. ౮౪

సీ. శరదిందు చకచకస్మయజిత్ప్రసన్నాస్య,
దొడ్డకెందమ్మి కన్దోయివాని,
నతిక్రమ గల్లభాగాభోగ ఫాలాఢ్యు,
మకరాంక పత్నికర్ణికలవానిఁ

గాంబవోద్యచ్ఛ్రివిడంబి వృత్త శిరోధి,
సిరి పొల్పుమచ్చ పేరురమువాని,
నతనాభియుత వళిత్రితయ శాతోదరు,
జానులంబి చతుర్భుజములవాని,
తే. కరివరకరోరు, రుచిరజంఘామనోజ్ఞు,
సమత బొందిన పదపల్లవములవాని,
హైమవసనుఁ, గిరీటహారాంగదాది
కలితు, శంఖరథాంగాద్యలరువాని. ౯౬

సీ. శ్రీవిష్ణు నీగతిఁ జింతింప వలయుఁ ద
న్మయుఁ డయి యోగి క్రమంబుతోడ;
నొక్కయంగమె మున్ను చిక్క లోభావించి,
యది దృఢంబగుటయు నవలియంగ
కము మఱి చింతింపఁ గాఁదగు; నట్టి య
ధ్యానంబువలన నయ్యవయవి మఱి
నడచిన నున్న నానక యెద్దియేసియుఁ
జేయుచున్నను మదిఁ బాయఁడేని.
తే. యగనిసామ్యంబు గని ముక్తుఁ డగు; సురాది
భేదసంజనకాజ్ఞాన మేదఁ బిదప
నలము కల్యాణగుణముల హరికిఁ దనకుఁ
లేని భేద మెవ్వాఁడు కల్పింపఁగలఁడు? ౯౭

క. నరవర, యిటు బంధచ్యుతి
కరమగు నంగాష్టకాఖ్య ఘనయోగము వి
స్తరముగఁ జెప్పితి, నింకఁ
గరణీయం బెద్ది నాకుఁ గల్పింపు' మనన్. ౯౮
తే. 'నృప, కృతార్థుండ నైతి; నా కింతకంటె
వర్ణనీయంబు మఱి యెద్ది?' యనుచు నతని
కర్చఁ గావించి వల దన్న నతఁ డొసంగు
తనదు ఖాండిరాజ్యంబునఁ దనయు నిలిపి. ౯౯

వ. పురోహిత ప్రధానుల న్రప్రాప్తయౌవనుం డగు నతని వినీతుఁగా మెలఁపి కొం డని నియోగించి; వారల దానసమ్మానాదులం బ్రోవు మని కుమారు నకు నప్పగించి; గోవింద చరణారవింద విన్యస్తమానసుండై ఖాండిక్యుండు భయ కర్మంబు లుడిపి; యవ్వనంబు తపోవనంబుగాఁ గొంతకాలంబు కేశిధ్వజోపదిష్ట భక్తియోగానుసంధానంబున మధుమథన సాధర్మ్యంబు నొందెఁ. కేశిధ్వజుండును దత్పుత్రునిఁ దత్ప్రధానులఁ దదీయ రాజ్యపరిపాలన కనిచి, మగిడి మిథిలాపురంబు ప్రవేశించి, యోగాశ్రయుండై భోగంబులం బుణ్యం బులు, తదితరంబులు దుడిచంబులు, ప్రక్షీణంబులుగా క్షోణీతలం బేలుచుండెం; గావున ముముక్షున కుపాశ్రయణీయుం డధోక్షజుండు; పాండవక్షితీశా, నీ వతని భజియింపు,మిదియె భక్తియోగంబు. దీనియందు నొక్క కొలఁదిగలం దంతరాయంబు నొందినఁ బునర్భవంబుఁ బొందించి మఱి ముక్తిఁ జేర్చు. వట్లగుట నింతకంటె సులభోపాయం బాయోధనంబున నయ్యధోక్షజుండు గాండీవి కుపదేశించిన శరణాగతధర్మంబు నిరపాయధర్మం." బని పరిణతాంతః కరణుం డగు నతనికి మూఁడుమూర్తుల పూర్వకంబుగా ద్వయము ప్రసాదించి భాగవత ప్రధానుం గావించిన. ౮౯

మ. వకుళాలంకృతయోగిహృల్లిలయ, భాస్వత్పాండుభాస్వన్మయాం బక, నాభీజలజాతనూత విధి సంప్రాప్తస్మరారిష్ట, ము ష్టికతోరార్పణ కర్కటీఫలిత కేశి క్రూర రక్షోంగకా, కృతవామధ్వజ దీర్ఘికాప్లవ తప క్రీడోత్సవామ్యత్సుకా. ౯౦

క. ఊరీకృతపాండవరథ
సారథ్య. సయూథ్యగోపశాబకసహ కే
ళీరత, భక్తప్రష్ఠో
దారచితస్తోత్రపులకితాంచితగాత్రా. ౯౧

స్రగ్విణి. ఆస్థితాహీంద్ర శయ్యా, దవీయస్తర
ప్రస్థితాంఘ్రీ, శ్రిత వ్రాత చేతోముదా,
కన్థలప్రస్ఫురత్ కౌస్తుభ శ్యేన మూ
ర్ధస్థలీ నృత్త మత్తల్లి హల్లీసకా. ౯౨

మ. ఇది పాత్రప్రహరేశ్వరప్రభృతి బింహిష్ఠోత్కలానీక గు
ప్తదివిస్పృక్పటుయంత్రకొండవలి హృద్వాహాని కృద్రాజ దీ
వ్యదుదారోద్యమకృష్ణరాయనృప సంజ్ఞామ్నాతకృత్యాముక్తమా
ల్యద నాశ్వాసము హృద్యపద్యము తృతీయంబై మహిం బొల్పగున్. ౬౩

తృతీయాశ్వాసము సమాప్తము

—:o:—

శ్రీరస్తు

# ఆ ముక్త మా ల్య ద

## చ తు ర్థా శ్వా స ము.

శ్రీమందిరభుజమధ్యమ,
గోమండలకర్షి వేణుగుంభన, దృష్ట్యా
ద్యోమాహృతసురజనయి
శ్రీమణితాటంక, వృషగిరిస్థ, ఖగాంకా. ౧

వ. అవధరింపు మాసమయంబున. ౨

### విష్ణుచిత్తుని విజయము

మ. బలిమిం ద్రెంపఁగఁ బోలెఁ బాయవడుచుం బర్యాయభంగంబుగాఁ
గలనూ లెల్లను నంటు మోవఁ దెగి రాఁగాఁ, గొంత సే పుండి, తాఁ
బెలుచ న్గంటు వుటుక్కునందునివి వే పృథ్వీం బడె న్నాలె, మి
న్నుల మ్రోసె న్సురదుందుభు, ల్గురిసెఁ బెన్సోనై విరు లొప్పరునన్. ౩

శా. ఆవేళ న్నృపతి పారితోషికము లీ నందంద పంపన్, భ్రమ
త్సేవిప్రాతముచే ద్రుతస్ఖలిత యై దివ్యన్మణిస్వర్ణభూ
షావానశ్చ్యుట జానుదఘ్న యగుచు న్సంసచ్చతుశ్శాలికా
రై వేశ్మాంతరపద్ధతి న్నెరసె గోత్రాచిత్రమాల్యం బనన్. ౪

ఆ. వేదవేద్య మైన విష్ణుతత్త్వం బిట్లు
వాది గెలిచి, తెలిపి, వసుమతీశు
భక్తి నోలలార్చి, భగవత్ప్రపన్నుఁగాఁ
జేసి, లోకహితము సేయుటయును. ౫

శా. అద్ధా వా గ్విబుధం, బహోవచన కవ్యాహార, మాహోవచ
స్సిద్ధం, బాః కృతతాం గతఃకలి రితి శ్రీసూక్తివిద్యాధరం.

విద్వొద్ధత్య మగా ల్లయం హి కుధియా మిత్యున్నద త్కిన్నరం,
బద్ధీరాగ్రణి గెల్పుటుత్సవమునం దయ్యె న్నభం బంతయున్. ౬

సీ. సెంవులు నాకుచు వెలియఁగులు నూఁద
కరిగి పాదూవాపల నరయువారు;
తమ్మ్రమోం నుండునందలముఁ గానక దాఁటి
పేరెలుం గిడి బెస్సఁ జీరువారు;
నగరు వెల్వడుదాకఁ దెగి పోయి మఱి నిల్చి
తోడి విద్వాంసులఁ గూడువారు;
నెదురైన తమవాని గృహకృత్య మడిగి వాఁ
డనునవి తప్ప నూఁకొనెడివారు;
తే. 'వాద మేమాయె?' నన్న, 'భూవరునిపక్ష
పాత మాదాసరికిఁ గల్గి బ్రతికె,' ననెడు
వారు; 'నౌ లెం, డిటు విమర్శ దూరమైన
వాకిట వసించు నెవ్వఁ?' డన్వారు నగుచు. ౭

తే. కలిసి యొకకొంతసేపు శృంగాటకముల
నగరిదెసఁ జూచుచునె మంతనంబులాడి,
చనిరి విద్వాంసు లింద్ల, క్షనవిభుండు
రూఢి కతని మహాగజారూఢుఁ జేసి. ౮

మ. 'పురి యేఁగించి తదీయ మైననగరంబుం జేర్పుఁ' డంచు న్నృపుఁడున్
దొరలన్ రాజకుమారులన్ బనుపఁగాఁ, దూర్యస్వనంబు ల్నిరం
తరవందిస్తుతులుం, గజేంద్రహయఘంటా వారకాంతాంఘ్రినూ
పురము ల్మ్రోయఁగఁ, గొల్చి వా రిరుగడం బో మార్గమధ్యంబునన్. ౯

విష్ణుచిత్తునకు భగవంతుడు సాక్షాత్కరించుట

ఉ. ఇంగిలికంబునం దడిపి యెత్తు కసీనపు రెంటెమో యన
న్నింగి గరుత్పరంపరలనిగ్గున లేఁగాగ రెక్కెఁ; నంత పీ
చెం గలశాబ్ధిమీఁగడల జి డ్డెఱిఁగించెడు కమ్మగాడ్పు: నిం
డెం గడు మ్రోఁత: పెన్నిదురవడిం గని; రాజగరాజు మూఁపునన్. ౧౦

సీ. చివురుఁబొట్లవుదోయి జెంచమ్ము లనఁ దార్క్ష్య
హస్తోదరముల దివ్యాంఘ్రు లమర,
మునుఁగప్పుమేనఁ దోఁచిన తదూర్ధ్వచ్ఛాయ
లీనఁ దాల్చు పసిండిచేల మెఱయ,
ప్రాలిక యోగివర్గము నిర్మలాంతఃక
రణములువోలె హారములు దనర,
సిరికిఁ బుట్టింటినెచ్చెలు లౌట మనవికి
దాసె మకరకుండలము లమర,

తే. శ్రిత సిత చ్ఛద వాత్యాభిహత పరాగ
వలయమండిత కల్పశాఖలొ యనంగ
శంఖచక్రకాంచితోరుహస్తములు దనర,
దోఁచెఁ గమలేక్షణుండు చతుర్భుజుండు. ౧౧

క. ఎప్పుడు హరి గని రమరులు
ముప్పదియును మూఁడుకోట్లు మునిఁ గనుఁగొనునా
రప్పుడు తత్కరములతో
విప్పిన గొడుగులును మింట వేగమ మొగిడెఁ. ౧౨

తే. సమ్మద దిదృక్షుఖన్న రక్షః పిశాచ
పుంజ మహిభు క్పతత్రి ప్రభంజనములు
సోఁక వెఱఁ బాటెఁ కళ్ళాన శూర్పవాత
ఘట్టనలఁ బాఱు పెనుఁబొల్లకట్టు వోలె. ౧౩

క. పీరంధ్రకుసుమధారా
సారచర చ్చంచరీక సంకుల కల ఝం
కారానుకారి సంస్తవ
కారి మునిస్తోమ సామగానం బెనఁగెన్. ౧౪

తే. అట్లు ప్రత్యక్ష మైనపద్మాక్షు నంత
రిక్షమునఁ గాంచి, ముని ప్రమోదాశ్రుజలము
నిగుడఁ బులకించి, కరటిఘంటిక లె తాళ
ములుగ నిట్లని యమ్మహాత్ముని నుతించె. ౧౫

## విష్ణుచిత్తుఁడు శ్రీమహావిష్ణువును స్తుతించుట

### కవిరాజ విరాజితము

జయ జయ దానవదారణకారణ శార్ఙ్గరథాంగగదాసిధరా,
జయ జయ చంద్రదినేంద్రశతాయుత సాంద్రశరీరమహఃప్రసరా,
జయ జయ తామరసోదరసోదర చారుపదోజ్ఝితగాంగఝరా,
జయ జయ కేశవ కేశినిషూదన శౌరి శరజ్జలజాక్ష హరీ. ౧౬

## మత్స్యావతారము

మ. దనుజద్వేషి సుదారవారిచరమూర్తిం జెంది చాతుర్య మొ
ప్ప వడిం జొకపుఁదెల్లఁ గౌచుగమి దంభం బొంద మైఁ దాల్చి, వే
దవిశుద్ధాక్షర పంక్తిఁ గ్రమ్మఱఁగ వేషం జేర్చెదో నాఁగఁ, ద
ద్భువనం బబ్ధిసితాంబుబిందు పరమాం ద్రోద్యద్రుచి న్నాఁటమే ౧౭

చ. ఎలమి యుగాంతవారి కెమరెక్కుతఱిన్ వడిఁ దాలుగహ్వరం
బుసఁ జమనీచివెల్లి బడిఁ బోవు నపక్ష నగోరువాశ్చరం
బులు దనుఁ దాఁక, దద్గతత మోయు నజాండమ దైత్యు వేదపం
క్తులు గొనఁ కూల్చినట్టి జయదుందుభిఁ జేసితి తా మురాంతకా. ౧౮

చ. మిసి గడ్డవం దిమింగిలత మెయ్యెుయిఁ బెంచిన నీదు వాతఁ గు
ప్సత పలలాశియైన చెబుఁజేఁ పది ద్రెళ్లుప నీవు మ్రింగుటే?
శ్రుతు లపహారుపు ల్మ్రింగుటఁ జొమ్పతటి న్నవదేహవైధనై
హిత జవశక్తి నీడ్చికొని తెచ్చుటకాక తదల్పతాల్పతన్? ౧౯

## కూర్మమూర్తి

మ. జలపూరప్లవమానసృణ్మయమహీసంరక్షకై గార యీ
బలెఁ ముక్తామణిశుక్తిశంఖనికురంబం బెల్లఁ జూర్ణంబుగా
బలభిద్వజ్రసవృజ్జిన్నజోపరిపతద్భామ్యన్మహామందరా
చలసంఘృష్టిఘరట్టమైన కమఠస్వామి న్నినుం గొల్చెదన్. ౨౦

## వరాహమూర్తి

చ. ఒకమఱి బుద్బుగించ విలయోదకము ల్పాయి కుబ్బి, చిప్ప వ్ర
చ్చుకొని, మహాబ్ధిపీఠఁ జన, సూకరత న్మొయి వెంచి, వెండి క్రిం

దిశిఁ గయిఁ బ్రావాలు తత్సలిలనిర్మలధార నదఃపరస్ఫుర
త్ప్రకృతికి నీ యజాండమునె బంగరు ముంగఱఁగా నొనర్పవే ?. ౨౦

## నృసింహమూర్తి

మ. అసురేంద్రాశయకుంభికాభ్రపుఘోరవ్యాఘ్రస్వకచ్ఛాయఁ గాం
చి సముద్యత్ప్రతిసింహమత్సరమిళచ్చేష్టన్ దదుద్ధామదీ
ర్ఘ సటాఘూర్ణముఁ బెల్లగించు గతి నాంత్రశ్రేణిఁ గిన్కన్ వెరం
బు నితక్రూర భవన్నఖావళులు ప్రోచు న్మర్త్యపంచాననా. ౨౧

ఉ. మునుము న్దైత్యుని, దూఱమూఱ నుఱి కెంపు, న్వెండియుం దూఱఁ గం
దనగాయుం గలనల్పుఁ, డోఁవ నఖకోణ శ్రేణిచే విక్రమం
బున వాఁడు గతఁ గొన్నయట్టి విపన్మూర్తితయీతేజముం
గొను లీల న్వివశింపవే యసురవక్షోభిత్తి విభ్యాహరీ ? ౨౨

## వామనమూర్తి

మ. బలివైతేయ భయాంధకారభరిత బ్రహ్మాండ గేహంబులో
వఁ బై మండెడితత్ప్రతాపమయదీపజ్వాల దింద, న్గడుం
దలమై మింటికి ఁగ్రక్కున న్నగయు నుద్యత్తన్మహాచ్ఛాయ నాఁ
గల నీలాంగము శింశుమార మొదయుంగాఁ బెంపవే వామనా ?

## పరశురామావతారము

మ. శమిత క్షత్త్రకశత్రనేత్రజలవర్షావేశ నీకీర్తిహం
సము క్రౌంచస్ఫుటతావకాంబకనుషింఁ జాగంగ వీక్షించి, వ
ర్షము రా నంచలు నంద నేఁడుఁ జను నిచ్చ న్నాటి భచ్చేష్టి వా
యమిఁ; దిర్యక్తతి దా గతానుగతికం బౌఁగా కురారీ హరీ. ౨౪

## శ్రీరామావతారము

మ. పవిధారాపతనంబుఁ గైకొనని యప్పొలస్త్యమై సప్తధా
తువులం దూఱు పరిశ్రమంబునకు నుద్యోగించె నా; సప్త సా
లవిభేదం బొనరించి నిల్వక సలీలన్ జన్న యుష్మన్మరు
జ్జవనాస్త్రం బొసఁగు స్సిరుల్ రఘుకులస్వామీ రమావల్లభా. ౨౫

సీ. స్యందనస్థితబిడౌజఃక్షత్త్రజాత్యక్ష
ఝ్ఝంఝామరుద్ధత జ్ఝాత్కృతములు,
క్రవ్యాశివాగ్ధాత్రకనదసృగ్గాహన
స్ఫుటశల్యహవ్యభుక్పూత్కృతములు,
యోధవర్మితహృత్ప్రదోత్క్రాంతనిజపాత
సాలాశ్మకృతమహాష్ఠాత్కృతములు.
వటితోగ్రరక్షఃకబంధధారకనృత్తి
భుగ్నభోగఫణీంద్రదపూత్కృతములు,
తే. క్రాంతరథ్యనిరంతరచ్ఛాయదములు,
దివ్యతావకకార్ముకోత్ప్రేరితములు,
కలుషము లడంచుఁగాత లంకాపురాంగ
ణాంబరచలత్కలంబకదంబకములు. ౨౮

## బలరామావతారము

చ. 'క్షితి హలకృష్టిఁ బుట్టి యవఁగేల క్షితియందునె సీత' యంచుఁ ద
త్ప్రతి విరహార్తిఁ బాండిమముఁ దాలిచి రామశరీరమెత్తి, యా
క్షితిభునవక్రియ న్మగుడఁ జెందఁగఁ గాక, కళిందజాతటీ
క్షితి దువ నేటికి న్హలము చేఁగొని నీ కవశాత్మత న్హలీ ;

## కృష్ణావతారము

ఉ. ఆయతయుష్మదాకృతి కరాగ్రనగాంచలవాంత వారిధా
రాయుతచంద్రకాంతఫలకావళిబింబిత యై చెలంగ, నా
రాయణమూర్తిమత్కవచరత్నముచేఁ బరిరక్షఁ గాంచె నా
నోయదువీర, వృష్టిఁ బసి నూఱఁ ద్రోవవె సప్తరాత్రముల్. ౨౯

## బౌద్ధావతారము

మ. తరుణత్వోత్సుతబాణపంచకమునన్ దైత్యాబలాశ్రేణి త
ద్వరసందోహము యుష్మదాత్మకజడద్బ్రహ్మం బొకంట న్జెడఁగా,
ద్వరఁ గావించితి వేటికో? యహహ, బుద్ధం బయ్యె నీభావ, మ
త్తరుణీశీలతనుత్ర మేరికి నసాధ్యం బౌటఁ గా కేశవా! ౩౦

కల్యాణ వర్ణనము

శా. ఘోరాపార మహాప్రపంచకము జక్కన్ లేపయం గా నేర్పు నా
ధారాపంచకధామసం జెలగు గంధర్వంబు ద్రొక్కించు బ
ల్పీరంపుస్నెలరౌతు గీకుకరా శీవారవాణీభవ
ద్ఘోరుద్భ్రింతకృపాణికాద్వితయ విద్యుద్గ్రంథి నిన్ గొల్చెదన్. ౩౧

చ. అని పలుకంగ హరి సుధాశనపద్ధతిఁ జూచి 'పాండ్యుఁ డి
చ్చినధన మిమ్మునీశ్వరుఁ డశేషము భాగవతాస్మదీయగే
హనివహ సాత్కరించి, యతిటో కరు రిక్తత నొందు: నేతదీ
యసలయ మవ్వరి న్మణిమయంబును సార్థము జేయు' నావుడున్. ౩౨

తే. విశ్వకర్మయు నట్ల కావించె; నంత
నంబుజాక్షుఁడు వమ్ముని నాదరించి,
యీక్షణాగోచరుం డయ్యె; ఋషియు నేఁగి
పౌరులు భజింపఁగానె పుత్తూరి కరిగె. ౩౩

విష్ణుచిత్తుని స్వపురప్రవేశము

క. స్థానికులు దనమ్మఁ దివ్య
జ్ఞానందితు లగుచుఁ బురము గై సేసి. ప్రజ
లోనడువ నాగవాసము
తో నెదురుగ నేఁగి; రంత తూర్యము లులియన్. ౩౪

వ. ఇ ట్లెదుర్కొని పట్టవప్రిత భగవత్ప్రసాదతీర్థంబు లుపాయనంబులుగాఁ బ్రణామంబు లాచరించి లేచి, ప్రాంజలులై, ధర్మపరికర్మవర్మితం బగు బ్రహ్మ రథంబున నబ్జాగవశపతంసంబు నునుచుకొని పోవుసమయంబునఁ, బర స్పరనమేతంబు లగు పౌరజానపదజనంబులు గలసి మెలసి నడచునెడ: మృదంగం బుపాంగం బావజంబు దండె తాళం బురుమ కిన్నెర సన్నగాళె వీణె ముఖవీణె వాస్నెగోలు డోలు మౌరి భేరి గౌరు గుమ్మెట తమ్మెటంబు డుక్క దక్క చక్కి చయ్యంకి లోనగు ననంఖ్యాతవాదిత్రత్రితయవరం పరలు మొరయ; నెడనెడఁ బన్నులుకలు మలఁపుగొనఁ బట్టవాగతగజ ఘట్టఘోట్టణఘోటక ఘంటాకరంబఘుర్ఘుర ఘోషంబుల కసుప్రానంబులై, విలా వినీ మంజు మంజీరంబు లెలుఁగియ్య నల్లనల్లన బాఁగతలిఁ; గెంకులఁ

గపఠితకథాకర్ణనంబులం గరపరికరీకృతకంధరంబులగు గృహశుకంబులు కేలం బూని సేవించి పోవు సామంతభూకాంతకుమారభట్టారకులం బిట్టు గాంచి, యొండొరులం గడవ సంభ్రమించుచు, మ్రొక్కి నిక్కి చేయెత్తి యొత్తిలి నేత్రంబు లుత్తానతరళతారకంబులుగా మగిడి మగిడి పొగడుచుం బోవు లతాంగులు; దద్రాజకదంబకం బచ్చటిపదంతుకలకం దమకుం బురికిం జనదెంచునప్పు డెల్ల నెదకాం ద్రపుట మేలమాడంబోలు నాప్రాశిమేళంపుం గళావతుల వైచువంబునం గ్రామగ్రామగ్రామణు లొసంగు నారంగ మాతులుంగ జంబీర కుంద కందుకాదులం బూర్వానుభుక్త లగునక్తంకరముఖుల పైవ: ధళధళ త్తరళతాటంకంబును నంకురితవిస్మయంబునుగా, నాతన్ముఖప్రేంఖోళితస్మిత సాకూతవిభ్రమాకేకరాపాంగ విలోకనంబును నాచలితధమ్మిల్లంబునుంగా, మొగంబులు తివిచికొని సమ్మర్దంబునం జనుమార్దంగికుల మూంపుల మఱుం గులం డాంగి, యన్నాగవాసంబులు నాగరిక విలోకనంబునం జెలరేంగి, మొగం బులు ఓరగించికొని, వేదు రెత్తినగతి నరిదియెత్తం బ్రతిపదంబును మర్దల ముఖాపమర్దనకుం గ్రంగి పయి, బయటం బడి చేయునది లేక యాకదకు మగిడి తుఱుము దిద్దుచుం దద్వారణాభినయపత్పరాగినకరాబ్జలై సుడివడునెడం బొడము కర్ణికసుమ పతనసాపేక్షురశీకించిచ్చలనోపలక్ష్య వైలక్ష్యహాస కుందంబులు సాంద్రతరచంద్రికాకందంబులం దీటుకొలుపం: జాటూక్తివాచాజ లంజరకవనితలు తమకు మ్రొక్కం దాము మ్రొక్క కొక్కించుక యోర మోమిడి, వారియిరుపక్కియల నొదిగి తొంటియేంటుం దలంచి తలవాంచిన, వంచనం గటాక్షించి యెక్కనక్కెంబునకుం దమచేత మ్రొక్కించుకొనువేక్క నక్కడం బుడమితేడు లేమి సామాన్యమానవులం గైకొనక, సుమాళంబు వేద్యంబుగా విద్యావయోవృద్ధుల రగమీరు మ్రొక్కంగా దారు మ్రొక్కమి యెట్లు మ్రొక్కింపుం దనుటయు; గ్రక్కనం బొడము మొలకవగవుల మోముం దమ్ములకు వే తొక్కవింత తెలివి యెక్క, మ్రొక్క కక్కడం గెడంగూడి నడచు తోడి చేడియల కద్దొరలకుం దమకుం దగ్గయుం బొందు గల దను పెద్ద తికం బెఱుకపఱుపం గెమ్మోవులు మలంచి తోలోన నొయ్యనొయ్యన నుచు క్కవ నక్కిలెటింగి దక్కొ సౌమ్మని తమ్ము నమ్ముదునల్లు ముందటికి నూకి 'యక్కక్క, మ్రొక్కవే మనపాలివేలు' వని బుజ్జగించియు బొమలుగొని జంకించియు నెట్టకేలకు నొడంబఱిచినం; ద్రపాతరళనయనలై విరళవిరళాంగు

కాంచీ బంధంబుగా మ్రొక్కి, కక్కసెన కట్ట మ్రొక్కంగ, హెచ్చి, యచ్చ యాట్యట వేడవడకయుండంగా జిగురుగందెలవోలె నల్లకొని గొల్లన నగు నల్లోలాంగనలం గల్లకోపంబునం గొట్టి కనరుచూపు నా రాజనంఘంబుమీంద నిగుడ, మగండ మఱుపడు. కామిరెహరిణలోచనల చలితకంకణనంకులక్రేంకారంబు లాలనామోదమేదురాళిఝుంకారంబుల డింకంబు లడంప; తెవులనంకులు లోవంక భుజంబులు కొంకినిగలు గావిదుప్పటులు నొప్పు. నెమ్మి దెప్పరంబై మువ్వున నవ్వురంబుం జేరి, రసికజనబాంధవంబున బంధువియోగంబుమఱచి. గంధకలనాకుసుమగ్రగ్రథనాదుబ్జనాంధ్యంబు లేకలను నంధ్రదేశీయు లగు గంధకారులు పాటిపాటి వద్యంవుమ్రొక్కులతో వెట్టివెట్టి కైవారంబులు గౌరితత్తరులపై వచ్చు రాచవారిపై నాఁడువారిపై నాటివారిపైఁ జల్లగాఁ జల్లఁ,బెల్లెగసి సృష్టియెల్లను ముష్టికరించుచు.నన్నష్టభేదయగువరిమళసమష్టిం బెట్టు విష్ఠాతకంబు నబోమంశలికిం జండాతకంబై చంపకోరకిరణంబుల మాటు పఱుపఁ, బన్నీరు నించిన తన్నీరుతిత్తులొత్త; వియత్తలంబునం బాటి కై వ్రాలు ధావల వాన్యంబును దడిసిన విద్యోపజీవుల పుష్కరంబుల గ్రావ నగ్గిరోయుచుండ: నమ్మొత్త మత్తతి స్మృత్తంబుఁ జూచ నిలిచి మెత్తమెత్తన నడచుచుండు మింశతంగంబునుం దారు నప్పుండు పుండరికాస్య లవకాశంబు గాంచి కాశకుసుమప్రతిఫలనపాండురంబులై పద్యాతి హృద్యపార్శ్వద్వయోద్యాన పాదవంబులకుంబాఱు చెంగలువకాలువలకుం డిగ్గి కానరీదధిమంథ మానరంబులుగాఁ బినికి యాఁటంబెట్టిన నారంగశృంగబేరభంగంబులతోఁ గట్టిన కలమాన్నంబుఁజలిది పోకపొత్తులం గుడువఁ గూర్చుండ వీక్షించి; కుక్షింభరిత్వంబున క్షుత్క్షాములై తిరిగితిరిగి వేసరి యోసరిలిన దాసరిగుంపు వారి పాల గోపాలభిక్ష భిక్షించి భక్షింపఁ దీరక్షోణుల నిలిపినతోరంపు డివెదారికోలల రంధ్రగోళంబుల మల్కిలంబులై మంపు భగభగని జగజ్జ్యోతిదీపజాలంబుల మధ్య ధూపకుండికాంగారంబుల పీటాలఁ గ్రాఁచి, నాదుఁ బఠింప వాయించు ధిమిధిమిధ్వానంబులకుం బెదరి యావలియువపనశుకంబు లావలికావలి యుపవన శుకంబు లివలికి దట్టంబుగాఁ గట్టినితోరణంబులై పఱపఁ, దలలు పిసరుటయు నోరు తెఱచుటయుం గేలు సఱచుటయుఁ దక్క మిక్కుటంబగు నక్కోలాహలంబున నేపాడియుం బాట వినరాక మూకగట్టిన భాగవతజాతంబు లేతేర; మాఱూరినంతనంతకుం దిశగఁ బెద్ద లింటింటనంతరించిన పిలుపువాటుగోట

గల జానపదంబులకుం బట్టి కట్టి పిదప నెత్తంబున మెత్తని గతిక మేని పోనరించి మాపుమాపున మేపసజ్జకవణంపు మేపునం బిడుక గొలువంబు తోమ కంబునం బుటపుటనై కలియకంబడి ప్రాకం గనియైన పిఠం గనియైనం బెదరు కొదమ తట్టువగంపు కాలికొలందికి బ్రేలు లాలుకుంచెలు గీలించి నగవ్యదంటల గంటల నలంకరించి, మెలుగ మడ్డిం దోంచి మూర కొక్కెండును జేనకొక్కెండు నుగాం గట్టినదొల్లు టుల్లారు బల్లసిల్లంబల్లించిన పల్లంబుల పైం జిల్లలైలం బును వాసనకొడుపులం బూనినమణుంగు ఇంద్రదిక దేలలె రవణంబులుగా నెదురుగా వేడుకం జూతవచ్చిన యుప్పిటి మేడిసాలె యగసాలె పటుసాలె వానెవె జాలి సాంతు లేతులకొమరులు తుములమై వచ్చు తుచ్ఛమూసాముణం బులం జూచి. యేచినవెఱం దమయెక్కిరింత లెక్కికొని వాగె లిరుగేలం గుదియంబట్టిన నిలువ కయ్యుత్సవం బీక్షింపవచ్చినవ్రజులం ద్రొక్కుచుం బోవం; దన్మత్యవృద్ధవధ్వాతురాదులు దిట్ట నిట్టట్టనలేక ప్రాణంబులు విడి కిటం బట్టుకొని పోవుచు. నవీననవిధకేదారంబులం ద్రెళ్ళి చట్టలు ధిగంబడి వెతలలేకుంతం దారు దిగ విమ్ము లేక పిమ్మటంగొని సలుదెనలం జూతం, జూచి కేలు నలచి కోహో యని గేలిసేయు గణికాకదంబంబుల చప్పటులు సిలిత నిమ్ముటవిటపిఘూటంబులం బ్రతిశబ్దంబులు పుట్టింప; లిట్లనూనవిభవంబు దిగు రొత్త నత్తిరువతి సొచ్చి యచ్చక్రధరునగరిమోనల నిలుచుటయు, నవ్విష్ణు చిత్తుండు దద్రథావతరణంబు చేసి, ధరణీధవస్థానికసమూహంబు వెంటరా నవ్వేంకటు సేవించి, తత్ప్రసాదలబ్ధం బగు పరివట్టంబున నలంకృతుండై, నానాలంకారసహితంబును రత్నకాంచనమయంబులు నగు నాత్మీయభవనంబుం గాంచి విస్మితుండై పుండరీకాక్షమహిమాభిలబ్ధవైభవంబుగాం దెలిసి తత్రత్య ధాత్రీశశత్రవర్గంబుల నరివి ప్రవేశించి, తొంటికంటె శతగుణంబుగా భాగవత పూజాప్రవణుండై యుండె నంత. ౩౧

మ. ఉలుపా ల్పట్టినయింత్ల మజ్జన నృపాహ్లాదారభు క్తిక్రియో
జ్జ్వలులై, రే హరికొల్వునన్ వివిధలాస్యస్పర్ధి సుభ్రూభ్రుకుం
సులవాదు ల్పరిదేర్చి పుచ్చి, మణివాసోభూషణగ్రామమున్
జలజాక్షునకున్ సమర్పణము నిష్ఠం జేసి, యుప్వేకువన్. ౩౨

తే. ప్రభువు లరిగిరి క్రమ్మఱం బాండ్యనగరి,
కమ్మునియు నట్ల వైష్ణవాభ్యర్చనంబు

దన చిరంతన తులసికాదామకరణ
దాస్యమును జేసికొనుచుఁ దత్పరత నందె. ౩౭

వ. ఒక్కనాడు మధ్యాహ్నసమయ మాలికా సమర్పణానంతరంబున మందిరంబునకుఁ బోవునతనిఁ బ్రసాదమందస్మిత సుందరవదనం బగుకటాక్షంబున వీక్షించి పక్షిపుంగవకేతనుండు పుండరీకనికేతన కిట్లనియె. ౩౮

## యామునాచార్య చరిత్రము

తే. 'యామునాచార్యుఁ డొక్కఁడు నీమహాత్ముఁ
డొక్కఁడును గాడె దర్శనం బుద్ధరించి
రస్మదీయకృపాతిశయమున,' ననిన
నిందిరాదేవి తన భర్త లట్టు లనియె. ౩౯

క. 'ఇతనికథ యెఱిఁగినదె కా,
యతఁడేమి యొనర్చె?' ననిన నబ్జాక్షుం డా
శతపత్త్రనిలయ కిట్లను,
'నతివ. కలం డొకఁడు మత్పదాశ్రితుఁ డాదిన్. ౪౦

ఆ. అతఁడు చిఱుతనాఁడె యాచార్యకులమున
వేదశాస్త్రముఖ్యవిద్య లభ్య
సించు చుండ. నపుడు చెలువ. యిప్పటి పాండ్య
నృపతి పూర్వవంశ్యుఁడే యొకండు. ౪౧

తే. వెల్లిశైవంబు ముదిరి మద్వినుతి వినఁడు,
నతి యొనర్పఁడు మామక ప్రతిమలకును.
హరుఁడె పరతత్త్వ మను, మదీయాలయముల
నుత్సవంబుల కులుకు, నెయ్యురును నష్టి. ౪౨

సీ. ఆక్రాంత జంగమార్చాసక్తి వర్తిలు
వేదవిద్ద్విజపూజ పిటిఁ గలిపి;
భౌమవారవు వీరభద్ర పళ్ళెర మిడు
గృహదైవతంబు లిట్టింకు లింక:
షణ్ణవతిశ్రాద్ధచయ మారఁ బెట్టు సం
కరదాస మయ్యె భక్తప్రతతికి;

నాద్యంబు లైన దేవాలయంబులు బ్రాల
నవని నిగాళ మ.రాశి నిలుపు;

తే. జందె ముత్తరశైవంబు( ద్రెంచి త్రెంచు;
బలితు లారాధ్య దేవళ్ళ బ్రావ్య ఫసుచు
నుపనిషత్తులు వారిచే నుబ్బి వినుచు,
వెండి యే జంగ మెత్తిన వెర(గుపడును. ౪౩

క. శివలింగము( దాల్చిన జన
నివహం బేమైన( జేయనిది పాపము దా
నవు( గా దన(; దా సమయము
నవు నను విప్రులకి యగ్రహారము లిచ్చున్. ౪౪

తే. అత(డు రాజ్యంబు( బాలించు నవసరమున(
దనవశం బైనయట్టియత్రాసుపర్తి(
గలుగు నలవుట్టరాని ముక్తామణీపు
లంబు మాహేశ్వరుల కంధలకును లీలె. ౪౫

తే. అవ్వు డిచ్చకులగను బ్రాహ్మణులు కొంద
ఱాత్మజనిభూమి విడువరే కలికభూతి
గడ్డముల నాస రుదురాక రిద్దసంది
నూతసంహిత లిటికించి చదు( దొడ(గిరి. ౪౬

క. శీలము( బట్టియు గంజా
హాల లుపాంశుగ భుజింపుసవముల బైటం
బాలు(డు వైవన్, విప్ర
స్థాలిత్యము బైలుసేసి కపులెఱవు సభన్. ౪౭

క. ఆరాజుసుహిష యేని ప
దారాధనపర సుంత: సప్తుంచి మదు
ర్వాదివ్యథ గాదు గారుడ
పారిష, విభు( డన్మదల్పమీఘక్తు(డు గావిన్. ౪౮

వ. మఱియు నప్పురంధ్రీరత్నంబు. ౪౯

సీ. విలంగదం బైనట్టి ముంగిట నెలకొన్న
బృందావనికి ముగ్గు వెట్టఁ దాన:
దశమినాఁ డేకభుక్తము నేసి, యవలినాఁ
డోర్చి జాగరముతో నుండు నిట్లు;
బారసి పోపీదు, పైనిద్రఁ బాఱుట
క్కాలుపాడు మత్పుణ్యకథలఁ ద్రోయు:
నేమంపుమూనాళ్ళు కామింప దధినాథు:
మఱునాఁడు కన్నుసు మనసుఁ దనియ
తే. నాకజవువన్నెఁ బ్రియుసెజ్జ కరుగుఁ గూర్మి;
నరుగుచో నాడిఁ దుడిచి కప్పురపు నాడిఁ
బెట్టు; నిట్టుల మద్భక్తి వృద్ధియును ని
జేశునెడ భక్తి చెదదు మదిష్ట మగుట. ౫౦

క. వనజజ రుద్రాదులు మ
త్తనువులె; తత్పూజనంబు తథ్యము మత్పూ
జనమె; తదీప్సిత ఫల దా
తను నేనె; యటైనఁ గలవు తరతమ వృత్తుల్. ౫౧

క. కేవలశరీరదృష్టిన
దేవతల న్వేఱ కలుగఁ దెలిసినజడులన్
నా వాసుదేవతాస్థితి
భావింపని పూజ సాంతఫలమై త్రిప్పున్. ౫౨

వ. మఱియు నీరహస్యంబుఁ దెలియ కబ్జాపతి తామసుండై. మామకీనంబులగు జనంబుల సామాన్యబుద్ధిం జూచుచుఁ దద్వృత్తుల కగుపద్రవంబుల నుపేక్షించుచు, రక్షావిముఖుండై యుండ వీక్షించి; కలియుగంబున ద్రవిడ మంతలంబున గృతమాలా తామ్రపర్ణీతటంబుల మద్భక్తులు తఱచగుటను, దద్దేశంబున కొనయం దతంతగుటను, రక్షణశిక్షణంబులు రాజముఖంబునం గాక నేన సాక్షాత్కరించి చేయమియుఁ, దద్రక్షణేచ్ఛ యస్మదాభిముఖ్యంబునం గాక పొడమమియు, నాయాభిముఖ్యంబు సంవాదంబునం గాని పుట్టమియు, నే విచారించి; తదాభిముఖ్య కరణార్థంబుగ నాస్థానం బెక్కి వాదిజయంబు

సేయఁదలఁచియు నన్నతలం పవ్విప్రకుమారునకుం బుట్టింప; నతం డేఁగి నానాదేశాగతదీనానాథవృద్ధభూసురకుటుంబంబులకు ధాన్యాజినపటాదులు, వటువులకుం బెండ్లిండ్లు, కనవనీతుల కవనయనంబులకుఁ, బంగ్వంధబధిరాదులకు సౌరభేయాదియానంబులు; మఱియుఁ జెఱువు గడమవడియె ననియుఁ, దేవగృహంబులకుఁ బూజ నడువ దనియు, నెడవునం జలివందిరి విడియెద మనియుఁ, దిథి చిక్కె ననియుఁ, దీర్థయాత్రఁ జనియెద మనియును, వ్రతోద్యాపన కనియును, వ్యాధి మన్పఁగో ననియున, జెప్పి పంప, వారాణసీసంబు గప్రాగువ్రప్రకారంబులం బంపుద్రవ్యంబుఁ దెచ్చి యిచ్చు ముదుసళ్ళగుపర్షధరులచేతులకుం గ్రందుకొని చేసాఁచిన సందిటితోరణంబులై తోఁచు నేకదండి త్రిదండి బ్రహ్మచారుల యున్నమితదండంబుల నిండారు కాషాయకద్రుపవస్త్ర కౌపీన పరంపరలం గ్రమ్మి, కావళ్ళవడగలజాడఁగొని, కార్పణ్యంబ విద్యగాఁ దక్కినవిద్య లెఱుంగక వేఁడు నీదృగ్విధానేకప్రాణుల కాధారంబగు పతమఠద్వారంబుఁ జేరి. ప్రతిదినాస్మత్పాదకజన కథాశ్రుతపూర్వ యగు నాయుర్వీధవుదేవి కాశీర్వచనాక్షతంబులు దౌవారికముఖంబునం బంపి: 'వైదేశికుండ వైష్ణవవటుండ, వాది గలిగిన విష్ణుతత్త్వంబె పరతత్త్వం బని వాదించి గెలిచెద, వసుధావరుండు పష్టభక్తి విముఖుండు, గావున వైష్ణవునిమనవి విన్నవింప నెవ్వారు వెఱతురు: నీవుభక్తిపరాయణవు, పతిహితాచారవుం గావున నీకు విన్నవించి పంపితి: నీవిభుండు నీకు విధేయుండు, విన్నవించి నన్ను రప్పించి వాదంబు సేయింప నోపుదేని వాదించి గెల్చి, నీదుభర్తకు భగవద్భక్తి బుట్టించి కృతార్థుం గావించెద' నని విన్నవింపం బంచిన. ౫౩

తే. గ్రీష్మసమయనిరుత్సాహకేకిరమణి
నవఘనధ్వని కలరుచందమున నలరి,
యేకతమ వర్మగోష్ఠిఁ బ్రాణేశుతోడ
నతని, విధ మెఱిఁగింప, నిట్టట్టు పడుచు. ౫౪

క. భూవల్లభుఁ 'డెట్టెట్టూ!
తా వాదము సేసి శివమతంబు జయింపం
గా వచ్చెనొ? చూతముగా,
రావింపుఁ మటన్న నాఁటిరాత్రి చనంగా ౫౫

వ. ప్రభాతంబునం బరిమితజనం బగు నాస్థానంబునం గొలువున్న భర్త ప్రోలం
దా నుండి యయ్యుం మనదన యతనియనుమతిం బ్రతిహారిచేతఁ బిలువంబంచిన,
నబ్బానిలింపకుమారుండు. ౫౬

- యామునాచార్యుఁడు పాండ్యసభం జేరుట

క. ద్వారంబు సొచ్చి, కీలిత
గారుడమహి వజ్రవేదికం జివురులఁ గెం
పారు నొక విప్పలముఁ గని,
యా రావి న్వాదసాక్షికై వలగొనుచుఁ. ౫౭

సీ. వనిడిఁగ చ్చమర సోపానముల్ మూఁటఁ దుం
గిత విశాలితయుఁ జిత్రితయు నైన
నథ మహాకుథముపై శార్దూలచర్మఖం
డావృతుల్ జటిలులు నైన జరఠ
మాహేశ్వరులు చుట్టురా, హారనంధి రు
ద్రాక్షాయుతముఁ దాల్చి యశికభూతి
నురటిగాడ్పుల రాల, నరుణాయతాక్షుఁడై
కుఱుగద్దె బిల్లఁ బ్రకోష్ఠ మునిచి,
నంది ముద్రితపాణియందుఁ జెక్కుఁ గ్రుఁది యా
గమములు విసుచు, హేమము పొదివిన

తే. యంఁతి రుద్రాక్షగమి కుట్టుబంను మెఱయ,
వెలితపారంబు మించ దువ్వలువ గప్పి,
యడపమును వాఁడివా లొక్క యతివ దాల్ప.
భావ్య వింజామ రిడ, నొప్పుపాండ్యుఁ గనియె. ౫౮

వ. కని వినీతుండై చేర నరిగి యజ్ఞోపవీతంబు గాను కిచ్చి కూర్చున్న నాదరిం
పక నంరంభియై య వ్విశ్వంభరాభర్త యిట్లనియె. ౫౯

తే. 'నంగతియె యోయి, యినుమంత లింగ బావు,
తత్త్వనిర్ణయవాదంబు దరమె నీకు !
నోఁడతేనియుఁ బట్టి, మొట్టో యనంగ
లింగమును గట్ట కుడుగ, మెఱింగి నొదువు. ౬౦

తే. వాదుల మఱంచుఁ జెప్పించి వత్తు; రోఁట
మైన దయ నీరె యేమైన నని విలజ్జ
జూటుఁదనమున నతఁ డెక్కు చౌరవకాండ్రుఁ;
బాఱువారలసుద్ది సెప్పంగ నేల ? ౬౧

వ. అని పలికి దరహాసంబుతో దేవిదెసఁ జూచి యి ట్లనియె. ౬౨

క. 'అన్నన్నతఁడు తోడిన
భస్మము రుద్రాక్షములును బాసి యితనిచే
విస్మయముగ సాత్త్వము మొర
ఘస్మరచక్రాంకితుఁడుఁ గాఁ గలవాఁడే. ౬౩

తే. ఉపిద, యీసిద్ధవిద్వాంసుఁ డోఁడెనేని
నీకు నితని కే నన్నపూనికయ' యన్న,
'నొప్పితిమి దేవ రానతి దప్పకున్నఁ
జాలు మఱి పంచభూతము ల్సాక్షిగాఁగ. ౬౪

వ. అని పలుకు నయ్యిరువుర ప్రతిజ్ఞ లాకర్ణించి. ౬౫

తే. అతఁడు మృగకృత్తి పెళపెళ యనఁగ, బనుపు
గోచి కట్టిన మోదుగుఁగోల నెగయఁ,
బ్రాంజలి వినీతుఁడై విన్నపం బఱంచు
నర్థము కాననత నిట్టు లనియె ధృతిని. ౬౬

క. 'దేవా, యిట్లని యానతి
యీ వల, దేఁ గుక్షిపుఁగూటి కిట రా, నాఁడం
బేవారిఁ బ్రోవ ? భిక్షా
జీవిక వర్ణికిని విధి సృజించెనె గాదే ? ౬౭

తే. ఎవ్వఁడే సర్వభూతస్థుఁ డీత్రెఱంగు
నకును బ్రేరేఁచె, నతనియానతియె తెచ్చె,
నెఱిఁగినవి నాల్గు నోడువ నేమఱున లెన్న:
యతఁడ బొంకిన నేమి సేయంగ వచ్చు ? ౬౮

తే. పంతమైనను గానిమ్ము పార్థివేంద్ర,
యుక్తులను నిగ్రహస్థాన మొదవెనేని,

యమ్మ దెచ్చినవిద్వాంసుఁ దనఁగ వలదు,
దెట్లు గావింప వలయు నట్లట్ల చేయు. ౧౯

వ. అని యులుకు విడిచి పలికి, మగుడం గూర్చుండి, యతని యనుమతి వాదం
బునకుం దొడంగి. ౨౦

## అన్యమత ఖండనము

సీ. అందులో నొక మేటి కవిముఖుండై యాతఁ
డవిన వన్నియును మ న్ననువదించి;
తొడఁగి యన్నిటి కన్నిదూషణంబులు వేగ
వడక తత్పథ యొకఁడడఁగఁ బల్కి;
వక్రమాటల నెన్న కొక్కొకమాటనె
నిగ్రహస్థాన మనుగ్రహించి;
కందుగా రేగినఁ గలఁగ కందఱఁ దీర్చి
నిలివి; యమ్మొదలివానికినె మగిడి;

తే. మఱి ప్రతిజ్ఞాప్రతిసూత్రసమాజమునకు
నైకకంఠ్యంబు గల్పించి, యాత్మమతము
జగమెఱుంగఁగ రాద్ధాంతముగ నొనర్చి;
విజితుఁ గావించి దయ వాని విడిచిపెట్టి. ౨౧

క. 'నీ వేమంటివి రమ్మం'
చావలివానికిని మగిడి యట్లనె వానిం
గావించి, యొకఁడొకఁడు రా
నావిప్రుఁడు వాదసరణి నందఱఁ గెలిచెన్. ౨౨

వ. ఇట్లు జయించి విష్ణుదేవుండె పరతత్త్వం బనియు విశిష్టాద్వైతంబ మతంబు
నగుటయుం బ్రతిష్ఠించిన. ౨౩

క. ఆయెతను నొక్కపలు కెదు
రై యుండెడు విప్రులమున నాయెను విన, 'నో
హో, యిది నిక్కము, సృప, నా
రాయణుఁడె పరంబు కొల్వుమతని' నటంచున్. ౨౪

వ. అప్పలుకులు విని ఖిన్నుండై యక్కూడిసపాషండషండంబు దలవంచుకొని పోయిన, నాయుర్వీధవుండు నతని మాహాత్మ్యంబునకు సంతోషించి సాష్టాంగ మెఱఁగి, హర్షామృతరసోత్తరంగితాంతరంగుండై, భుజగశయన చరణకుశేశయభక్తి వొదమి కృతార్థతం బొంది, పాండ్యమండలమునకు భాగినేయుండ పట్టార్హుండు గావునఁ బాత్రంబని బ్రహ్మచారి యగునతనికిఁ దన కడగొట్టు చెలియలిం బరిణయంబు సేసి, యకారంబుగ నమ్మహాత్మునకు ధారాపూర్వకంబుగా నర్ధరాజ్యం బిచ్చి, యువరాజుం జేసి, యధీతసాంగవేదుండగునతనిపై సమస్తశస్త్రభృత్సత్తం బని యెంచి, యందు దివ్యాస్త్రమంత్రంబుల కలిమియుం దెలిసి, యమ్మహాత్మున కెచ్చరించి దుస్సాధం బగువిరోధియూథంబు సాధింపు మని దండయాత్రం బనిచిన, నయ్యామముండును నన్నద్ధుండగుచుఁ దత్పురోహిత ప్రధానమంత్రివర్గంబు నన్నిహితంబులగు నిర్వ్యాక్షిక సైన్యంబులు గదలి శరత్సమయంబున విశ్వేషత్సంహారంబునకు విజయంబు సేయు మనుపయు, నత్తెఱంగు రాజున కెఱింగించి తత్సమ్మతంబున నిలిచె నంత. ౨౮

## వర్షాకాల వర్ణనము

ఉ. కర్కశుఁ డంచు కోర్వ, కుదకంబులు వాఃపతి గూర్చినట్లు న
య్యర్కుఁడుఁ దాఁ గూర్చె. మఱి యాసలిలాధిపచిహ్న వాహతం
బేర్కొల గంగ నాతఁ డెలమి న్మకరస్థితిఁ గన్నసీర్ష్య, దాఁ
గర్కటకస్థుఁ డయ్యె నన, గర్కటకస్థితిఁ గాంచె నత్తఱిన్. ౨౯

తే. వనతతి వరాహ వాహా రి వాయుభుగ్వి
రోధి వారణ వర్షాభు లాఢిఁ దొఱఁగె
నెండ్రి రవి చేర; మూఁడవ యెడకుఁ జెరు
దరణి ధరణిం బ్రమోదసంధాయి గాదె? ౩౦

తే. వనధిగమనజగర్భార్కజనిత మృణులు
మఱి ప్రసూతికి నతసిధామంబుఁ జేరె;
ఘనతఁ జొచ్చినయిండ్లను దనుజ లుండ
కాన్పునకుఁ బుట్టిని ల్చేరుక్రమము గనమె? ౩౧

తే. ఉర్విఁ గాదంబినుల యలయుమ్మనీరు
దొరుఁగఁ గేకులు కేకలు తోన సేసె,
ద్విజవరారణ్యకధ్వని వినఁగఁ జేసి
గప్పలు సుఖమ్యుతము సేయఁ గడఁగె ననఁగ. ౭౯

మ. అపర్ణన్యుఁడు బాపఁ దన్కాలిమిలో న్నభంపుఁ బెన్గొప్పెరన్
జలపూఁగన్ బిసుగుక్కజాత్యపుఁబయస్కాంతంపు నత్తుక్కలో
పలఁ జూప, న్మహిమీఁదిలోహరజముల్ పైఁ బర్వె నా, లేచె వా
త్యలఁ బ్రాగ్భావమపు ల్మోగి ల్మొదల గ్రద్దంతై దివిన్ లేచినన్. ౮౦

తే. ఇలకు డిగె, చుట్టిముట్టి దుమ్మెత్తి, యెగసి,
పోయి, తమము ముంచుసుడిగాలిపుష్కరములఁ
గదలినీరభ్రకలభము ల్గాసె, ధరణి
నభ్రకరిశిక్ష దివిఁ గాంచినట్టి కరణి. ౮౦

తే. కృతపయఃపానవమేఘపృథుకములకు
రాలె నొయ్యన వడగండ్లపాలపండ్లు;
మఱి బలాకాద్విజాళిసంప్రాప్తి గలిగెఁ,
బెరుఁగఁ బెరుఁగంగ ధ్వనియు గంభీర మయ్యె. ౮౨

మ. తనతోయం బిరంమ్మ లెత్త, నిల వాత్యారేణుమూర్తి న్మహేం
ద్రునకుం జెప్పఁగ, మ్రుచ్చుఁ బట్టి దివమందు న్విఘ్నటింపం, భయం
బునఁ జంద్రశ్మిసహస్రము న్వెస డిగెం బో డాఁగి వేగ్రుమ్మరిం
ప, ననం ధారలు దోఁచె మించు వెలిఁగింప న్మబ్బుల న్వెల్లిపై. ౮౩

చ. తొలితొలి వచ్చుధారల నెదుర్కొని, తచ్చటఁ దీఁగచుట్టుగా
నలముచు. ధాత్రి లేచి, పొలుపారె మలీమసబాష్పవల్లు; ల
త్రొలితొలిధారకే వెలసి; తోన ఘనౌఘము వానకాళ్ళకుం
బలరివుఁ దాలయాభ్రముల భంగినె సంకెల లూన్చెనో యనన్. ౮౪

చ. ఎడపక మున్ను మింటిపయి నేతగులంబును లేక మూకతన్
వెడలెడుచోఁ గఠోరఘనబృందము లుద్ధము వద్ద, వానిమే
యిడియ జవోష్మఁ బొటెడు రవీందులవట్టుపుబండికండ్ల చ
ప్పుడుగతి, మ్రోసె రేవగలు భూరిభయంకరగర్జలత్తఱిన్. ౮౫

చ. దినములఁ బంబటం జడనిధి స్రుక్కను గ్రోలిననీరిలోనఁ జే
రినలవణంపుఘట్టముల దృవ్యదిరమ్మదదావము ల్దవు
ల్కొని వెటిలింపనార్పుటకు లోకో, యన నౌ సతటిద్భయంకర
స్తనితములన్ సృజించె నతిసాంద్రఘనాఘనగర్భగోళముల్. ౧౬

మ. ఇనుఁ డొక్కట్ల భృశ వార్ధిఁ జేరి జల మొక్కుం తాన, నాత్మోష్మఁ జు
య్యని పెంటం బొగ ముంచికో నెగసి, వాతాధూతతత్సాంధులం
గన నౌచుం బెళచట్రుళ్ళై వడకురేళ్ళం దిక్తటప్రోత్థిత
స్తనయిత్నుచ్ఛటఁ జంచల ల్మెఱసె నాసారంబు దోరంబుగన్. ౧౭

మ. ఇల పెం గ్గిల్నజీవనంబుల నిజానిష్టోగ్రమార్తండమం
డల మానం, దయ వైరివైరి సఖుఁ డౌటం ద్రవిం బీల్చి, య
య్యాల కొల్లమ్ముడిఁ బుమ్మరింపఁ దగుఁ దా నెంతైన, నంతైన మం
డలముల్ రాపాళ పౌసంగిఁ దాల్పగతి మింటం బర్వెఁ గాలాభ్రముల్, ౧౮

క. పుట్ట పదలి నభోభిత్తిఁ బట్టు శక్ర
కార్ముకపుఁ బెద్ద పలువన్నెకట్లజెట్టి
పైన నుచెచెకి కళ్ళగం పనఁగ గాలి
గారొక్కని దిగంతముల వానకాళ్లు నడచె. ౧౯

చ. ఒకపరి యాడు న్సస్య య ను సుర్వికి డిగ్గఁగ నీవు మూఁగి చా
తకములు, ఒంచుఁ లోఁ గనలి దట్టముగా నలమేఘుఁ డాడు చుం
డక చన నూఁదఁగాఁ దొరఁగె నాళపుటుండలు వోలె రాలెఁ ద
క్కక పడు వర్షధారల ముఖస్థము లై కరకానికాయముల్. ౨౦

సీ. ఎలగోలుజల్లు ము న్వెళపెళ నేటవా
ల్వడి గాలి నట్టింట్లఁ దడిపి చనఁగ;
నట్టి తో పడగంట్ల కట్టావులు దుమార
మావుల రేఁచి రెండవదియుఁ జన;
మఱి మూఁడపది నిల్చి మెఱసి బిట్టుఱిమి శీ
కరవారి సృష్టిఁ జీకటిగ నలమ;
నుయ్యెలచేరుల యోజఁ బై పై వెంది
జల్లునై జల్లు పెల్లల్లుకొనఁగ;

తే. గగనరంగస్థలంబున మిగులఁ బ్రౌఢి
మమునఁ గాళిక నీలికోలము నటింపఁ,
బొరి మొగంబున రాలునిప్పుక లనంగ
గుంపులై తాలె మహి నింద్రగోపకములు. ౯౮

క. ద్యుమణికరాళి మొగిళ్లయి
యమవస శశి గలయఁ గూర్చి హద నౌటయు, న
య్యమృతపుబిందులె క్రమ్మఱ
నుమిసెడు ననఁ గలయఁ గడక లుడుగక రాలెన్. ౯౯

చ. స్ఫురణ మొగిళ్ళపై మొదలఁ బొల్చుఁ జలస్రుతి నాఁడునాఁటికిం
గరఁగుచుఁ బుట్టుచుండుమణికార్ముకరక్తిమ యెల్ల వెల్లిఁ గె
న్నురుపులు గట్టినట్టులు గనుంగొన నొప్పెఁ దదింద్రగోపముల్
గరఁగినవిండ్లయ ప్పనుసకైవడిఁ దెట్టువగట్టుపచ్చికన్. ౧౦౦

చ. పెళపెళ మబ్బు విట్టుఱుము, భీతి విదూరశిలాంకురచ్ఛటో
త్పులకిని యై ప్రియు న్నదురవో వుహతి న్వడిఁ గౌఁగిలింపఁగాఁ,
దలచి ధరిత్రి సాఁచుగఱుదాలువుఁగేళ్ళనఁ గంకణంపుమ్రోఁ
తలఁ బులు దేల వండు పయిఁ దాల్చి నదు ల్వెసఁ జొచ్చె వారిధిన్. ౧౦౧

తే. కేకిషడ్జంబె దక్కఁ గోకిలపుఁబంచ
మం బఱుపఁ, దోయిపదరులు మఱి పొసఁగమి,
నదియుఁ బ్రియుఁ గూర్ప నదులచో నమ్మత మయ్యెఁ
ప్రోషితల చేరువకు నంపుదోదివోలె. ౧౦౨

తే. తతతనువు రాహు సోమామృతంబు మ్రింగఁ
జక్రి దునిమినమెడఁ గంటిచాయఁ బొలిచె,
ననిన మేఘస్థమణిధను వాసువర్మ
నం బనఁగ నింగిఁ బ్రతిసూర్యబింబ మలరె. ౧౦౩

చ. స్వరుఖరతాబ్రసాహరిపుజాలమదాచిరరుక్శిఖప్రభా
కరకబకాచ్ఛవాస్రుతులకై లవణేక్షుసురాజ్యదధ్యుదా
కరములు దుగ్ధశుద్ధజలకంధులు నాఁ గలయట్టి నప్తసా
గరములు మేఘుఁ డానెనొకొ కా యనఁగాఁ గనుపట్టె వీచిచేన్. ౧౦౪

మ. తనిమం బచ్చ మెఱుంగుగ్రోఁచియు మణీధన్యోజ్జ్వలాషాఢసుం
గొని. పుట్టం గొడు గబ్బ నెమ్మి పురియాకుల్వ్యాప్తి శబ్దంబు మిం
చ, నతస్ఫారరజోబలిత్వమున నచ్ఛస్ఫూర్తి మించ దన్ని వే
ఘననీలాంగుఁడు గాంచెఁ బాదపశిఖౌఘంబుల్ మరుత్స్పృష్టముల్ ౧౦౫

క. ఘనవృష్టికతన ఫణు లే
పున నలవల్మీకరంధ్రములు మూయఁగ నె
త్తినగొడుగు లనఁగ ఛత్త్రి
కవికాయం బవని నెల్లకడలం బొడమెన్. ౧౦౬

ఉ. సారెకు మింట మేఘుఁడు నిజస్ఫురణం బఱఁ గ్రూరమౌ పురో
గారకయోగ మూఁది తిరుగ, స్వకుటుంబముఁ దద్గ్రహంబు నెం
తే రుష ద్రొబ్బ నంతలును నింతలునై పడు తన్నభశ్చ్యుతాం
గారశిఖప్రతానములనై పడి రాలె సురేంద్రగోపముల్. ౧౦౭

క. కాకోదరాహితుల వ
ల్మీకంబులఁ దూర్చె మెఱని మేఘుం, డని గం
పై కనగొని పొగడె నన
భేకధ్వను లెసఁగె ప్రవృత్త భేదానుకృతిన్. ౧౦౮

తే. మొగిలు మైచీకటుల నెక్కు జిగిమెఱుఁగులఁ
బగలు రాతిరి రాతిరి పగలు చేసె;
సకలమును నిద్రపుచ్చు కేశవుని నిద్ర
పుచ్చుఘనునకు నిట్టి దద్భుతమె తలఁప ? ౧౦౯

తే. ధూళి యడఁగిన మఱి మింటఁ దోఁచె శంప,
జలధరద్రోణి మన్ను పర్జన్యుఁ డెత్తి
ఖనది ఖశ్రీవిభూషేచ్ఛఁ గడుగ మెఱయు
మృదుమహీగతవసురజోరేఖ యనఁగ. ౧౧౦

తే. స్థూలపరిపక్వకాననోదుంబరాగ్ర
రంధ్రముల పాననీరు సొరంగ వెడలె
మశకపంక్తులు దావధూమంబు లనఁగ
రచ్చ సేయంగ వెడలె విశ్రాంతి కనఁగ. ౧౧౧

స్రగ్ధర. గ్రావాలం గేతకీకోరకకుటజరజోరాజి దూర్వాంకురశ్రీ
తో వీక్షింపన్ దినాస్మృతుటి ఘటుపడుచుం దోఁచు, చిట్లా ఠిరో
వావిర్భావంబులం బాయక పొరయ నభస్యాభ్రము ల్గప్పి, పై నెం
తే విపైప్ పింఛికల్ బర్హిణులు దిరుగఁ, బెల్లింద్రజాలంబుఁ జూపెన్. ౧౧౨

తే. గిరులఁ దటజంబుతెరువులఁ దొరఁగ పండ్లఁ
బుట్టె జంబూనదులు; గానఁ బొదవు మొగిలు
మేన నవి సోఁకునెడలు గామితఁ దటిచ్ఛ
లంబునను శుద్ధజాంబూనదంబు లయ్యె. ౧౧౩

తే. సురభిబడిఁ జన్న సప్తలాశోకకమల
కువలయామ్రమాళికిఁ గదంబ కుటజ నీప
కకుభయూథిక లను సాయకములు మరున
కెను గల్గి గేదఁగిసురె యెక్కు డయ్యె. ౧౧౪

క. నటనపర కేకిపాత్ర
స్ఫుటయవనిక లన మొగిళ్లు పొదవెఁ భూభృ
త్తటుల, నవి యాకు దిను చిట
పొటరవము సెలంగెఁ దాళముల చప్పుడు నాఁ. ౧౧౫

చ. జలధర ముప్పుతోఁ బులు పొసంగు రసం బని యప్పయోధి నిం
పొలయఁగఁ గ్రోలి, పై దధిపయోధియుఁ గ్రోలఁగఁ, బ్రాఁచి దాటఁ బె
ప్పులుసుఁ గరుళ్లు గ్రాయ, నవివో వడగండ్లన రాలెఁ, గానిచో
నిలఁ బడ వానిఁ దిన్న యపుడే చలిపండ్లు వడఁగ నేటికిన్? ౧౧౬

తే. అపు డనల్లకు డిగక మేఘాళి పొదువు
నచలముల పైనె దొడ్డిక ట్టగమృగాళి
జాడ చూపట్టె మీఁదిపర్జన్యధన్వి
నృపున కగుతెరి వేఁటయాయిత మనఁగ. ౧౧౭

చ. తడి తల డిగ్గి ముంప, జడతం దుదరెప్పలఁ గన్ను వీడి, పు
ల్పొడుచుచు నీరు ముంగలంపోలిక ముక్కులఁ గూడ, నోరఁ గొం
తొడియరు గూఁటికట్టు నగ మొత్తుచు తెక్కవిదుర్చు మున్నుగా
పడఁకుచె గాక చేష్ట డిగె వక్షము పక్షులు జానువుల్ చొరన్. ౧౧౮

క. చెందు నెఱసంజ కుంకుమ
క్రందమునఁ గెంపెక్కు దివికిఁ గాశ్మీరత రా,
నిందుశిలాత్వము రవి గని
యెం; దోయముఁ గురియ నేల యిటు గాకున్నన్? ౧౧౯

చ. అలజలరాశినీటఁ బగ లర్కకరావళి చూలు దాల్పఁగా,
గలమిన యార్ష్య రాత్రి ధవళాంశుకరాళులు తాము దాల్పఁ, ద
జ్జలములు నాన మూఁగికొను చాడ్పున నాఁడి వహించెఁ జాలు మ
బ్బుల నిల ముంచునీలఘనపుంజమవల్ల బలాకమాలికల్. ౧౨౦

క. ఉఱుము విని యలకకై దివి
వెఱఁ బఱచు మరాళపటలి విడిచినఁ బడున
క్కఱచిన బిసలవవిసరము
తెఱఁగున వడగండ్లు ధవళదీధితి రాలెన్. ౧౨౧

క. తటిదుత్సారితఫణభృ
త్పటలి నిరన్నంబు లయ్యెఁ దక్కువు బర్హుల్
నటన; మతిహర్ష హేతూ ౧౨౨
త్కటలాభం బిదునె మది క్షుధ స్మిర్వట్టున్?

సీ. రవిఁ జూచి కుకుచువారలకును గృకలాస
ములకును దృష్టి మిన్నులనె నిలిచె:
సంధ్యార్ఘ్యదాయిద్విజశ్రేణి కిలు సేరు
మొదివులకును భ్రాంతి మదిఁ జనించె:
హలజీవినందోహములకు బలాకికా
విసరంబులకు మంచి వెగలు దొరకె:
నెలమిఁ బొల్పగుపయోధికలకు నంతలకూట
ములకును మఱి విచ్చుమొగ్గ లొదవె;
తే. నతిథిసంఘంబునకు నీనినట్టియెనువ
కదుపులేఁగలగుమికి వాకట్టు లెసఁగె;
మట్టిమిద్దెలవారికి మరువనులకు
నెలఁతఁ బాసినవారికి నిదర చెడియె. ౧౨౩

ఉ. కాలునిదున్న నంది నయి గంటలు దున్నక మంటి నా. మహా
కాలునినంది దున్న నయి కర్దమమగ్నత లేక మంటి నా,
హాలికు లెన్నఁడుం దెగనియౌరులచేలును జౌకుమళ్ళనుం
గా లలి నేరు సాఁగి రిలఁ గల్గుషవిం గొని పేద మున్నగన్. ౧౨౪

క. వరఁజుబడి రొంపిఁ ద్రొక్కం,
జరణంబులఁ జుట్టి పసిఁడి చాయకడుపులం
బి రి సీరుకట్టె లమరెను,
బిరుదులు హాలికులు దున్నఁ బెట్టిరొ యనఁగన్. ౧౨౫

క. నాని శిఖి వంటచెఱకుల
చే నఱ. నవి వెండి వంటచెఱకులె యంటం
బోనంబు ప్రజకు జక్కుల
బోనంబులె యయ్యెఁ బ్రొయ్యి పొగయమి వృష్టిన్. ౧౨౬

సీ. ఇల్లిల్లు దిరుగ నొక్కిం తబ్బు శిఖి: యబ్బె
నే నింటిలోఁ బూరి యిడి వినరక
రాఁజదు: రాఁజిన రవులుకో ల్వాసాలఁ
గాని కల్గదు: మఱి దానఁ గలిగె
నేని కూడగుట మం: దైన బెన్పొగ సుఖ
భుక్తిసేకూర: దాభుక్తి కిడినఁ
బ్రాగ్భోక్తలకె తీఱు బహుజనాన్నము: దీఱ
నారులం కొదవుఁ బునఃప్రయత్న:

తే. మాజ్యవటముఖ్యలయ మెన్న: రాలయాంగ
దారులయ మెన్న రంతిక: కారజనిక
వచన నాంధోగృహిణి రామిఁ బడుక మరుఁడు
వెడవెడనె యార్ప నొగిలి రజ్జడిని గృహపులు. ౧౨౭

చ. పిడుగుల కల్కి లోఁ దొలఁచి భీరులు కంచముఁ, జల్లుదీఢలు
ల్గడవల వెళ్ళిరాఁ బొగలకావిరి బ్రుంగిన పుల్గృహంబు లె
ల్లెడఁ గనుపట్టె నీళ్ళ నిలయెల్లను ముంచి రసాతలంబుపై
విడియఁగ దండు డిగ్గినసవిద్యుదురు స్తనయిత్నులో యనన్. ౧౨౮

ఉ. గొడుగుల గాలిఁ గూల్చి, మఱి కోలలతోడనె పాఱు, నాన్చెఁ [illegible]
త్వర జడి మేఘుఁ డట్లకట పాంథులపైఁ దన కెంతవైరమో!
తడిసిన మేన నింకి యది దారవియోగజవహ్నిఁ గొంత కొం
తుడిసె, విధాతరక్ష విష మొక్కొకమా టమృతంబు సేయఁగన్. ౧౨౯

తే. దవులఁ జల్లని తూఱ నంతక మునుపటి
జల్లునీ రూని వచ్చునా జల్లు, మొదలి
గాలి యెంగోలుచేఁ గొమ్మ గదలి జల్లు
దలపడక మున్న వంగుళ్ళఁ దడిపెఁ దరులు. ౧౩౦

చ. రయమున వృష్టికై యొదిఁగి రచ్చలపై. విధియింతు రుగ్రతన్
హయపతిమీఁద దంతిపతి నాతనిపై నృపతిం గజాదిని
ద్వయముల మొత్తులాడుదురు, బ్రమ బ్వొక యింతయు విప్ప విచ్చు మొ
గ్గయి మఱి పొనిపోదురు సమస్తదిశాంతులైన యర్వగుల్. ౧౩౧

క. తనరె బలిభుక్తతులు నిం
డిన గ్రామ్యశ్రీం గటితనీలము లగుటన్
గనియెఁ దృణగ్రాహిత ననఁ
గొనుకసవులఁ జైత్యతరుల గూండ్లి భ్రమణన్. ౧౩౨

మ. వనతుల్వెల్వడి, వానకై గుడిసె మోవన్ రాక తా నాని యే
వసగా నిల్చినజమ్ముగూడఁ బొల మంబ ల్లోచుచుం బట్టి పె
న్ముసురు స్నిఁగెడు కాఁపుగుబ్బెతల పెన్గుబ్బ ల్పునాన ల్వెలిం
బిసికిల్లుం బిసికిల్లు హాలికుల కర్పించె న్నభస్యంబునన్. ౧౩౩

మ. గురుగుం జెంచలిఁ దుమ్మి లేఁదగిరిసాకుం దింత్రిణీపల్లవో
త్కరముం గూడఁ బొరంటి నూనియలతోఁ, గట్టావికుట్టారుగో
గిరము ల్మెక్కి, తమిం బసుల్పొలము వోఁ గ్రేఁపు ల్మెయి న్నాక, మే
కెరువుం గుంపటి మంచ మెక్కిరి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్. ౧౩౪

సీ. మణియష్టిఁ గేలిబర్హిణపద్మనుత పీను
లోలాడఁ బ్రొద్దెక్కె మేలుకాంచి,
గమగమవత్సుమగంధరాజాంగమ
ర్దనపైఁ జిరోష్ణమజ్జనము లాడి,

మినిమిదువ్వలువ బన్ననరంబు మొగలిఱే
కులు దాల్చి జాణమెక్కి కొలువు వోనంగి,
జాంగలామిషముతో శాల్యన్న మధికహై
యంగవీనంబుగా నారగించి.

తే. మృగమదము మించు తములంపుటెరులు మోవి
దళముగా సాగరుహసంతి వెలుఁగ, సౌధ
శిఖరవాతాయనాగతాచిరరుగంశు
నతదృగవరోధములతోడ నగిరి నృపులు.

వ. ఇట్లు సాంద్రజలదధారాసారమానరంబు లగు వార్షికవాసరంబులు ప్రశాంతంబగుటయుఁ; దదనంతరంబ. ౧౩౬

## శరదృతు వర్ణన

ఉ. రాజమరాళలబ్ధగిరిరంధ్రము, శాలివనీశరావలీ
వైజననంబు, యజ్వహుతవాజహుతాశము, భాస్వదిందిరా
భోజనమాగమం, బుటితబోధకుడ్మలకశయోపచారనీ
రాజనపుల్లహల్లకసరం, బుదయించె శరద్దినం బిలన్. ౧౩౭

క. కరము పొగ రెక్కె నంబర,
మురువిద్యుద్దీపకళిక లుమిసిన ధూమ
స్ఫురణం బొగచూరె ననఁగా
హరిమణిజంబూఫలాసితామలరుచులన్. ౧౩౮

ఆ. సాంధ్యరాగలహరి సామిరంజితము లై
తిరిగె మింట సిదుర తెలిపినట్టి
యిందిరాధిపటికి నెత్తు కర్పూరనీ
రాజనంబు లన శరద్ఘనములు. ౧౩౯

మ. అళిగరుదంచలామల తదంతరబింబిత మయ్యెఁ బాకని
ర్దళితమహాఫలౌఘహరితచ్ఛదకోటికావనాలి నాఁ,
గలమవనభ్రమచ్చుకనికాయము లోపల సాంధ్యరక్తిమం
బలఁతిగఁ దాల్చి మింటఁ గన నయ్యె విపాండుపయోదఖండముల్. ౧౪౦

క. ఘనగణవిహారణఁ జివికిన
మణిధనువువఁ దొరఁగు నుసి సమానము లై ద
ర్పణనిభనభమునఁ బరిణత
శణకణహరిణములు పాండుజలదము లొలసెన్. ౧౪౧

క. రవిశశిముకురములు శర
ద్యువతి మెఱుఁగుఁబెట్టుభూతియో యనఁ బర్వెన్
బవనాహతసప్తచ్ఛద
నివహపరాగంబు వివికి నిర్మలకాంతిన్. ౧౪౨

స్రగ్ధర. సంభూతజ్ఞప్తిహాతాశనశయనము విశ్వంభరుం దూఁడి నేవం,
గంభీరవ్రక్రియామగ్నత దిగు జగతిం గ్రందుగాఁ దోఁచువర్షా
దంభోళిస్థూలరంధ్రోద్గతసితపృథుపాతాళజాతాంబుధారా
స్తంభంబు ల్పోలె నెన్న ల్గపశరుచి శరత్సంభవం బిం బనించెన్. ౧౪౩

తే. నీరజేక్షణుఁ డవ్వేళ నిద్ర దెలిసి
యడుగుఁ దనపీఁట మోపనో యవనిరమణి
కంటకితగాత్రి యయ్యె నాఁగా విపాక
పరుషకంటకాలిమంజరులు వొలిచె. ౧౪౪

మ. స్ఫుటభూయోహృతిశంక వార్ధి నినరశ్మి ల్మిన్ను చేర్పం, దటి
చ్ఛ్ఫుట లౌర్వంబుగఁ గారుకొంచు, ఘనమై, క్ష్మాఁ దీఱ వర్షింప, న
చ్చోటనుం దోఁచి గ్రసింపఁ బోలుఁ గలశీసూనుండు! గాకున్న నా
క్కోటఁ దావాగ్రహభాస్కరేందుమణిశుక్తుల్ వ్యక్తమై తోఁచునే? ౧౪౫

చ. అలమలయాద్రి కుంభభవుఁ డన్కతకింబు శరత్తు కుండమం
డలి బ్రతిబింబ కైతవమునం దమ కిచ్చిన. వారిదేవత
ల్తొలఁకులకేలఁ దావ నిడి తోమఁ గుంచ కడఁగెం, దదీయత
త్పలతకు బ్రహ్మమౌ చె కరి, తారక లంబువుఁ దేర్చునే యనన్ ౧౪౬

చ. ఇలకు సుధాసమత్వము రహింప శరజ్జలజాక్షి కుందమం
డలి సలిలంబుఁ గల్మష ముడంగ మొగిల్చిరియొండఁ గాఁచుచోఁ
జిలుకు నిశారజఃపటలి చెన్ను వహించెఁ దొరంగపం కిపై
వళ దరవింద కైరవ కదంబ కధార వరాగపూగముల్. ౧౪౭

ఉ. పెల్చినమైత్రిఁ బద్మినుల కెల్ల ఘనాత్యయకారుకుండు సొ
మ్మచ్చువడంగఁ జేయఁ దకనై యలఁ ద్రెంచనగంబు పేరిక
మ్మచ్చున నీడ్చు శర్వగిరియందలి వెండిశలాకవిందు నా
వచ్చి మరాళమాలికలు వ్రాలెఁ గొలంకులఁ జక్రచంకృతిన్. ౧౪౮

తే. కుంభజుఁడు శార్ధితోఁ గ్రోలి కుక్షి నున్న
మించుముక్తాచ్ఛటలె క్రుమ్మరించె ననఁగ
జలజదళములఁ దేటలుఁ జవులు నయిన
యంబుకణములు వొలిచెఁ బద్మాకరముల. ౧౪౯

చ. కెరలు స్రవంతిఁ బై యిసుక క్రిందగువేళ నినుండు మేఘవుం
దెర సనఁ జల్లఁగా, విరహదీప్తకరంప్లుత మౌ సజీరకో
త్కరగత మట్ల పద్మినులఁ గ్రమ్మఁ సకేసరమాధ్వి పొల్చెఁ, బైఁ
గర మరుదారెఁ దేఁట్లు సెకఁ గందినముత్తెవుసేసలో యనన్. ౧౫౦

చ. జలజదళస్థతోయములు సందులఁ గ్రందుగఁ దోఁచుమింటినీ
డలుఁ గనుపట్టె నత్తఱిఁ దటాకముల న్లఘిమంబు రెంటిలోఁ
దెలియఁ దరంగ బై కెగయు తేఁటులఁచేరులఁ దూన్పఁ దోయము
ల్పలుచనఁ దేలెః మిన్నడుగు బట్టెఁ గడుం దళమౌటనో యనన్. ౧౫౧

మ. ఇలకు న్వ్రేఁగఁగఁ బండి తీరవనపుండ్రేక్షుచ్ఛట ల్దీవు ల
గ్గలమై వ్రాల, నురుస్వనంబు లెసఁగంగాఁ ద్రిప్పు రాట్నంపు గుం
డ్రలు నాఁ దేనెకొలంకులం బొరలి పాఱ స్వచ్ఛ పంకేరుహం
బుల నాడెం దొలునంజఁ దేఁటివలయంబు ల్తారఝుంకారముల్. ౧౫౨

సీ. హాలనపత్కృదళ కందాభ తిర్యఙ్నతా
స్యమునఁ గొమ్మొకటి మోవనఁగఁ గ్రుంగఁ ;
గటముల డిగి చిబుకమున రే పేరిన
మద మంజనగ్రంథిమాడ్కి మెఱయ ;
ఛిద్రోత్థహతవలత్కృద్రాజ మనఁ జుట్టు
తో విప్పుతోఁ దరిఁ దొండ మాడ ;
తెల్లఁబెళ్ళలు నీటఁ ద్రెళ్ళి ఫేనము వండు
నయిః పునఃప్రావృడాశయము నొనఁగ;

తే. ఘనరజోవృష్టికై మీఁదికన్ను మొగుపఁ
గటిదెసలు నిక్క, బరితోలు గదలఁ, గలు
మదముతిక్తత నదుల కీఁ, దదనుకృద్వృ
షాళితోఁ దేంట్లు వఱవఁ, గోడె గరులు. ౧౫౩

శా. గండద్వంద్వగళత్కరాళమదరేఖల్ పుల్లినత్తచ్ఛదా
ఖండక్షోదసిత ల్ప్రకీర్ణకములై కర్ణద్వయి న్మించఁగాఁ,
గొండల్ద్రివ్వినమన్ను కత్తులగతిం గొమ్ముంగొన ల్ముంప, వే
దండంబు ల్చవుదంతు లౌటఁ దెలిపెం దండెత్తభూపాలికిన్. ౧౫౪

తే. అప్పు డన్యోన్యవిజిగీషులైనదొరల
కవ దొనలనుండి లబ్ధలక్ష్యతఁబడసిన
స్వకులశరపాళిచేఁ గీర్తిఁ జాలఁ గనెనొ
యన వనాళిఁ బ్రఫుల్లశరాళి మెఱసె. ౧౫౫

తే. దరులతడివండు పొదువుమూఁపురము లంటు
తెల్లుగంటల నాఁబోకు లుల్లసిల్లె,
గిరుల మోరుల నవి సముద్గీర్ణసలిల
జలదరచ్ఛేదములు వ్రాలఁ మెలఁగుకరణి. ౧౫౬

తే. గగనలక్ష్మి నిజోరు నక్షత్రమాలి
కలు వియన్నది జలములఁ గడుగఁ బిసుక,
నెఱయు కుంకుడుఁబండులమఱువు లనఁగఁ
బలవలని పాండురాంబుదపంక్తు లమరె. ౧౫౭

శా. అప్పు ల్వారిధిచేతఁ బుచ్చికొని, కార్యంబైన, మున్గొన్నయ
య్యప్పు ల్దా చనియు న్సవృద్ధికముగా నవ్వార్ధికే తీర్పఁగా,
నప్పుణ్యాతివిశుద్ధజీవులు నిజాచ్ఛాంగంబులం దోఁచు న
ట్లొప్పారె న్శశిబింబగర్భితములై ద్యోచారిశుభ్రాభ్రముల్. ౧౫౮

చ. విశద పయోదపుంబొరంవేష్టనచే నొకమై నభోమణిన్
లశునపటంబు వొందుట మనంబున నారసి, కాంచి, విష్ణుఁడ
య్యశివతకై పదంబు వలయంబునఁ బాపి, యవస్తులోభక
త్కృశతఁ బ్రబోధ మొంది, సిరిఁ గాంచి చెలంగెఁ బయఃపయోనిధిన్. ౧౫౯

ఉ. అంబరవాసు లగ్నిఁ బ్రియులై ద్యుమణిస్ఫటికోపలంబునం
దుం బడయ స్మరజ్జ్వలదతూలపరిప్లవరఁ గొంత పై ఘటిం
పం, బెలుచం జనించి, యొక మట్టున నిల్వక యాక్రమించెఁ గాం
కం బరితాప మూన ననఁ గానె మొగి ల్విరియెంచ లత్తఱిన్. ౧౬౦

క. కంజహితాస్తోదయములఁ
సంజకదల, నడుముఁ గప్పు, సంధిల, మి న్నా
ప్పెం జూడఁ బ్రకృతిశబరీ
గుంజానాసాభిభూష కొమరు భజింపన్. ౧౬౧

తే. గూండ్లకై శాలిమంజరు ల్గొనుచు, మూఁగి,
యంబరంబునఁ బఱచు కీరాళు లొప్పెఁ,
బసరుటొండొంటియాకుతోఁ బండఁ బాటి
ఛేదభయమున నెగసిన చే లనంగ. ౧౬౨

సీ. శ్రీలు దా రొసి నాశ్రితపద్మకర్ణికా
కృతిఁ జెవు ల్కమలకర్ణికల మెఱయ;
నతనుసాంధ్యకృద్రతిరేఖ మించెపై
నదలించు రొద చిల్క వదుపుఁ బఱవ;
దోగ మొగ్గలను వైష్ణవ దూర మేఁగమిఁ జెట్టు
చప్పట్లఁ జన్నులు జడలు గదల;
పెద్దత్రోవ మును చెప్పి, వడి నవ్వ, దిరుగు న
ధ్వగుకొలందినె యపత్రపయు మరల,

తే. నధర రదనప్రసాదంబు నడుగ నోరు
దెఱచె ననఁ బండి ప్రీలి ము త్తెములు తోఁచు
చెఱకు జంపులఁ బోలమి శిరసు వాల్చు
రాజనముఁ గాచు గోపికారాజి వొలిచె. ౧౬౩

తే. నింగి యత్తఱిఁ దా మహానీల మైన
గరిమకుం దగ బహుతృణగ్రాహి మయ్యె.
ననఁగఁ బరిణత కలమాది యవసరాశి
తతులు గిరు లన నభ్రంకషతఁ జెలంగె. ౧౬౪

మ. అయనిష్ఠఁ దవశాతవృత్తి దగునయ్యాగంబు పొగంగ, నం
మ యమిశ్రేణులు రాఁగఁ, బుంగవకకుత్ స్థుం డల్ల వర్షాదినా
త్యయరాముండు సలక్ష్మణుం డినున కోటా ప్తిగా, విల్లు ని
ర్దయతం ద్రుంపఁ, బ్రభగ్నశాల్యవని సీతాప్తి గాకుండునే. ౧౬౫

క. మొగిలువిరియెండ వేఁడిమి
నిగుడ, శుకశ్రేణి పసరు నింగి న్నిండఁ,
బెగడెఁ బ్రజ. హరితవాజుల
గగనమణిస్యందనంబు గదిసెనె యనుచుఁ. ౧౬౬

తే. భువి నరకశైరవశ్రేణి పోవఁదోల,
దివిఁ గనద్గ్రహనక్షత్రదీప్తి దఱుమఁ,
గృష్ణపక్షపువాని లే కిరులు దనదు
నలువునను గూడె నన నైల్య మొలసె నభము. ౧౬౭

క. క్రేవుఁ దలఁచి పని మేయుచుఁ
జేసినపాల్గలయ నెండచేఁ బాంథజనుల్
దూపింపమి కఱుఁ దలఁచిన
యాపాగా యనఁగ నదుల నంచలు మెఱసెఁ. ౧౬౮

తే. వెదమొనవుకూడఁ బోలేనివెచ్చ గ్రొవ్వు
కల్ప మెదచాఁప నెదలెనో యనఁగ, నెట్ట
కేలకును గ్రుంగి తెచ్చు అంకెలు నిగుడఁగ
మందగతి గన్కె వృషభము ల్మందపిఱుఁద. ౧౬౯

తే. శరధిజల మెల్ల రిత్తగాఁ గురియ, నుపు
డొక్కఁ బేరిన, నత్తెప్పె చిక్కి మీఁద
గాన నగుచున్న దచ్ఛతచే, నవంగఁ
బఱచు శరదభ్రములమేని పాండు వమరె, ౧౭౦

క. శరనిధి మును గ్రోలిన ని
ర్భరజలములు గురిసి, మేఘభావం బఱి, య
క్కరములు కరములె కా, జిగి
నొరిమె, నన రవియు మెఱసె, నుడిగెను మొయిలుఁ. ౧౭౧

క. ప్రాశించిననీ రంతయుఁ
ఘో, శరదభ్రములు మఱఁతఁ బూరింపఁగ, నా
వేశించెఁ గొలంకుల నసఁ,
గాశప్రతిబింబపటలి కడు నొప్పారెన్. ౧౨౨

తే. కొలనఁ గరిదంపతులు పద్మకళిక లొకటి
కొకటి యీ నెత్త, మకరంద మొలుక, నమరె
నల శరత్పద్మనిలయకు నెలమితోడఁ
గవగ నభిషేకమున కెత్తు కడవ లనఁగ. ౧౨౩

తే. పంక మడుగంటి తేటిన బావు లెల్లఁ
బంకములె చేసెఁ గ్రమ్మఱఁ బంకజములు
గళితమకరందయుతరజఃకర్దమమునఁ;
గారణగుణంబు గలుగదే కార్యమునను. ౧౨౪

క. ఒసఁగి రగస్త్యార్ఘ్యములం
గొనరి జను, ల్వార్ధి నీరు గ్రోలితి పీసి
ర్వసికై మా కిమ్మని క
న్కసరు రుదుగం గావ నప్పగించెడు కరణిన్. ౧౨౫

క. పరుషాతపతప్తం బగు
ధరణీపాత్రమునఁ బడుట దళ మయ్యెఁ జుమీ
పరిపక్వంబై, యనఁగా,
శరదిందుజ్యోత్స్న రేల సాంద్రతఁ గానెన్. ౧౨౬

తే. వృష్టితటి నిద్ధఱవఁ ద్రావఁ గ్రిందనుండి
తేట నదినీటఁ దనవెంటఁ దేలుమీల
తళుకుతో నాఁచులత దోఁచె వెలికి, జమిది
వెండి మీ లెక్క వెంద్రుకవిల్లువోలె. ౧౨౭

క. హంసము క్రౌంచముతొలి తా,
మాంసలరుచి వచ్చెఁ దాను మలయము శిఖఁ; బాల్
హంస విఱువ, నీ ర్వ్రాటిచెను,
హంసమున కగస్తి పరమహంసం బగుటన్. ౧౨౮

తే. క్రౌంచ మొకకొన్ని గ్రుడ్డులు గాంచె మింట
నవి యహంసచ్ఛదాచ్ఛాదనాసభూతి
హంసతతు లయ్యెఁ, గా దన్న, నరుణ చూడ
గుప్త భుజగాశనాంతము ల్గుఱులు గావె? ౧౭౯

చ. శరయుఁగ వారిదేవతలు గాంచు సకోపరదంభదర్పణం
బుసపబు దట్టపుంజిలుము వోవఁగఁ దా ఘురారము గియఁగా
బలె నలువంకలం గలయఁ బాయక తేలుచుఁ బద్మరేఖవు
ల్కెలఁకులఁ బాసి పోఁ జెరఁగి గ్రొంబృతులిచ్చె మరాళమాలికల్. ౧౮౦

సీ. అర్కమండలి కభ్ర మడ్డ మైనంతనె
యెఱ మాని మోముది ద్రెత్తి చూచి
ఘుమఘుమధ్వని గాలి గుహలఁ జొరఁ, బురి యొకిం
చుక యెత్తి కని తలంచుకొని వంచి;
నిమ్నవృకేతకి నేత్రాంబు వొత్తి, బే
కవుఁడెంకి పదియచోఁ గర్ధ మొగ్గి;
కేకఁ దుఃద్యశ్రివనత్రగీవ మై రాక యొ
క్కం తార్చి, వాత నేమేము కమిచి;
తే. వెనలు బీతెంసకును శరద్వ్రాష మీఁగి,
వార్షికమె యెక్క, క్రౌంచి నిర్వంకఁ బక్ష
తులను నివురుచు, వెళ్లిచూపుల నురంబు
కెలఁకులఁ గనుంగొనుచుఁ గానఁ గేకు లుండె. ౧౮౧

క. వెలుతురస లంటి యెండియు,
లలి, విప్పమిఁ, జెనక, శిఖికలాపము వని వ
త్రిలెఁ, బర్హస్యుఁడు నటన
మ్మొల మెచ్చి మెఱుంగుఁగానె ముద్రించె ననన్. ౧౮౨

సీ. చక్రస్తనప్రకాశమునకు ఫేనంపుఁ
గొం గిడి గొనగొనఁ గొళ్ళ గొణఁగి;
యశ్మనితంబులు హంసహారమును బ
రాగరేఖాస్వర్ణరశనముగను

జలశాదిపులినంపుజఘనంబుపై జాఱు
వ్యస్తవేతసభుజన్యస్తిక మిడి,
తనిమితో వెచ్చనై తటశరత్ప్రతిబింబ
హాసాళి బాష్ప లుద్భాసములకు

తే. నగుచుఁ, జెందొవకంటను నలిగి, త
లంటు కైయొత్తు పవనతి నలర, కువల
మధుంహరి నద్దిఁ జెంది పై మగతనముల
నొక్కెసలఁ గూడుమ స్రవంతు లుబ్బు వెనిచె. ౧౮౩

యామునప్రభుని దిగ్విజయము

వ. ఇట్లు శరత్సమయం బెసంగిన నంగీకృతక్షత్త్రియధర్ముండు గావున దిగ్విజయయాత్ర ధర్మం బని యానీతబలషట్కంబుగా నాకృష్టసామంతరాట్కంబుగా వెడలి. ౧౮౪

మహాస్రగ్ధర

గజఘోటస్యందనాశీకబలితధరణిం గాఢవేషూథిరాడ్ఘూ
ర్ధజరత్నశ్రేణు లంతర్మణులసవతులై క్రమ్మఁగ బాదాతకుంత
ధ్వజవాతాఘాతఘూర్ణద్వనధుంరవము ల్వాద్యము ల్మ్రోయఁగాఁ, ద
ద్ద్విజరాజస్యుండు విద్విడ్విదళన మనిఁ గావించె దిగ్జైత్రయాత్రన్. ౧౮౫

క. జన్నములు చేసి, దానము
లన్నానాదేశవిప్రులం దనుపుచు నం
పన్నత ననిశము బహుభో
గోన్నతుఁ డై, యాప మఱచి యుండె నశంకన్. ౧౮౬

వ. మఱియు నతని రాజ్యంబునఁ గసవుఁ గఱచి చేయెత్తి మొఱపెట్టుట కరుల యంద, యట్లట్లువడ మెడఁ బట్టి త్రోయుట వెడవెడం బోవుపల్లవులం బంపుచ [illegible]ంటులకు నిండికిం దెప్పపణ్యాంగనాభ్రాతల పరిహాసచేష్టలయంద; సున్నమ[illegible] ముం బట్టుతారులంబట్టుటయు సౌధసౌవర్ణభూషాదిని[illegible]ంబుల యంద; [illegible]నెక్కట్టుటయుఁ గత్తిదాల్చుటయుఁ గృకవాకుల కలహ[illegible]బులయంద; యతుల్య[illegible]పలనావిమర్శణ[illegible]దోషంబులు జాంబూనద పరీక్ష[illegible]యంద; యేదేసియుం గన్నువేయుట మృదంగాదివాదిత్రంబులయంద; ధాతువాదంబులు

తఱ చగుట శాద్రికులయందు; కాక, యితరస్థలంబుల లేకుండ రాజ్యపరిపాల నంబు సేయుచుండె. ౧౮౭

తే. తత్పితామహుఁ డైననాథముని శిష్యుఁ
డైన శ్రీపుండరీకాక్షునను(గు)శిష్యుఁ
డైన శ్రీరామమిశ్రాఖ్యుఁ డార్తిఁ దనదు
పరమగురుపౌత్త్రునకు నిట్టిబంధ మెట్లు ? ౧౮౮

వ. మా [illegible] మఱి సామ్రాజ్యంబునం దోసక్తుఁ డయ్యె; నట్టి మహాత్ముని వంశంబునం బుట్టినట్టి యితండి [illegible] యతిక్రమంబు. ౧౮౯

సీ. వృషశైలధురవారిఁ బ్రశవణస్నానంబు
సష్ఠఁ గావించి, యాహ్నికముఁ దీర్చి,
యేకాంతగుహత త్తటీకుశాసనమున
నుండి, లక్ష్మీకాంత్రమీపుండరీక
మంకురత్పులక హర్షాశ్రువైదహరపు
ష్కరమున భావించి, నవిల దిరుగ
యజ్ఞోపవీతపద్మాక్షమాలికంతో
యోగపట్టికఁ గూడి యురము మెఱయ,

తే. శౌరిఁ దద్ధణిభ్రద్వాస్వృఁ గొలిచి,
సతియు నాలర్కశాక మంచితము వంత,
వి ల్మకుందున కర్పించి. వెల్మిఁ దీర్చి,
యిట్లు తనుయాత్ర వడపు ము న్నితనితాత. ౧౯౦

క. తొడిఁబడి, విషయాతురు నవి
విడు మనియెడుకంటెఁ గలదె వేఱ పగ ? నే
డ్పడరఁ గథామల నొక వెం
బడి దోఁపం బలికి మైత్రిఁ బాపుఁ యొప్పున్ ౧౯౧

క. వసుధం బుత్త్రాదికదు
ర్వ్యసనముసైతమును దండ్రి వారించుటకున్
వసవద దఁట; మఱి రాజ్య
వ్యసనము వారింపఁ నెంతవాఁ డెవ్వాఁడున్ ? ౧౯౨

ఆ. నల్ల గ్రోల నిచ్చి మెల్లనె చివ్వంగి
నోటి జింకఁ దివియు నేరు పొదవు
వేటకాఁడువోలె విషయాళివలనఁ ద
త్తృష్ణఁ దీఱ నిచ్చి త్రిప్పు టొప్పు. ౧౯౩

వ. కావున, నట్లయిన నితని విరక్తి నుపేక్షింపరా; దుపాయంబునఁ జొచ్చి యొక్కరీతిం ద్రిప్పవలయు, నుర్వి నాహార దోషంబు విజ్ఞాననాశంబునకు మూలకారణం; బని వితర్కించి. ౧౯౪

క. ముల్లు దలకొనని నవకపుఁ
బల్లవములతోడ ముక్తిభామ చెవులకుం
బల్లేరుఁబువ్వులగు పువు
లుల్లసిల నలర్కశాక మొదుగుగఁ గొనుచున్. ౧౯౫

తే. తెచ్చి, యొక వైష్ణవుఁడు గానుకిచ్చె, ననుచు
బానసపు బాపనులచేతఁ బంపుటయును,
నతఁడు ప్రియపడి వండించి యారగింపఁ
దెమ్ము నిచ్చఁ, గొన్నాళ్లిట్లు తెమ్ముచుండ. ౧౯౬

వ. ఒక్కనాఁ డతండు భోజనసమయంబున సకలశాకాస్వాదనంబు సేయుచువచ్చి, తచ్ఛాకంబు నంజుచుం దలంచుకొని, 'యేతదానేతయగు భాగవతు భోజనానంతరంబ మమ్ముం గాన్పింపుం' డని పలికి, పాణిపాదప్రక్షాళ నాచమ నానంతరంబ గాన్పించుకొని, నమస్కరించి, వచ్చిన ప్రయోజనం బడుగుటయు, నతం డిట్లనియె. ౧౯౭

క. "మీ పెద్దలు గూర్చిన ని
క్షేప మొకటి సహ్యజాత సింధు జలాంత
ర్ద్వీపమున నుంట నీకుం
జూపంగా వచ్చితిని వసుమతీనాథా. ౧౯౮

క. నా కేటికి నిక్షేపము
నాకు, నిధియు నాకరంబు నరనాథుల సొ
మ్మే కాన విన్నవించెద,
నాకర్షింపుము తదీయ మనువిధ మెల్లన్. ౧౯౯

సీ. స్ఫుటల మణుల్గాఁచిల కాంత మై శ్వేత మై
నట్టిత్రాఁ చొక్కటి చుట్టియుండు;
రక్షోగృహీత మన్నథ తొల్లి గల, దది
పొలయ దందే దాఁటు నెలలు గాని;
యేపాటఁబలి యైనఁ జేపడుఁ బ్రాణిహిం
సాదిపూజనముల కానపడదు;
తనవెలుం గొగి విరంజనదృష్టికినె లక్ష్య
మై యుండు నయ్యె నింతంత గాదు;

తే. రత్న మొక్కటి పై ననర్ఘంబు మెఱయుఁ;
గలదు పద్మంబు శంఖంబు; పలుకు లేటి
కక్షయ, మనంత, మాద్య మేకాంతమందు
భూవ, నీకొక్కనికె కాక చూపరాదు". ౨౦౦

వ. అని విన్నవించిన నంతనించి, సేనాసమేతుండై యతండు మున్నుగా శ్రీరంగంబున కరిగి కావేరీచంద్రపుష్కరిణులఁ దీర్థం బాడి రంగనాథుని సేవించి సాభిప్రాయంబుగా నతనిం గటాక్షించిన నతం డిట్లనియె. ౨౦౧

క. "మీ పెద్దలు గూర్చిన ని
క్షేప మ్మిది గొ"మ్మటంచు శ్రీరంగపతి
శ్రీపదయుగ్మముఁ జూపిన
నాపృథ్వీపతియు హరనిరస్తభ్రముఁడై ౨౦౨

వ. గ్రక్కునఁ దనపూర్వదశఁ దలంచి యిన్నాళ్ళు దన ప్రమాదంబునకుం బరమనిర్వేదన నొంది 'నీ వెవ్వండ ?' వనుటయు, 'నే మీ పితామహుం డగు నాథముని ప్రశిష్యుండ; నయ్యోగివరుండు భావి భవజ్జన్మం బెఱింగి భాగవతవతంసం బగు నీచేత నివ్విశిష్టాద్వైతంబు సకలభూతహితంబుగా వెలయంగలయది యని నిశ్చయించి, నీకు ద్వయం బుపదేశింపు మని, తన శిష్యుండగు పుండరీకాక్షున కుపదేశించిన, నతండు భోగాసక్తుండ వైన నిన్నుపాయంబున దెలిపి, నీ కుపదేశింపు మనుటయుఁ, బనివింటి,' ననిన, సాష్టాంగంబుగాఁ బ్రణమిల్లి, యతనిచేతం బంచసంస్కారసంస్కృతుండై, యంత నిజపక తురీయాశ్రమంబునకు రాఁగలవాఁడై స్కంధావారంబునకు మగిడి వచ్చి, కుమారునందు

రాజ్యభారంబుఁ బెట్టి, బంధుమిత్రామాత్యసమేతం బగు **బలచతుష్టయంబును** బ్రకృతివర్గంబును నతని కొప్పగించి యిట్లనియె. ౨౦౩

## రాజనీతి

క. 'ఏవట్టున వినువక ర
క్షాపరుఁడవు గమ్ము ప్రజలచక్కి; వివస్తు
ల్గూపెట్టిన విని తీర్పుము;
కాపురుషులమీఁద విడకు కార్యభరంబుల్. ౨౦४

తే. రాష్ట్రవర్ధన మెదఁ గోరు రాజు మేలు
రాష్ట్రమును గోరు; దానఁ గార్యమె యనంగ
రాదు; బ్రహ్మోత్తరము లైన ప్రజల యేక
సుఖపుఁగోర్కెఁ దదంతరాత్ముం డొసఁగఁడె ? ౨౦౫

ఆ. ఉజ్జ్వలయు నృపతి, కాభీరభిల్లాది
కంటకోల మూల నాజ్ఞ చెల్లు
నంట; సార్వభౌముఁ డైన భూపతి యాజ్ఞ
కెల్ల వారుఁ దల్లడిల్ల వలదె ? ౨౦౬

క. దుర్గము లాప్తద్విజవర
వర్గానకె యిమ్ము; దుర్గవత్తతి క
త్యగ్ర ధరాధిరాజ్యవి
నిర్గతసాధ్వసత బోదమ నిలుపకు కొలఁదిన్. ౨౦౭

ఆ. మొదలఁ బెనిచి, పిదవ గురియింత, నెవ్వాఁడుఁ
దనదు లొంటిహీనదశఁ దలంపఁ,
దలఁకుఁ; గాన శీల మరయుచుఁ గ్రమవృద్ధిఁ
బెనిచి, వేళవేళఁ బనులు గొనుము. ౨౦౮

ఆ. అసభిజాతుఁ, గీకటాలయు, సత్రుతు
నలుకు మాని బొంకు పలుకువాని,
నాతతాయి, గడును, నన్యదేశ్యు, నధర్ము,
విడుము విప్రు నేల వేఁడితేని. ౨౦౯

క. తక్కుము మిగులఁ బథిచ్యుత
వక్కణవర్ధితులఁ; దొల్లి భ్రష్టగు విప్రుం
డొక్కండు పలుగఁడె ప్రోచిన
కొక్కెరపై నొక్కపూఁట కూటికిఁ గాఁగన్? ౨౧౦

చ. చదివి యధర్మభీతి నృపశాస్త్రవిధిజ్ఞతల న్వయస్సు దె
బ్బదిటికి లోను నేఁబదికి బాహ్యము నై యరుజన్వపూర్వులై,
మద మఱి రాజుప్రార్థన నమత్యతఁ గై కొని తీర్చు పాఱువా
రొదవిన నంగము ల్మిగుల నూర్జిత మౌటకుఁ బూఁట పొందదే, ౨౧౧

వ. అట్టి మంత్రివర్గంబు దొరక దేని. ౨౧౨

శా. నీతిం దాన తలంచి చేయఁ బని గానీ కాకపోనీ, బల
వ్రాతార్థాధ్యత నెమ్మి నంత కొనుఁ ద్రోవన్మంత్రి యంచుం గుణా
తీతుం, గుమ్మడికాయ యంత యగుమం త్రంబై మనం బేర్ప. న
ట్లైతా నాతనిచేతిలో బ్రదుకువాఁడే యొఁ జుమీ మీఁదటన్. ౨౧౩

క. ఒక్కనివిరివికినె దొర
లొక్కండ్రే, నొక్కనొకని వెంబడి నడుగ
లెక్కండ్రు నిలువఁ బను లగుఁ;
గక్కనము గదింపఁ; బెంపఁగాఁ గాకుండున్. ౨౧౪

క. ధనముఖ్యము కేవల మే
వనియుం గా, దాస్థ గలిగి పలువురు ప్రభువుల్
పనిసేయక, తద్వశ్యం
బునకు నలోభాన్యశంస్యముల్ బుతముఁ జెలుల్. ౨౧౫

క. భాండాగారహయాద్యము
లుండియు నను వగు మనుష్యు లొదవమి నవియున్;
మండలి నవయ నరి కొదిఁగి
యుండిన సింహాసనంబు లుర్వి న్వనమే? ౨౧౬

తే. బాహుజాంఘ్రిజ ముఖవిడంబనకు నయినఁ
గొలిచి మను విప్రధర్మంబు దెలిసి యైనఁ;

బూని సంకటముల నిల్చుఁ గాన; దలఁచు
బ్రాహ్మణునిఁ బ్రభుఁ జేయుట పతికి హితము. ౨౧౭

ఉ. ఆయతికాని కీకు మమరాలయముఖ్యము, లాతఁ దర్థతృ
ష్ణాయతుఁ డై నిజోర్వి నగునష్టికిఁ దద్ధనముం దొరల్చి, రా
జాయతనంబుఁ జేర్చు; మఱి యట్టి దపథ్యము, కాన నొంటిగాఁ
దే యధికారి గావలయు, నించుక తిన్నను వాఁడె రూపఱున్. ౨౧౮

చ. మును దనసీమ చేసికొని, మల్లడి, గుద్దట వెండి చేనిమె
త్తనకయి వేరు వెల్లఁకియుఁ ద్రవ్వెడు కర్షకునట్లు, శత్రుతో
నెనసియ యైన దుర్గబలమే కొని యైన, నిజాత్మ చింత లే
క నెగడఁజేసి, లోన మఱి కంటకశోధనఁ జేయు టొప్పగున్. ౨౧౯

క. మొదలనె యెరుదలకానిం
జెదరంగా నాడ కాత్మఁ జింతింపు; పదిం
బదిగ మృష యేని మఱి విడు
ముదస్తుఁగాఁ గాక యుండ నొక్క ఘతమునన్. ౨౨౦

క. ధరణి నసాధ్యనగాటవు
లిరవుగ భూపీత సేయు నెలుకుల పొరుగూ
క్లైర వగు నస్థిలిఖూరుల
కెరవుగ నిచ్చునది, మిథము నెట్లయిన సురుల్. ౨౨౧

వ. విశేషించియు నప్పార్వతీయబలంబు లోనం గూడకయున్న రాజునకుఁ బ్రజా
బాధ దఱుఁగ; దెట్లనిన్ బెదరు వాపి వారలం జేకూర్చుకొనవలయు; నవిశ్వా
సంబును విశ్వాసంబును, నలుకయు నెలమియు, నతివైరంబును నత్యానుకూ
ల్యంబును, నల్పులగుట నల్పంబునన యగు; నె ట్లంటేని. ౨౨౨

శా. విల్లుం దానును భిల్లుఁ డొక్కఁ డరుగ, న్వ్రిందింట దుగ్ధాన్నమున్
భిల్లుం డన్యుఁడు వెట్ట, నారయుచుక స్వీక్షించి, దొబ్బుచు వాఁ
డెల్ల న్వమ్ముగఁ జేసి, త న్ననుప రా, నెందేఁ దెగం జూడఁగా
నుల్లంబై, 'చన నంపు, నార చెడు' నా, నూహించి పో నంపఁడే. ౨౨౩

క. ఆపాంకూటనే నిజ
మేపాటియుఁ దప్ప రాడిరే; నెరనునఁ గొం

తేపాటి గన్న నెఱుగుదు;
రివని యెం తనక వెడఁగుటెద నాటవికుల్. ౨౨౪

తే. ఆటవికవశ్యకలన సత్యమున, వైరి
మనుజపతిమైత్రి దూతసమ్మానమునను,
గూర్మి దటి భృతిఁ గాల్వురకును. నపారి
తోషికవుసేవ నెలమి రౌతులకుఁ గలుగు. ౨౨౫

క. మేలగు ఘోటకమును శుం
డాలంబును నాప్తసుభటునకె యిమ్ము; తటి
న్మేలగుమెలపున మందురఁ
బాలింపుము; దొరలపాలు పఱుపకు మేపుడుఁ. ౨౨౬

తే. కార్య మొక్కఁడు గనిన మాత్సర్యమున నొ
కండు గా దని ఖండించుఁ; గ న్నెఱింగి.
యిరువురను గా దనక కొల్వు విరిసి, మీఁద
నల్లవాఁ డెన్నినది సేయ నగు శుభంబు. ౨౨౭

క. వగ వెలిఁ గాని, లో దస్యులఁ
జిగిరింపఁగఁ జేసి, నృపతి చిక్కువడఁ బను
ల్దెగి సేయక, తారే ది
క్కుగ నడతు రశంక నల్లుకొని దుస్సచివుల్. ౨౨౮

క. ఇప్పింతు రాత్మవశులకుఁ
దప్పింతురు పరుల, కార్చి తప్పింతురు, 'రా
జిప్పగిదివాఁడె' యని వే
చెప్పినఁ బెరవారు నమ్మి చేరకయుందుఁ. ౨౨౯

ఆ. వాఁడిఁ బొదలు జఠరవైశ్వానరుఁడు గఫ
ప్రముఖదోషయుక్తి బలిమి చెడిన,
వెలి మహౌషధంబు బల మిచ్చుగతిఁ, బ్రతి
సేయ, వాఁడిమదముఁ జెఱుచుఁ బరుఁడు. ౨౩౦

వ. వారిమిగిలి ప్రతిసేయనెట్లం టేని, ౨౩౧

క. భండారములో హయమద
శుండాలఘటాళి దనదు సొమ్మై పోగా
నుండిన, నాతడ వాయదె
పండితుఁడును బిరుదునైన పతికిని బయలై. ౨౩౨

క. కడుపున నొకకడి దళిఁగినఁ
జెడఁ జూచు బెకారి పతికిఁ జెలియుం గలఁదే?
ఒడి దంత విడువఁజెల్లునె?
నడప వలయు నేర్చినట్లు నమ్మకయె కృపన్. ౨౩౩

చ. ఒకటికి రోయకుండ గను మున్నవియుం, ద్రుపదుండు మారణే
ష్టికిఁ బసిఁ జూచి వేఁడ మునిసింహుఁ డొకండు తమన్న వేల్పుఁ? బం
డొకఁ డపవిత్రభూమిఁ గని యొల్లక యేఁ జనఁ దా గ్రహించె రో
యకనియెఁ. దాన న ల్లెఱుఁగ నౌఁ. జనసర్వముఁ గాన శక్యమే? ౨౩౪

క. పేఁ దెవరుసఁగి దెన్నిన
వాఁ డని, జయ మైన, హింస వదలి కొనుము శ్రీ
పోఁడి; యహి యేమి గొలఁ బ
ల్వాడి సెడిన, నట్టిదయకు వైరియు నమ్మున్. ౨౩౫

తే. దేశవైశాల్య మర్థసిద్ధికిని మూల,
మిల యొకింతైన, గుంటకాల్వలు రచించి,
నయము పేదకు నరిఁ గోరునను నొనంగి,
ప్రబలఁజేసిన నర్థధర్మములు వెరుఁగు. ౨౩౬

తే. ప్రజ నవని చన్నఁ బిలువ, కప్పనులఁ గొలుచు
నమ్మి, యిండ్లింధనంబుల కాయె, ననెడి
కలని నక్కైకొన యధికారిగల నృపతికి
నేడు దీవులు గొన్న సమృద్ధి లేదు. ౨౩౭

మహాస్రగ్ధర

ఉరవౌదాగంబు భోగం బుభయము నొకపా లుగ్రసేనావనార్థం
బిరువా ల్నిండాయబండారిలు చొర నొకపా లిట్లుగా నాయ మొవ్వం,

జనదృష్టి న్వైరిపక్షేక్షణము సచివపక్షస్వపక్షేక్షణంబుం
ధరణీనాథుం డొనర్పం దగుఁ, దగుఁ దునుమం దన్కారాతి న్నిజోర్వీన్. ౨౩౮

క. లాలన నారక్షులఁగమి
నేలి, తెలిసి క్రమ్ము, నాజ్ఞ యిడ కతఁడు చెలం
బో, లాఁతి నిడ, నయశ మెం
తే లేవదె కూలవృధువణిజ్న్యాయమునన్. ౨౩౯

చ. ఎఱుఁగ నగున్ స్వశక్తి నవనీశుఁడు నాలుగుపాళ్ళ మూఁడుపా,
ళ్లెఱుఁగక మోచినట్టివని కిష్టసుహృత్తతి దెల్ప నొక్కపా.
లెఱుఁగ నగు న్నయార్థ్యమతి, నిట్లు నిరాగ్రహుఁడైనఁ జేయు నె
త్తఱివిపదుగ్రదండపరతంత్రుఁడు గాక చిరంబు రాజ్యమున్. ౨౪౦

తే. కన్నొకటి నిద్రవోఁ బెఱకంటఁ జాగ
రంబు గావించు భూరుహాగ్రంబుమీఁది
యచ్ఛభల్లంబుగతి భోగ మనుభవించు
నెడను బహిరంతరరులపై దృష్టి వలయు. ౨౪౧

ఉ. అక్షరపక్షపాతమున నర్థము నూళ్ళ నొసంగ, నుబ్బునన్
భిక్షుజటాధరాదికులు భిన్ననిజవ్రతు[illegible]ము; రైన దు
ర్భిక్షరుజా శిశుచ్యుతులు పెక్కగు; భక్తియ చాలు, గానఁ ద
త్ప్రిక్షుభితత్వ మేయఘముఁ దార్పదు. శంకఁ దలంగు మయ్యెడన్. ౨౪౨

క. మును వార్తయవిజ్ఞా
పన కోర్వుము వధ్యకోటిపట్టునఁ, జెవరం
దన కవ్వడె కీడగు నను
జనముం బట్టుటకు మునుపె శస్త్రము చాలున్. ౨౪౩

క, శూరాలాపములకు నతి
శూరుఁడు దా నయ్యు నృపతి సోఁకోర్వఁ దగున్;
వారుబ్బుదు రందున, నిజ
శూరత దొరలందుఁ గనుటనూ కార్య మిలన్. ౨౪౪

శా. దేవుల్మావు మతంగజంబును మణిశ్రీఖండముక్తాదియున్
దా. వాణిజ్యము పెంచి యేలఁగ నగు; న్వర్షంవులెవ్వన్ గుఱ్ఱ

హావళ్ళన్ దిగుఁ నన్యభూప్రజల రా జాయాయిజాత్యోచితిన్
త్రోవంగాఁదగుఁ; దోఁటదొడ్డి గను లాపు ల్పొందఁ బంపం దగున్. ౨౪౫

ఆ. పదను వచ్చుదాఁక నవరాధిపై రోష
మడఁగి చెలువవలయు పదను వేచి,
లక్ష్యసిద్ధి దాఁక లావున శర మూఁగి
కాఁడ విడుచు నంపకాఁడువోలె. ౨౪౬

శా. పోషం బోలు లఘుప్రయాణత దినంబుల్గొన్ని, యొండొంట నే
కా వైరిక్షితి, కంటువు ల్వొడద రాఁగా సిల్చి జాలుంబలెం,
ద్రోవన్ సైన్యము గూడ; వైరి బలసాంద్రుం డైనఁ బూజాదులం
బోవం బోలుఁ, జరోక్తిచేత నసదేఁ బో కావరింపం దగున్. ౨౪౭

చ. ద్రవిణము నొవ్వఁ గొంట, నొఱ ద్రాబలతో నిడుచుంట, భూమి గొం
తవలికి విచ్చుచుంటఁ బ్రథమాపత్తఁ బూదక శంక నుంట, లోఁ
బొవయు నృపాళికై యభయము న్మణిభూషలు గుప్తిఁ బంపిఁ, భూ
ధవుఁ డరియం దిడం దగు భిదం, దనయం దివి మాన్పుకోఁ దగున్. ౨౪౮

క. అహితుఁడు వేఁడిన, నేలెడు
మహి నగమే నిచ్చి, తెగనిమైత్త్రి గొని, విభుం
డహితభయము మాన్పికోఁ దగు;
నహితభయ మహీభయముకంటె నధికము గాదే. ౨౪౯

చ. పలుకులు వేయు నేమిటికిఁ? బార్థివుఁ డాత్మభుజాభృతక్షమా
తలమున [1] గుట్టుకీడు బహుధా యరయించి, యడంచి చంచలా
త్ములగమిలో మెలంగు పురుషుండును బోలె నశంక నించుచున్
మెలఁగఁడ యేని, రాజ్యఫలమే యది? రాజ్యము దుఃఖలబ్ధికే? ౨౫౦

తే. బెదరి చేరని బలియుని బిగియఁ బట్ట
కతనిమైవడినే వచ్చి హత్తఁ జేఁత
క్రమము, పెనఁగెడు బలుమీను ద్రాటఁ జేఁదు
నొడ్డుగాలంపువేటకాఁ డుపమ గాఁడె? ౨౫౧

---

[1] (గుట్టు పేడు

సీ. దండపారుష్యంబు, కొండెంబున నతర్క,
మరిసంధి కెడయాక మరలఁబడుట,
యవలి తప్పెన్ని కన్న విదేశ్యుఁ జెఱచుట,
ప్రతిప్రవర్తకున కే ర్పడఁగఁ జేఁత,
జను నవిశ్వాసంబు గనుఁగొని మెలఁగుట,
విశ్వసనీయుని వేర్పఱుచుట,
మోమోట మంత్రంబుచో మిక్కి లిడుకొంట,
మంత్రభేత్తకు నాజ్ఞ మఱచియుంట,

తే. వింత పుట్టినఁ గనుగల్గి చింత సేయ
కుంట, మాన్యులపట్టున నొక్క చూపె
చూడకుంట, విహీనులఁ గూడుకొంట,
వ్యసనియై యుంట, చలముంట, వలదు పతికి. ౨౫౨

క. త్రివిధోత్పాతము లొదవిన,
వవనివిభుఁడు విడువవలయు నధికద్రవ్యం
బవనీసురముఖ సురముఖ
వవనసఖముఖముల భుక్తిబలిహోమవిధిన్. ౨౫౩

ఉ. స్పర్ధ పరస్పరంబు దొరపట్టున యోధనిపట్టున న్నృపుల్
వర్ధన మొంచఁ జేయఁ దగు: వారిహితాహితచర్య లొంద వం
తర్ధి: మిథోవ్యథానహ హిత ప్రథమానసమానతా ప్రథా
భూస్ఫురతామునం దగిలి ద్రోహపుఁజింతఁ దలంప రేమియున్. ౨౫౪

[illegible] డెందునేఁ దగదు తా[illegible]న, నూఱట కొక్కనిం దగుం
[illegible]రించి పంప నరి దుర్గముచేఁ జెరఁ, దాతఁ దర్థభూ
[illegible] లేక కొఱగాఁ, దటు సేయ ద్విజాన్యుఁ డల్కకున్
నెరవ[illegible] నాతఁడున్ వరియు, నిండినదుర్గబలోక్తి యీఁ దగన్. ౨౫౫

క. అనవు[illegible]గడి దేశములవి
దనము[illegible]గాఁ బెంపు; మాత్మ ధరణీస్థలికిన్
నడుము[illegible] పొంపొంపుగఁ
బొడివి[illegible]ము దస్యుబాధ పొందక యుండన్. ౨౫౬

చ. క్షమఁ గురుమన్నెపుం గహనచారి జనంబెఱ దోషదృష్టి కు
ద్యము గడుగంగఁ బూన్కి; దెగ దల్గిన సర్వము: నాస వీగి వ
శ్యముగ నొనర్ప దాడి కగు: నొగడి కొల్లలకు; న్మృతాపరా
ధమును సహస్రదండము నతర్క్యము సర్వము నేలువానికిన్. ౨౫౭

తే. సింధుర మహాశ్వముఖ్యము ల్చేర్పు దొం
దీవి వణిజుల కూర్లు సద్గృహములు పురిఁ
గొలువుఁ దేజంబు వెల మేలు గలుగఁ బ్రాఁత
వారిగాఁ జేయు, నరి నవి చేరకుండ. ౨౫౮

తే. గడి నృపులరాయబారులయెడఁ గొలువున
సరసల్లాపములు రాజు సలుపవలయుఁ;
గార్యఖడ్గము లనుచరు ల్గాన బలుక
వలయు; నవి మైత్రిఁ దాఁ దేంఁ బలుకవలయు. ౨౫౯

తే. తా వనంబుగ దొరఁజేయువాని మంత్ర
మునకు వేగమె లోఁజేయఁ జనదు; వాఁడు
క్రొత్తమన్నన రహి ననుఁగులకుఁ జెప్ప,
నయిన నదిచెడు, మఱి వాఁడు నతఁగుఁ గాన. ౨౬౦

సీ. హితబహుశ్రుతధర్మరతశూరతాన్వహా
ర్హతల మన్ద్విజుల దుర్గముల నిలిపి,
పులిజున్ను మొదలుగాఁ బురుషాయుషావధి
కం దుంఠ నవరణ ల్పొందుపఱిచి,
చేమంత యైనను సామంతకోటికి
మితము దప్పక యుండ క్షితి లొసంగి,
యాయాధికవ్యయా నధికంబునుం బ్రజా
విరజంబుఁ గాఁగ బందరువుఁ గూర్చి.

తే. క్షితిరిపుధాత్రిఁ జరదృష్టి చేతఁ జూచి,
బకహఠగతిగ్రహించి, తాఁ బ్రజయు నొవ్వ
కయ పగఱగాత్రములనె చీకాకుపఱుచు
నృపతి డెందానఁ జేయిడి నిద్రపోవు. ౨౬౧

క. ఎచ్చో గజఘోటక్రియ
తచ్చర్వణసుభటజీవితద్విజసురవ్యూ
హోచ్చనిజభోగముల కగు
వెచ్చము వెచ్చంబుగాదు విత్తంబునకున్. ౨౬౨

ఆ. ప్రతిన వూని వైరిపట్టున నృపతికి,
దండువెడలఁ దీఱకుండఁ దీఱఁ;
గాక యుండి యుండి కాలాంతరమున నౌఁ;
గార్యకాఁడొ యంతకాఁడొ నృపుఁడు. ౨౬౩

క. పోరానిపట్లఁ బోడుచుట
వైరిబలము దిరుగ జయమొ స్వర్గమొ యగు; నా
నారూపయంత్రతత్ప్రా
కారాదులపట్లఁ బ్రజనె కవియింప నగున్. ౨౬౪

చ. మనమున కొండు రెండు మఱుమంత్రముల న్వరిపోవఁ జెప్పినం
జనపతు లాతనిం బిలువ సాగదు: రాగతి సారెఁ బిల్చిన
చ్చనవునకే ధనాదిఁ గొని సంగతి గానివి క్రొవ్వి చేయఁ జె
ప్పు: నృపతి దద్విహిశ్చరితముం జరుచేఁ బరికింపఁగా దగున్. ౨౬౫

క. గడివాఁడు చెడునయేఁ దగుఁ
జెఱఁ జేయుట; చెడఁడయేని చెల్మియె తగుఁ; బై
గడివాఁడే పనికగుఁ దన
గడి వాఁ డరియైనఁ, దనకె గడి కావఁబడున్. ౨౬౬

తే. రాష్ట్ర మెరియింపు, కొనుము దుర్గములు, తదవ
రోధ మగపడ్డఁ బుట్టించిరూఢి నెరపు,
వరునములు త్రిదివులరాయబారు లెదుటఁ
బలుకకుము, సంధి యొకవేళ వలసియుండు. ౨౬౭

ఆ. అభిచారి ఘనగరాంబుదూషితరుజ్ని
రంతరాద్రిగహనదంతురోగ్ర
కీకటోర్వి మేరుగిరిసమార్థము వచ్చు
నేనిఁ జొరకు, వంపె యిడుము కొనఁగ. ౨౬౮

క. రాణింపఁ బలి తనపని
జాణై కొనుఁ. గొలుచు సంతసపుఁదలిఁ, దొలఁగుం
బ్రాణ చెతఁ గవుడుమానివి:
నాణె మెఱుఁగ బచ్చు గాఁగ నరపతికిఁ దగున్. ౨౬౯

సీ. తజ్జమండలిఁ గూర్చి, ధాతువుల్ దెలిసి, హే
మాదులఁ గొని, ప్రకృత్యనుగుణాల్ప
జీవనాహ్వాతులచేఁ జెలఁగి, మహాబలో
ద్రేకంబు మర్దన రిత్తఁ జేసి,
స్నేహార్ద్రుఁ డగుచు నశేషంబుఁ బోషించి,
నరవర్గములతప్పసరణు లుడివి,
సతతద్విజప్రతిష్ఠాశాలియై బలి
యించుపట్టులు బలియించి, పలుచఁ

తే. జేయుపట్టులు పలుచఁగా జేసి తేజ
మెనఁగ శోధన మఱవక యెనఁగ వలయు
సాంగరాజ్య మొకెత్తుగ స్వాంగరాజ్య
మొక్కయెత్తుగ నృపతి యాయుష్యపరత. ౨౭౦

సీ. సౌఖశాయనిక భిషక్పూర్వకము కల్య,
వేళఁ గార్తాంతిక ద్విజుల గోష్ఠి,
జాము వోవ నమాత్య సామంతపూర్వకం
బర్థార్థనస్థకాయస్థగోష్ఠి.
దినమధ్యమమున మర్దనమల్లపూర్వకం
బగుసూదసూపకృన్మృగయుగోష్ఠి.
యపరాహ్ణమున దేవతార్చనాపూర్వకం
బార్యధర్మాధికృద్ద్యతులగోష్ఠి,

తే. భుక్తిమీఁద విదూషక పూర్వకము పు
రాణకవిగోష్ఠి. చారపూర్వకము నంజ
జాము గాయకగోష్ఠి, నిశన్ సుషుప్తి
పూర్వకము ప్రేయసీగోష్ఠి పొసఁగుఁ బతికి. ౨౭౧

క. హితులు హితాహితులు సదా
హితులునునై రాజునెడల నిటు త్రివిధమునన్
క్షితి ననుచరు లుందురో సం
తతమును; మఱి వారిఁ దెల్పెదన్ విను మనమా.

చ. హితులు విష గ్రహజ్ఞబుధబృంద కవీంద్రపురోహితు ల్హితా
హితులు ధనార్జనాదనృపకృత్యనియుక్తులు నైంది కేవలా
హితులు దళావళాశ్రితసమృద్ధిరమాహరణేచ్ఛు; లౌట నా
హితమును నట్లె కాఁ జతుర వృత్తిఁ జరించుట నీతి ధేనికిన్. ౨౨౩

ఆ. పాత్రభూతు లెస్స బరికించి. యతఁడు
గరయు నొకఁడు నెస్సరయు మనోపుగఁ
బనసపండ్లు దిగెన పరిగ, స్వప్నము గన్న
నెఱిగ, నొసఁగి వెఱఁగుపఱుచు టొప్పు. ౨౨౪

క. పితృదేవక్రియలను విధిఁ
బితృక్రియలె నూక్ష్మ లగుటఁ బితృభక్తుఁడ వై
శ్రుతిశీలతపశ్శాంతా
చ్యుతభక్తుల కొసఁగి పసుపు మున్నతగోతికిన్. ౨౨౫

క. దానము ద్విజరక్షణకును
జ్ఞానము నిజరక్షణకుఁగ శరణమ్ము బొరు మొం
తే నారాయణు:'రాజ్యా
నై నరకం ధ్రువ' మటంచు దీక్షునై యొందన్. ౨౨౬

తే. అలిపతిభక్తి, స్త్రీపుంసపాళి వావి,
యతి పతిత్వము, దిగంబరు లగ్రజాతి
ననుసరించుట, హితవృత్తి నధిపునకి
భృత్యుఁ డొదవుట, నృపదండభీతిఁ జుమ్ము. ౨౨౭

ఆ. చంపి ధార్మికుండు, సతిఁ బొంది మఱి బ్రహ్మ
చారి, బొంకి సత్యశాలి, యార
గ్గించి నదుపవాసి, కేడించి సూసుఁడు,
చెందె ధనియు, నసు విష్ణుశరణి.

ఆ. ప్రణిధి స్వపరగృహాయు, భాషావిదుఁడు ప్రణి
ధ్యంతరావిదుండు నగు ; నతండు
లింగమాత్రకృతుఁడు లిప్సాతిగ ద్రవ్య
దానధనియుఁ గాక తెలియఁ జోరఁడు. ౨౭౯

క. తనుభృత దమనజ సుకృతము
ధనదత్తిన కొనఁగవలయుఁ దత్తద్భృతకమ
ర్దన మజ్జన భోజన లే
పన వసన ప్రసవవహన పరతం బటుకన్. ౨౮౦

క. నానావిధపాతకముల
నాను నృపాహార మెవుడు, నవరాత్రమునం
గాని మఱి శుద్ధకోష్ఠతఁ
గాని తమి న్భుక్తిమెవుడుఁ గడుఁ బథ్యమగున్. ౨౮౧

క. విను, వర్గసమత నృపుఁడు
న్నను, ధర్మాంశంబె హెచ్చునా, తెలుమడి కె
త్తినసీరును దెగి యలరా
జనపుమడికి నెక్కినట్లు చను ముద మందన్. ౨౮౨

క. వెలయించునట్టి యొకమణి
చెలుఁ గానం గొనుము, ధరణి వెండి నువేషో
జ్జ్వలతకు వలదే వాసర
ముల మణులవిభూషణములు భూపతి దాల్పన్ ? ౨౮౩

క. చేయునది రాజ్యమంట, యపు
మే యవధిగ సీఁగువారె మే, మనఁ జన ; దా
మ్నాయంబు సశక్యాను
ష్ఠేయముఁ జెప్పదు ; స్వశక్తిఁ జేయఁగఁ జెప్పున్. ౨౮౪

వ. మనుదండధరాదులు విశేషించి దోషం బెఱింగి దండించియె ధర్మపరు లనఁ బరఁగిరి; ప్రజాపాలనంబు పనిగాఁ బ్రజానాథుండు బహుముఖంబులం బుట్టిం పం బుట్టి విరాట్స్వ్రమాట్ప్రకృతి వేదోదితశబ్దవాచ్యుం డై దేవసదృశుం డగు మూర్ధాభిషిక్తుఁడు సోఁకోర్చి యిలకు నగువలఁజుల్కు తీర్చినంగాక జన్మంబు నఫ

లం బగునె; కేవ లేంద్రియప్రీతి బందీకృత పరకళత్ర పథికపరిషత్ప్రహరణ ప్రాప్తవిత్తమ్ములఁ బాటచ్చర ప్రభులకు జాగదే? యింత లాంపట్య మేమి పని యని యవనియెక సవన వైముఖ్యంబు చెల్ల; దెట్లనినఁ దౌర్జ్కృత యుగంబునఁ గృతవీర్యనందనుండగు సహస్రబాహుం డాత్మీయదోస్స్తంభ సంభృత యగు నీవిశ్వంభర నేక్ష్వేపంబున నేనాఁట నేపీట నేత్రోవ నేక్రేవ నేవేళ నెవ్వఁ డేమి సేయం దలంచు నవ్వ తండందు నని ముసల చాపాది శస్త్రాస్త్రధారియై తోఁచి యాజ్ఞ యిడు; నట్లాజ్ఞ యిడ నంతిమం బగు నీయుగం బున యుగానుసారంబుగా మితసారం బగు రాజలోకంబునకు శక్యంబుగాదు గదా? యొక్క రాజలోకంబున కన నేల? యిక్కాలంబునందలి భూసురులకు నక్కాలంబునందలి భూమిదివిజులకుఁ గల శక్తి యున్నదె? యొక్క బాత బుందు కదలినీరు గ్రుక్కఁగొనియె, నొక్కవిప్రుఁడు స్రష్టసృష్టికిఁ బ్రతిస్రష్ట యయ్యె, నొక్క బ్రాహ్మణుండు బ్రహ్మదండంబున బ్రహ్మాస్త్రంబు వారించె, నట్టియనుష్ఠానంబు మాకు లే దిందేమి ప్రయోజనం, బని శక్త్యనుష్ఠానంబు పేరికి విడువవచ్చునే? వీ రితరుల కుపాసనీయులు గాకపోయిరె? కావున సావ ధానుండవై శక్తికొలఁది శ్రుతదృష్టంబు లుపేక్షింపక రక్షణశిక్షణంబు లాచ రించుచు నశక్యంబున కార్తశరణాగతరక్షకుం డగు పుండరీకాక్షుమీఁద భారం బిడి యనహంకృతిఁ బ్రవర్తిల్ల నెల్ల సంసిద్ధులు కరస్థంబులగు. నది యట్లుండె, నట్లయిన పట్టబద్ధుండగు రాజు ధర్మంబునందు దృష్టి యిడి నడవవలయు; వరుణ వైశ్రవణ వాయు వైశ్వానర వాసవాదుల జన్మంబులును బహుభివాంఛ్యక్రియా లబ్ధంబుల భూర్భువస్స్వరామలగు నిజ్జగంబులును ధర్మప్రతిష్ఠితంబులు కావునఁ దదాచరణచణుండవై బుణత్రయంబును నీఁగి సమానుండవై ధర్మ శ్లోకుండవై రాజ్యపరిపాలనంబు సేయు మని యభిషిక్తుం జేసె. నిది మదీయ శక్తిప్రభావం" బని యంబుజాలయ కానతిచ్చె. ౨౦౪

## ఆశ్వాసాంతము

శా. దుగ్ధాంభోధిమహాగృహోత్సుక, సుధాంధోబృందచూడామణీ
రుగ్ధారాళబలీకృతాంఘ్రియుగ, కారుణ్యంబునిఃధూభవ
ద్వ్యగ్ధాహ, ధృతమంథ. సింధురవరార్తిచ్ఛేదివిదోశ్చక్రక, శ్రీ
ముగ్ధాలాపరసాదరా, కృతవలాన్మూర్ధన్యవాదోద్ధరా ౨౦౫

క. కరధృతదరారివితరణ
పరిపాలిత తొండమాన్నృపాలక, పునరు
ద్ధరిత నరస నృపబాలక,
శరణాగతపేదధీ, భుజంగాశయనా. ౨౮౫

## మత్తకోకిల

కుండలిద్విషదగ్ర కేతన, గోత్రభిద్ధ్రుమ హారి దో
ర్దండిమోత్పులకీకృతాంగక సత్య, దైత్యకురూ క్షపా
కృందతత్వ, యశోవిధీకృత పాంథ వేయ, కపర్ది కో
దండఖండనపాటవాంచదదారదారణనేమీగమా. ౨౮౬

శా. ఇతి సింహాచలసంభక్తకేసరిపదాభీష్టాన్ననాపుణ్యాల
బ్ధదురుట్టంకణ పొట్నూరివిజయ స్తంభోపలోట్టంకితాం
కదృప్తేష్టాక్షర క్లృప్తరాయనృపసంజ్ఞానక్రమోత్కృష్టాముక్తమా
ల్యద నాశ్వాసపథంబు నాలవది హృద్యంబై మహిం బొల్పగున్. ౨౮౭

చతుర్థాశ్వాసము సమాప్తము.

క. కొనిపోయి ధర్మగేహిని
కనురక్తి నొసంగఁ బొంగి య య్యమయును దేఁ
వు నిజ స్తన్యంబున బలిఁ
బెనిచె న్గో మెప్ప నిట్లు పెరుఁగఁ గ్రమమునన్. ౬

సీ. వాతెఱ తొండిక్రై వడి మాటలాడదు,
కుటిలవృత్తి వహించెఁ గుంతలములు
అక్షులు నిరులు రా నటుగంటఁ గనుఁగొనె,
నాడించె బొమగాని యాననంబు,
ననుగామ ల్నెగయ వక్ష ముపేక్షఁ గదకొ త్తెఁ,
బాణిపాదము లెఱ్ఱవాఱఁ దొడఁగె,
సారెకు మధ్యంబు దారిద్ర్యములె చెప్పె,
బొ చ్చోర్వి కిటు తోఁగఁ జొచ్చె మేను,

తే. వట్టిగాంభీర్య మొక్కఁడు పెట్టుకొనియె,
నాభి, నానాఁటి కీగతి నాఁటి ప్రియము
చవుకయైనట్టి యిచ్చటఁ జనదు నిలువ,
నను చు జాటినకరణి బాల్యంబు జాఱె. ౭

శా. హేమాబ్జాంగ విభావరారుణిమవక్త్రేంద్రు ప్రవాళించ ద
ద్వ్యామారత్నము వొంద దయ్యె మును దత్తద్వర్ణ యుక్తాఖ్యలన్,
శ్యామాంకం బళి గర్వధూర్వహక చచ్ఛాయాచ్ఛటం గాంచెఁ నోఁ
గా మున్నూర్వి 'శిరఃప్రధాన' మను వాక్యం బెమ్మెయిం దప్పునే. ౮

క. ఆయత భుజైక చక్రుం
డా యదుపతి దొమ్మి గెలువ నటచు మరుసి కా
లాయనచక్రవరంపర
లోయన నుంగరపుఁగురులు యువతికి సమరున్. ౯

తే. సకలసీమంతినీలోక నమతిగాయి
బాగ్యవర్ణాపకులు వ్రాసెఁ బద్మగర్భుఁ
డనఁగఁ గర్పూరతిలక రజోవదాత
ఫాలమునఁ గుంతలశ్రేణి పదఁపి కళలు, ౧౦

శా. సైరంధ్రుల్ పయి కెత్తి కజ్జలముఁ బక్ష్మశ్రేణికం దీర్ప వా
లారుం గన్నుల మీఁదు చూచు తటి ఫాలాంచ చ్చతుర్థీనిశా
స్మారేందుం గనె వక్త్రి; మక్కనట గాఁ బర్వెందుఁ దాత్మ ప్రభా
చోరుం డుండఁగఁ దన్నుఁ దద్గతవిభా చోరం బనున్ లోకముల్. ౧౧

చ. కనుఁగవఁ దన్నుఁ గెల్వఁగ మృగం, బల సూనున కిందురేఁడు సే
నని రుచిదక్కఁ దత్పరిమళాఢ్యత లేమి నతండు గొంకఁ, దా
వినుపఁ జనన్ 'బగం దనదు నెత్తుటఁ బొట్టిదుకొంట కాక వా
నను ?' యనన్మృగం బమరుఁ జానకు ఫాలము పచ్చికస్తురిన్. ౧౨

తే. కడఁచివిలు చేఁది గుటి కీలకటిని నిలుపు
మరునికువలయశరముక్తంపములఁ బోలుఁ
దార కటకకంటి పై సారె చేరిచేరి
వేగ మఁగుడ సలజ్జ దృగ్విభ్రమములు. ౧౩

తే. నవ వయస్స్పృధు మదముచే శ్రవణ కూప
ములఁ బడెడు శంక నలువ చాపలము లుడుగ
విడియె శృంఖల లనఁ గాటు కెడిన దీర్ఘ
పక్ష్మరేఖలఁ గనుదోయి పడఁతి కొనరు, ౧౪

చ. అనయము రాఁగ మొచ్చ నహశాననచంద్ర కటాక్ష పంక్తి వ
ర్తిన నము శంకఁ గణ్ణ మను శ్రీ మణిపెట్టుఁ జెంగి చెందుఁ గొ
ట్ట నవనిఁ బద్ధ కమ్మ మగఁడం గొను నంతకు నంసపాళి నం
గన యిడి దాఁచు పేరఁ బెర కర్ణము కమ్మ పయిం దళుక్కనన్. ౧౫

శా. నాసా చంపకత న్సుగంధ మచటన్ రా భృంగముల్ గ్రోలనం
త్రానం బొందియుఁ, బల్కుచో నలము వక్త్రం బేల నా నేటి ? కం
దే సౌరభ్యము లేమ. కుందములు గావే దంతము ? గ్లానినాఁ
దాన క్కిన్ బ్రతిబింబ దంభమున నేలా ప్రాలఁ దజ్జాతికిన్ ? ౧౬

తే. శంఖ సామ్యంబు రా మున్ను జలజభవుఁడు
నరసిరుహవక్త్రనేత్ర కంధర యొనర్చె,
జవ్వనము వచ్చి వెండి సాక్షాత్కరించు
శంఖమున జేసె నును గంధసారచర్చ. ౧౭

యూరువుల కెట్ల చన్నఁ బైఁ దారు మోచు
గొడుగులును నల్ల కలశముల్ గుబ్బలు గావె. ౩౧

క. వలరాజు కుటుంబము న
గ్గలముగఁ బోషించు కలమ గర్వము లయ్యెన్
బొలఁతుక జంఘ లతిశ్యా
మల మంజీరస్థ నిబిడ మరకతకాంతిన్. ౩౨

తే. ఉఫిద నిద్దంపుజంఘల సవతుఁగోరి
కలమగర్వంబు లడఁచు లోఁ గంటకములు,
దాతుటుల మించి మఱి దివసక్రమమున
నిలువ కవి బాహిరము లైసఁ దలలు వంచు. ౩౩

చ. ఇలఁగల వస్తుసంతతుల కెల్లను గచ్చిదు మాన్యభావ పా
టల రుచి కేమొ వేలు యొక టా లిఁక వచ్చునె? లక్క నీట మ
మ్మలమిన దేంత ముగ్ధ యిది యంచుఁ బదాబ్జము లంగుళీముఖం
బుల నగు నట్లు మించునఖము ల్మొలయన్ గొమరారు నింతికిన్. ౩౪

క. లలనోవరివద కచ్ఛప
ములు బలిమిమెయిన్ గజ ప్రభూతగతి శ్రీ
విలసనముఁ గొనఁగఁగాదే
కలిగెన్ గజకచ్ఛపోగ్ర కలహం బుర్విన్. ౩౫

తే. తరుణి తనుకాంతియెదుట నూతనహరిద్రి
తులకు రాలేక యత్యంత మలిన యయ్యె;
నౌటఁగా రాత్రియన నిశ యనఁ దమిస్ర
యన విశీథిని యన క్షప యనఁగఁ జరగె. ౩౬

సీ. అయ్యిందువదన ధరాంగన గావునఁ
బ్రాజ్ఞ్యత్రిఁ బొరుగుల భాగవతుల
గృహములందు మరాళి కైకావళి హరి
జీ మనోజ్ఞా ప్రసగ్వేణీనమాఖ్య
లమర బనించి వయస్యలై నాగక
న్యలు పుత్త్రికావివాహములయందుఁ

బాడు పద్మాలయా పరిణయామేయగే
యముల ననంతు కల్యాణగుణము,

తే. అద్భుతం బొప్ప విని విని యతనిఁ గవయు
బుద్ధి ప్రాగ్జన్మ సంస్కారమున జనింపఁ
దదవతారానుమేయ కథాసుధాను
కలిత లీలానుకృతుల వర్తిలుచు నుండి. ౩౭

సీ. తమతండ్రి శ్రీశ దత్తశ్రీలు గృహమునఁ
ద్రవ్యితంతములయ్యెఁ దనదు తొంటి
స్రగ్వినిర్మాణ దాస్యం బనుత్సేకత
జరపుచుఁ బ్రజ్ఞ వైష్ణవపురాణ
సంహితావ్యాఖ్యా రచనఁ బ్రౌఢిఁ గడుపుచుఁ
గట్టెదుకమ్మ చెంగలువ విరుల
తోమాలె లలకలు దువ్వి కంతునకు [1] బా
ణనిబద్ధఖేటకం బనఁగ సీల

తే. వృషకకుద్రేఖ నెరమ కొక్కింత యొఱఁగ
నిడిన ధమ్మిల్ల వలయంబు నతుగనందుఁ
గొంతనే పర్ధిఁ గీలించి కూపవారి
నీడ వీక్షించి క్రమ్మఱ గూడ నునుచు. ౩౮

ఉ. ఆ నవలా యలంతి పసుపాడి, దుకూలముఁ దాల్చి, కుచ్చెలన్
గోనలఁ దావు లుప్పతిలఁ గంకుమ తేటల సిగ్గు దేరఁగ
ప్రావన నాభిఁ దీర్చి, విత్ప బద్ధ లతాంతము లర్థిఁ గొప్పునన్
బూని యొకింత నే పునిచి వుచ్చి చెలిం గని మెచ్చ నూర్చుచున్. ౩౯

క. మీ పాడిన హరిచందము
లే పాడిగఁ దలఁప వచ్చు? నితఁ దేవతులం
గాపాడినవాఁ డనఁగ
శ్రీ పాడినఁ దన్ను వలచి, తొయ్యలులారా! ౪౦

---

[1] కూర్పరబద్ధఖేటకం

వ. అని యిట్లు త్రపాకరంబున నుపాలంభదంభంబుగాఁ జేయు పునఃపునస్స్మ
రణంబున నంతఃకరణరాగంబు దేటపడం దెలిసి తోటి లేఁబోఁటి కైటభారియేక
నాటుకొన్న కన్నెతూర్పు లజ్జావశంవదయై వెలివిరియంగానీక పుటపాక
నికాశం బగుకాఁకఁ జీకాకుపడి నాఁడునాఁటికి నగుచున్నట్లు గిటగిటనగుచున్న
దింత నియ్యింతి యెరవు మాన్పి మనలను గుట్టెఱుంగనీయని యింగితం
బెఱిఁగి వలచుకొని చింతావనోదనంబు సేయకున్నం బ్రమాదం బని నవ్వుచు
నర్మగర్భంబుగా నిట్లనిరి. ౩౩

ఉ. ఎవ్వతె వట్టిపో నెరసు లెన్నక మానరు ప్రాణకర్తలం
దవ్వలి నున్నఁ గాఁకకతన, న్మతి హారలు వక్త్ర లైనఁ దా
రెవ్వతె నొల్ల కొక్కటయి యింద్రుఁడు చంద్రుఁ డటంద్రు. తోటి దా
నివ్వలఁ దేరకత్రె యగు, నిట్టివి నితలం వేగనే చెలీ. ౩౪

క. అనుటయు నెంనగ వడఁదుచుఁ
గన లించుక తెచ్చి యొరుగ జమచు నయ్యం
గనలఁగ కందుకనికరముఁ
గొనిఁ బ్రేయుచుఁ గెంను చూచుకొనుచుం బలికెన్. ౩౫

క. విడువక పీ గానము సోగ
నిడుటయు, మతి పాడుఁ దనుట యెగ్గే? పాసెం
బడగు వారే పేదలె?
కోకిమేలు గట్టకుఁడి యతనిఁ గాని పని యేలా ? ౩౬

శా. పోసం దన్న, వయస్య లిట్టవి, రగుం బో నిక్క, మిం కిప్పుడే
కావి, ష్మిం కొక కొంత సేవలికి నే కానీ. సఖీ, యెల్లియే
కానీ, నీమదిఁ దన్నునోక్ష గుణమూ త్రానీ, తదవ్యాయము
త్రానీ, చిందిమఁ జింత నీ కతనిపైఁ గా కెవ్వరిం దేల్పె దే ? ౩౭

సీ. నఖముఖోజ్ఝిత వరాజ్యభముక్త బాష్పంబు
వటిమ దీవవఁ జిటిటలు దెలుప,
వారి నుపాంశుకాశ్వవ్ర వ్రాత్యప్రాత లక్ర్పాక మధ్య
పార్శ్వ దుహాక్ష్మ్రవకంపమాలు దెలుప,

నొదవెడు గాద్గద్య మదిరిపాటునఁ బల్క-
రింపఁ బుట్టెడు కేకరింత దెలుప,
వలవంత వినువు కాంతల పుట్టు దూషించు
కారణంబుల తొంటి కతలు దెలుప.

తే. వలఁతఁ బానువుపైఁ బొరలాట దెలుపఁ,
దెగువ లోలోననే నవ్వు నగవు దెలుపఁ,
గలఁక మీఁదివనిలేని కనరుదెలుపఁ,
బొలఁతి రేలు నీయున్కియే పులుగ గాదె. ౬౦

చ. ఎఱుఁగరుగా యొకద్భుతము! నీచెలి దీర్ఘికఁ దీర్థ మాడ నా
యమునఁ దగిల్చి పోవఁ దన హారము; పోయిన నేనుఁ బోవుదు;
న్నఱుకువ వెంటఁ బోవ జలమగ్నత నౌ నదిసున్న: మైనఁ దాఁ
గఱకతఁ బెట్టి సొమ్ము దుగుఁ గాని నిజార్తి యెఱుంగ దేమియున్ ౬౧

చ. అనిన మరాళి పల్కె, పన వా హరిణీ, యొకనాఁడు కస్తురిం
గొని యిదు బొట్టు నా కనుచుఁ గూర్మి నొసంగిన?, బెట్టుచుండఁ, బా
ఱునుచు మొగంబు ద్రేసినటు లౌ తన యూర్పుల నింకి యింకి పో
యిన వలుబేంట్లు గోరఁ గొని యెత్తె పట్టెను మాటిమాటికిన్. ౬౨

మ. అనినన్ ద్రస్వికి వల్కెఁ, దన్నుఁ జెలులారా, నేలతాదోలఁ జి
క్కన సూఁపం దెగి ద్రాల, దీని చనుద్రేకం బ్రేకియ: దాల్తునో
యని వట్టం, దిన మధ్య మార్క రుచి శీర్యన్నంజరు ల్వోని వా
దిన పాలిండ్లను బెండుబొమ్మగతి నుఁ దె న్నెదిటం బల్కనై. ౬౩

వ. అని తన యవస్థఁ దోఁప నాడిన ననాదరయుంబోలె వారల కిట్లనియె. ౬౪

క. అప్పఁగఁ దీర్పఁగ మిక్కిలి
నేర్పుగల వయస్యలట్లు నెలఁతలు మీ మీ
నేర్పునఁ బలికెద రక్కట
యేర్పర మీకిక విచార మేటికిఁ జెప్పఁడీ. ౬౫

వ. అని మేలంబు సేసికొని తేలి పోఁబలికి పుటపాక ప్రకారంబున వియోగ దవథు
భరం బవ్వహారత్నం బతఁడికొని యుండియు నుండలేక నిశానమయంబుల
నొక్కొక్కమాటు తనలోన. ౬౬

పాటు లేనగావున నడంచి మఱి మొఱంగ ననువుపడక యందంబుగూడఁ కాని వారి కిట్లనియె. 20

తే: 'నాఁడు మన మున్న నెట్లొ పూఁబోఁడులార,'
యనిన, వారలు మఱఁద నా యమకు వనిరి
'యింతి, నాఁ డుండ కెందుఁ బోయితివి నీ ?' వ
టన్న నచ్చెరువడి వారి కటివ పలికె. 3౨

తే. 'సకియలార, త్రైకాలిక జ్ఞానవంతు
లైన ఋషులట్ల పలికెద, రంత యెఱుక
యెదఁ గలిగెనేని యెఱిగింపుఁ, డేను మొదల
నెవ్వతె' మున్న ; మఱి వార లిట్లు లనిరి. 23

మ. "దివిజద్రుమ వనవంబుఁ గాంచిన సపత్నిం జూచి. చూ పోవ. కిం
తవుజిల్లుంబని యంత నేసి, మది నీ ర్వా... ల్పందడిం
వ, విరిం బోక, ద్రుమంబుకై కొని, వతి న్మందన్న మ్రా నెల్లఁ దే
నవధిం బెట్టిన సత్య నీ వహహ ; కాంవా కామినీ !" నావుడున్. 2౪

వ. గ్రక్కునం బ్రత్యుత్పన్నవిజ్ఞానయై, గృహదీపికారోపణంబునం గృహగత పదార్థంబు లొక్కమాటె దృగ్గోచరంబు లగునట్లు. జన్మాంతరంబున నయ్యనంతునితోడి క్రీడాప్రపంచంబు సద్యస్సమనుభూతం బైన తెఱంగునం దోఁచిన. 2౫

ఉ. వాలిక కిన్నులం బొడము వారి నక్షుల మాత్రితశ్రవో
గోళక మై తదంతికవుఁ గుంతలవల్లికిఁ దల్లితోడుగా
మైలవలి న్నన ల్నిగుడు మైఁ బులక ల్నిగుడన్ శ్లథాంగియై
సోలినఁ జూచి డెందములు సుట్టిన హాయని బోటు లర్మిలిన్. 2౬

ఉ. ఎంతకుఁ దెచ్చెనే నరసిజేక్షణ చెయ్దము ; లిందుమీఁద జ
న్మాంతర వర్తనంబు హృదయంబున కిత్తటి నెచ్చరించి గో
రంతలు గొండలంత లగు నట్లుగఁ జేసితి, మంచుఁ గూపికో
ద్వాంత సతాళవృంత మృదు వాత హిమాంబుకణాళిఁ దేర్చినన్. 2౭

క. తెలిసి కను దెఱచి వెండియు
జలజేక్షణ తన్ముకుంద చరణస్మృతిని

శ్ఛలతఁ గను మొగిచి మఱి య
శ్రులు తెప్పలఁ ద్రోవఁ దెలచి జాఱి నఖశిఖోన్. ౭౮

క. ఏ రెవ్వ రనుటయును, కృం
గారిణి, మే మురగకన్యకల; మింతకు ము
న్నారుణి కేతెంచితి: మన
నారామలఁ గౌఁగిలించి, యార్తి స్ఫురితన్. ౭౯

ఉ. అట్టి మురారి కప్పు డనుఁగై, మఱి యాశ్రితపేశఁ గ్రమ్మఱం
బుట్టి వియోగవేదనలఁ బొక్కెడు నీ తను వేల? తండ్రి దా
నిట్టుగ నన్ను నిం కొకని కియ్యక తాల్తున. యోగశక్తిఁ దో
బెట్టెద దీని, వెంటియు నుపేంద్రపదాంబురుహంబె పట్టెదన్. ౮౦

క. అది యెంతె భక్తి, యెవతే
నెద విశ్లేషైకభీరు వృత్తిప్రియలా
భదశన్మోయిఁ దొఁగించిన
హృదనన యదిగాక యున్న యవి వైరిముల్. ౮౧

తే. అనిన వారలు వల్కి. "రా యదువతంస
మెందు జన్నాఁడు? విను, రంగ మంద వెల్చె
వేగఫా రేల? యతఁడ నీ విభుఁ దగుటకు
నర్హనాధుం సివ్విటి హరి భజింపు. ౮౨

చ. అలుకకు" మన్నఁ దేఱి: మఱి యంతటనుండియు వేళవేళ నెచ్చెలు
చ్చెలు లిడు తెల్వలు న్మగుడఁ జింతల నంతమనంబులు స్వమా
కలితత మించె సౌమ్మదని కార్శ్యమునన్ హృదయంబునన్సదా
వలవలగాఁగ నీలమూల ఖన్నసరం బయి నిర్మలాంగికిన్. ౮౩

తే. ఎలని యేప్రొద్దుఁ గనువొంద నీక మరుఁడు
కలహమున కంక కాఁడయి కాలు ద్రవ్వఁ,
దాండుబహుళ పాపరంపరలు వెతల
కింటిలో నేదుముల్ల యెట్టి నిందుముఖికి. ౮౪

మ. తలిరుం గైదువుజోదునానతి వధూ ధైర్యంపుఁ బెన్కోటఁ గం
దళితాహర్ముఖయంత్ర కారుఁ దలుక న్నానాఁటికిం ద్రెళ్ళఁ గో

మలమా రంధమరీచిదీవకశికోష్మం జూచి యే యుం దశ
ర్దళ పాథోరుహకోహ నాళకుహరోద్వ్యచ్ఛంచరీకాళ్మ ముల్. ౧౫

సీ. వొంత ఘటయంత్రతనరము ద్రివ్వుచు జవించు
మసువర్ధృతి దూల మధ్యాహ్న మంత్రవాది,
సురుచిరవితానదండక కొసుంభధారి
తుహినధారాగ్నిహోంగి బిందువులు సెదర. ౧౬

ఉ. తామరసావతాక్రమముఖి దంష్ట్రిత విస్ఫుట మల్లి హల్లక
స్తోమరజశ్ఛటాంగక మధుద్యుతితార వియద్ద్రిచంద్రక మో
ద్దామ విత్కృవనూ ప్లవగ ద్రైవ్యరుతోత్థ రథాంగ పోత బిం
తాముయ నిద్రలం బొలసి తాపముసేయఁ దొడంగె నింతికిన్. ౧౭

వ. ఇ తెలంగిన సకలకాలంబుల నారటంబునకు నూరటఁ గానకుండియు నప్పుండరీకాక్షి యందుండు నప్పుండరీకాక్షు నారాధనంబున నా రాధారమణుం గ్రమ్మఱంబొంద డెందంబునం దలంచి. ౧౮

సీ. పద్మాస్య ప్రతిదిన ప్రత్యూషమును మౌన
నియతి మేల్కని, నళీచయము మ్రోల
హేమపాత్రిక హరిద్రామలక్యాదిక
స్నానీయవస్తు వ్రజంబుఁ గొనుచు,
ధౌతాంశుకంబులు తడియొత్తులును దేర?
నంతఃపథంబున నరిగి, నిజగృ
హారామదీర్ఘిక ననుసంహిత ద్రావి
డామ్నాయయై స్నాన మాచరించి,

తే. పర్ణసీలేళ పూర్ణసౌభాగ్యదాంగ
ధూతి చకచక లీరెండతోడ మాఱు
..మ, నిడువెండ్రుకలగుంపుమలఁచివైచి
వేగ వెసవెత దడి యొత్తి, విధియుతముగ. ౧౯

ఉ. కుంచరాగ్ర నెన్నొసల గుమ్మడిగింజతెలంగు పొండుమృ
ద్బిందువుఁ దీర్చి, చెందిరము పేచకశీర్షము పై బలె స్గబిం

జందురకావిజీ బమరఁ, జల్లని రేయిబి తట్టునన్నళి
న్వింధులఁ దేల్పు, నూనెముడి వెంద్రుకలుజ దడితావు లీనఁగన్. ౯౦

తే. కోటి గట్టిన చెంగల్వ పూవు జెత్తుఁ
దరు వరిణ తోరు కదళి మంజరియుఁ గొనుచుఁ,
బోయి, గుడి నంబి విజనంబుఁ జేయ జొచ్చి
మ్రొక్కి వేదికఁ బలువన్నె ముగ్గు వెట్టి ౯౧

తే. కపిలగవి సర్పిఁ బృథు దీప కళికఁ దీర్చి
ద్వయముతో వక్షమునఁ గల్వదండ సేర్చి
యగరు ధూపంబు లిడి శర్కరాజ్యయుక్త
హృద్యకదళీఫలాళి నైవేద్య మొనఁగి. ౯౨

క. ఖండిత పూగీ నాగర
ఖండంబులు ఘన శశాంక ఖండంబులచే
హిండితమగు రాంబూల
మ ఖండస్థిరభక్తి నొసఁగి కదలి చెలులతోఁ. ౯౩

తే. చెలువ గర్భగృహ ప్రదక్షిణముఁ జేసి
వినతయై మౌళి శఠకోపమును ధరించి
చరణతీర్థముఁ గొని తత్ప్రసాదలబ్ధ
మైన మాల్యముఁ దాల్చి గేహమున కరుగు. ౯౪

క. ప్రతిదినము నిట్లు భని య
చ్యుత పూజ యొనర్చి వచ్చి సుదతి వియోగ
చ్యుతధైర్య యగుచు నయ్యదు
పతి గుణములు ద్రవిళభాషఁ బాడుచునుండఁన్. ౯౫

తే. మొదల నాముక్తమాల్యద-మదనతాప
తరణి వెనువెట్ట వేఁగిన దక్షిణాశ
మత్స్యశోష్మకుఁ దుదముట్ట మాఁడు నపుడుఁ
దొంఁగె నన పుత్తరాశకు, దొంఁగెఁ దరణి, ౯౬

## వసంతర్తువు

చ. తెలియఁగ వచ్చె నట్టితఱిఁ దిగ్మకరుండు ధనాధిపాశకై
తొలఁగినకారణం, బతివ దుర్వహ దీర్ఘవియోగవహ్ని వె
ల్లలమిన తద్దిశం దగిలి నట్టి తనూష్మ ఘనీభవన్మహా
జలమయశంకర శ్వశుర శైలము కోసల చల్వఁ దీర్చుకోన్. ౯౩

తే. కినిసి వలఁతేఁడు దండెత్తఁ గేలు వగుట
మీన మిథుఁ దోఁచు టుచితంబు, మేష, మేమి
పని యనఁగనేల ? విరహాళ్యఁ బాంథయువతి
దాహమున కగ్గి రాఁగఁ, దత్తడియు రాదె ? ౯౮

చ. ప్రియ పరిరంభణ ప్రథిమపెల్లఁక నామని వచ్చి చేయుఁగా
వ్యయ మని సీతునందె చెలువ ల్పెదవు ల్దడుపంగ వచ్చెఁ దా
రయమునఁ బేర్చి యా ఋతువు : రాఁ జలి విచ్చి తొలంగ రయ్యవ
స్థ : యుచితమే కదా 'విపది ధైర్య' మనం జనుమాట యింతకున్. ౯౯

ఉ. స్పష్ట బహుప్రణం బయిన సీరున కల్కి నికోష్ఠపల్లవో
చ్ఛిష్టముఁ గొన్న దిమ్మధు వి సీయన కింతులు మోవిఁ దన్మధూ
చ్ఛిష్టముఁ గొన్న రొమ్ముచ్చె మఱఁ జేసిన. వారు కృతం బెఱింగి వి
స్పష్టముగా నొనర్చిరి వసంతున కూఱట దోహదంబులన్. ౧౦౦

మ. మునుపే చంద్రబలంబు గల్గి మలయంపుంగమ్మ లేగాడ్పుఁదే
రున నేతెంచు లతాంత బాణునకు సూర్యుండు న్మహిం గ్రొత్తగా
ననుకూలించె బలంబున న్విరహిణీ ప్రాణాపహారంబు నే
యన యూహించు విధాత కృత్య మది యేలా మాను నెవ్వట్టునన్ ? ౧౦౧

క. మలయ కటకోటజస్థిత
కలశీసుత సేవ నిట్టు గనెనొ తదాశ
నిలఁ దనఁగ నలనవృత్తిన
మెలఁగుచు నాపోశనించె మిహికాజలధిన్. ౧౦౨

క. మలయతరు న్యాయమ్ము యిలఁ
గల తరువులకెల్లఁ జేయఁగా వలసెఁ జుమీ

యలరించు నేపంబునఁ బరి
మళితములుగ ననఁగ నచటి మారుత మొలసెన్. ౧౦౩

ఉ. కుప్పసము ల్వదల్చి, వలిపంబుల నొత్తిరి హత్తి వేఁడిగా
నిప్పులఁ బఱ్చు గాడ్పుల కటీరుఁ, గ్రమంబున ఘర్మ శంక మై
నుప్పతిలంగ దోమతెర లుప్పర మెత్తిరి, దక్కి రూష్మముల్
దెప్పరమైన లోహళకటీ ప్రకటీకరణంబుఁ గామినుల్. ౧౦౪

మ. అరుణాంశుండు హిమర్తువం రజని దీర్ఘ క్రాంతి పుష్పర్తువా
నఁ కలోష్ణీతుఁ దౌచు మున్న యిదుట న్వ్యామాకుదాలేప నం
కరసాంద్రా హ్వశిఖాయుతస్థితిఁ గొనెన్; గాకన్నఁ గాల్జప
ర్త్రి రుతం బెట్టు చెలంగు మానకవిత శ్రీకర్థ దంబోళియై. ౧౦౫

తే. మృగమదాలేపమును మాని రగరుకలనఁ
జన్నఁగవ మీఁది కొప్పిరి జన్నసరము,
నొంచె కురువేరు పోఁచకుఁ గంటగింప
రైరి తుహిమెఁగు సరపుప్పొలం దళిసలు, ౧౦౬

చ. చిలువసుధారసాధరల చెల్వొప్పఁ బుక్కిటితావిఁ డీయనై,
వలపుల నందు తప్పి త్రియల వక్త్రవిషజ్వలనోష్మ నొట్టనై,
వెలువడి తద్గుణద్విలయ వేఁడి జామీ యన మ్రానపట్టుల్
తలిరులు పుట్టుటల్ గలుగఁ దార్కొనెఁ జందనశైలవాతముల్. ౧౦౭

మ. మదనస్యందనతా స్వవృత్తిఁ దెలిపెం, దాటీ దూష్యద్వల
న్మృదువాతం బడవక్త్ర పాదప లతా వృంతావళీ మూలదం
ధ్రదళ త్పంకజకర్ణికాగణ హరిద్రాభంగ భా భాసుర
చ్ఛదన చ్ఛద్మ వివర్తి కాంచన కన చ్చక్రచ్ఛటాసీత్కృతిన్. ౧౦౮

వ. తదనంతరంబ. ౧౦౯

సీ. హ్మా వశా రక్త రాంకవ, మటణ్యాసీమ
ధూది తారుణిమ, వల్ల్యురగరసని
క్రోధ్గతి. తగుగదుత్మ ద్గరుద్గణము, క్రీ
దాహార్యజీమూత రోహితంబు

నవ మిళింద ప్రసాహాయ్యక నిమంత్రణ శోభ
నాశ్చత ప్రవతతి, వాయన విరక్త
పరభృతాప ప్రాప్త పత్త్రిక, మాలతీ
ప్రాసామయావహార్ద్రిష్ట తజము,
తే. ప్రమదవన వనదేవతా సముదయాంగ
రాగ. మినజ హరిద్రిగ్ధ త్రాణ కాణ
కషణద శిశిర దళాంత సంక్రాంత కాంతి
ఘనమణిశలాక, ఓగురాకుగలయ మొలిచె. ౧౧౦

తే. శరవిధుల మాప్యములు దీతె మరున, కిట్టి
యనరున జయింతు మని కదా యద్దినాళి
గ్రూరతిథి గృష్టరజనీంద మైత్రి గనియు
బెద్ద చివురాకు బట్టెనపెట్టు వదిరి. ౧౧౧

తే. అనసి సపుడు సవోదితుం డైన యట్టి
మరునకుం గుసుమ త్తు వ స్మంత్రసాని
బొద్దుగోసిన కొనవలి వోలె విరహి
దారకం బయ్యె గింశుక గోరకంబు. ౧౧౨

చ. కినుమములెల్ల గామినుల కొప్పుల సంత నటుంత చేమి ని
గ్గసుగంగ వంసట్లు జనియించె నన ల్మాటి వంగి, జీవితే
శ సమితి గొమ్మలం గరంచి చల్లంగ దక్షిణ కొంగరాగ నూ
ఒనదె యడంచు రాగిలినయట్టులు రాగిలి విచ్చె గింశుకిటి. ౧౧౩

ఉ. నై పుణి జందనాద్రి గహనద్రుమ సౌరభ పీఠ దామ్రవ
ర్ణీపరిలబ్ధ మౌక్తిక మణిప్రకరంబులు దోచి దక్షిణా
శాపవనుండు సల్లవెద జల్ల జనించెన, కాక పీసికే
లా పొంపమంగ నహ్వాలన మవ్వడు నా వసి దోచి గ్రొన్ననల్. ౧౧౪

క. పిరద్రుమిథునమేళన
త్రై రతిపతి యేయ దన్ని హరిశద్యుతి బై
నారేయ బొటమరించిన
నారసముల దువ లనంగ నన లవి షించెర. ౧౧౫

చ. తనయుఁ దరంబునం బొదవి తా మరుచిచ్చుట లుల్లసిల్లఁ గో
లొ్కొను ధరణీజ సంతతికిఁ గొంకక దంతము లిందుకంత ని
క్కినయది యాదిగాఁగఁ జెలఁగెఁ వనలక్ష్మి; గడుం జెలంగఁగా
జను, ప్రియుఁడైన మాధవుని సంగతి మీఁదటఁ జాలఁ గల్గుటన్. ౧౧౬

సీ. మును నన ల్దమిఁ బట్టి, ముంగాళ్ళ, ముక్కుఁజో
 దనలఁ బీలిచి పసర్కొనిన విడిచి,
పసువంపు విరి గొందు లరసి, బాల్యత్రోవఁ
 బెట్టి యీరము లీఁగు పిండుఁ దగిలి.
క్రొవ్విరి దొలుత దొలుత నొక్కొఁడు గని యది ప్రాలు
 తటి దాని పిలఁ బసఁ దాఁకి ప్రోలి;
యాకురాలుపుగండ్ల నానెడు నాన నిం
 తడు గూడి బం కంటి యంగలార్చి,

తే. యెట్టకేలకుఁ నొక తబ్బిఁ బొట్టనిండఁ
 గ్రోలి యవిగాలిఁ గదలినఁ గూలు. నగుచు
బ్రమదవనపాలికలు వేడ్కఁ బట్ట నగుచు
 మధుదినాది క్షుద్రాభ్రమ న్మధుపచయము. ౧౧౭

సీ. మరుదూత మలయాహి గరధూమ్య లనుగళ
 న్మనవిజ రథప దాంజనకళికలు
ప్రాన థావ చ్చిశిరత్యక్త బాష్పముల్
 వికవంచమస్వరోద్భేద వీణ
లబ్ధాగమన్మరం దాసార జంబువుల్
 హిందోళ సాక్షా న్మకుందరోచు
లభిసారికాంశుకోద్యన్నీలగుళికలు
 జాత్యనుల్లననాత్త కావతతులు

తే. చైత్రసంజీవనౌషధీ జాతచేత
 నాత్మజని హేతు తరు పునర్యాయి యువతి
కచవిధూత వసంతికేంగాల చయము
 లళుల పంక్తులు వనుల నల్లాతఁ దొడఁగె. ౧౧౮

తే. ద్విజతఁ గాంచియు మధుసేవ విడువలేక
జాతి బాసిన తేంట్లనిస్వనము గూడ
కానుఁడనో యనఁ గోకిల స్వనము సెలఁగెఁ
దనకు మఱి పంచమత్వంబు దప్పకుండ. ౧౧౯

ఉ. పూచినమావులం దవిలి పూవిలుజోదున కమ్మె మాధవుం
దేచిన శంక; నాతఁ డవియే కొనియే పథికావళీజయ
శ్రీచణుఁ డయ్యెఁ; నట్టిద; యకృత్యముచే నగునట్టి పీడయుం
గోచర మౌనె, దైవ మనుకూలము నై, పరుమేలుఁ దీఱినన్. ౧౨౦

మ. ఉరుశక్తి న్మధుమాసదోగ్ధ విదుకన్ జ్యోత్స్నాగవీచంద్రమస్
స్ఫుర దూధః ప్రవిముక్త మైన నిశిత జ్యోత్స్నాపయఃపూరమున్
విరియంబాఱినగొజ్జఁగ ల్గురియ ము న్నీరైన యక్కమ్మనీ
రు రహిం గూడిన నేర్పరించు గవులై రోలంబకాదంబముల్, ౧౨౧

ఉ. దిగ్గియ నంచ దూఁడు గొని తీర వనేక్షువంక మీఁదుగా
నగ్గత పుల్లకేసరమునందు వసింపఁగ నెక్కనూలి న
న్నిగ్గము నందఁగాఁ దరు మరంద సరోమకరంద గోష్ఠికిన్
వెగ్గల మాడు తేంట్లు మరు విందికి బూనె గుణద్వయత్వమున్. ౧౨౨

చ. నిడుద మధూళిక ల్నదుమనే కొని తీఁగలు సాఁగఁ జుట్టుకొం
చదరి కదార కాచకబకాకృతి సుళ్ళ మెలంగె గాడుపుల్
జడగతి నధ్వసీనపరిషత్పటునిశ్వసితానలం బెదు
ర్పద మఱి సార్చులై చుర చురం దుద సుళ్లుగ స్రుక్కెనో యనన్. ౧౨౩

చ. కురిసినక్రిందిపుప్పొడులఁ గొంచు నగంబుల మీఁదికై విశం
గరుచులఁ గొన్ని పెల్లగసె గాడ్పులనుళ్ళతి మాధవుండు రా
నెరవుఁగఁ బూవు సొమ్మిడి వనేందిర భూమికి వెండి మెట్టదా
మరరవణంబు తాఁ గొన, భ్రమద్గతులౌ మలుచుట్టులో యనన్, ౧౨౪

చ. తరుణులదోనిదాన మధు ధార నశల్వకశాళి సింపఁగాఁ,
దరుణుల మేము గామె యన తద్గతలౌ వనదేవత ల్పురన్
ధర వకుళౌఘ మెల్లను న నల్గనఁ గ్రాయఁగ సించుబుగ్గలన్
ధారసె మధుప్రపూర్ణత మధూకములం బృథు పాండుపుష్పముల్. ౧౨

చ. అలరెఁ బ్రియాళి వోర్తు ప్రియ మాట వసంతముఁ బాద, నవ్వు ద
వ్వేలఁడి నవత్ని 'భక్తికిని వేల్పులు మెత్తురు గాన రాగమం
చలమునఁ దన్నుఁ బాదఁగ వసంతుఁడు దా దయచేసెఁ గాక, యా
యలె నిజశక్తి నా' యనుచు నావనకం గొదవెట్టి నీనునం. ౧౨౩

తే. అధరసుధఁ బ్రాణిజతఁ బ్రాణి యగుచు మౌక్తి
కాంచమాలిక నిడెను నాసాగ్రమౌక్తి
కంబు యనఁ జాలు నన లిచ్చె గళజరిత్సు
మంపు వావిలి మొగ మూర్చు నింప నోర్తు. ౧౨౪

చ. ఘన మగు నాకు ఏలి. తిలకం బటిరి క్తత నున్న, నోర్తు, లోఁ
గవికర మూని, కిన్కఁగవఁ గాయజుఁ గిల్లత యిద్ద తూవుకే
యనువుగఁ గించెఁగాక, మఱి యంక ముట్టక యొక్క చేష్టలె
క నెగడఁ జేసె నంట యిది కల్లనఁగా, నంరించెఁ బూవులం. ౧౨౫

తే. సాంద్రమకరంద వృష్టి రసాతలంబుఁ,
దొరఁగు పువ్వుల భువియుఁ, బూ ధూళి నభము,
నీక్రమత్రయి మాధవుఁ డాక్రమించె
నురు విరోచన జనిత మహాప్మ ఏఁగ. ౧౨౬

క. ఊంవ కొనఁ బడు మధూళిక
యొడికలకుఁ గ్రిందఁ గ్రవ్వి యుండెదు తేంట్లం
నీడలు దిరిగియుఁ దిరుగని
జాడఁ దరు ల్వొలిచె నవ్వసంతపు వేళం. ౧౨౭

చ. శతదళమంజరీ ధవళ చైత్ర నిశామల చంద్రికౌఘముల్
దృత వియదంత కేళి వన వృక్ష లతాంతిరజశ్చట న్గళం
కితఁ గని కామినీ కమన కేళియుఁ బోఁ జెవవా నగాడపి
కతక వరాగ మొక్కడెసఁ గ్రిమ్మి యనచ్చత మాన్పకుండినన్. ౧౨౮

సీ. శైత్యపాండిమలు దుషారాంతమునఁ జేరె
నిరులుకొ స్తాగ్రికవందిరుల విరుల,
వలయ గానము లయుక్తుల కార్శ్యముసఁ జేరె
మలయఁపుఁ గమ్మపివలుల వలుల,

సౌరభోల్లాసము ల్లాతి గ్రుంగఁగ జేరె
నలరారు గొదమ క్రోవులను నెలను,
స్ఫుట జటామస్కరంబులు ప్రతిచ్ఛాయఁ జేరె
నందన ప్లక్ష సంతతుల వృతుల,

తే. స్వభృతపరభృత వినుత రసాలవరిష
దహరవాఃక్లుప్త బహురహఃప్రహరవిహర
మాణ మానవతీ పరిమ్లాని మాని
వారి వారిజవన గంధవాహ మొలసె. ౧౩౯

ఉ. సారెకు గీరము ల్పొరి రసాలము శాఖలలోనఁ ద్రిమ్మరం
గా రహిఁ దన్మధూళికకుఁ గా నళిపంక్తులు వెంట గ్రుమ్మరం
గా రొద మించె నందుఁ జిలుక ల్వనలక్ష్మియుఁ దద్వచస్సుధాం
ధోరుచు లానఁగా సరవణు ల్జనుల ట్లిడి వెంపఁగా బలెన్. ౧౪౦

సీ. ప్రతిహంతృతాత్త కీటత చన్న భృంగసం
ఘపుటంగములచేతఁ గాయమెత్తి,
యమదిశాగత మరుత్ప్రాణియై దదశిరం
గ స్థలాబ్జిశిఁ దమ్మికన్ను దెఱచి,
ప్రాంతఫుల్లాబ్రమ సంశ్రయి తచ్ఛటాహతో
ద్ధతి లేచి చెలిఁ జైత్రుఁ గౌఁగిలించి.
యుఱు పరాగపుశాటి నుద్దండ వాప్యుత్ప
లస్రవత్సీధు రత్యస్ర ముడిపి,

తే. క్రమ్మఱఁ బలాశ కటకాముఖమునఁ గీర
చలితశాఖాస్ఫుటాశోక శరముఁ గూర్చెఁ
ద్రదతికిఁ గాఁగఁ జలికాలఁ దన్ని మంచు
పాండురాంగుండు విడిచిపోవుదిశి మరుఁడు. ౧౪౧

చ. చిగురుఁ బికాళికి, న్పలముఁ జిల్కలకుంపునకు. న్మధూళిఁ దేఁ
టిగమికిఁ, దావి గాలికి, విటీవిటకోటికిఁ బువ్వులుం, దలం
బునఁ గృప నీవియు న్సురభి పుంస్త్వముఁ బాంథులచోటఁ బూనె; న
ట్లగుఁ బ్రజ కోర్కు లిచ్చుతన కాత్మఁ దలంచిన దబ్బ దే యనన్. ౧౪౨

సీ. సహకార ఫలరస సౌరభ్యములఁ గూడి
మాధ్వి మోవులఁ గదంబముగ వలప,
మలయజోదరరత జంభల ఫలత్వగ్గత
శ్రీ మించుచెవులఁ గొజ్జఁగలు మెఱయ
శశికరశోదర చ్ఛదవుఁ బావడ లూరు
చకచకఁ బట్టి పాలికిఁ బెనంగఁ,
ద్రొక్కు తేంట్లకుఁ గాఁక లెక్కింపఁ జెరివిన
గంధఫలీవంక్తిఁ గబరు లలరఁ,

తె. గేలఁ గలవంటకవ్వఁదావికిని బులిమిన
ఘుస్రుణము లు మించ, ననలఁబేరెనఁగ వసన
ములు నమేరురజోవృష్టిఁ బూడిఁ జఱవ
నింతు లెసనిరి పూఁబొద రిండ్లఁ బతుల. ౧౪౩

వ. అట్టి సమయంబున. ౧౪౪

ఉ. కామిని మేఘరంజి మధు గర్వ మిదంతు నచుంచు. లో నిజ
క్షేమముఁ గోరి, పాడి, మణి చిత్ర మరుత్ప్రణతా పరద్యుతి
స్తోమ వలాహకావలులు దోఁచి, ప్రపుల్ల కదంబ కేతకీ
ద్దామ సమీరణాహతులఁ దాపము నీ నొఱగె స్వచేష్టతన్. ౧౪౫

తే. అతివ పూర్ణేందుభీతిఁ ద దశ్మశాలఁ
దెంది యతఁ తందు వికమది తీంద్రఁ దోఁప
మింటివయి నుంట గా దని యింటి పైకిఁ
దెచ్చుకొంటి నటంచు బెఁ లిచ్చ వెతలు. ౧౪౬

తే. భ్రమరగీతిక మాయ విపంచి మీట,
దాన శ్రుతిఁ గూడి మిగలఁ ద ద్రక్తి హెచ్చ,
వే నివారించి లేచి, 'దైవికము నెదుట
యుక్తులు ఫలింవ' వనుచు బి ట్టూర్చి నవ్వె. ౧౪౭

తే. వెంఁది కతితావదం బయ్యె విరులపాన్పు;
మును దదంఘ్రిహతాది భర్త్సనలుగన్న

తరుల, బొదవిన పూలు.. దన కొసఁగునె,
పెంచి తఱివేచి మిగులనొప్పించుఁ గాక ? ౧౪౮

శా. పూజాదంభమున న్వరాకమెయి మన్నూఁగోఁడి నేర్పూఁది చే
తోజాతానల మార్ప శాస్త్రసరణిం దూలి వ్వరి న్వ్యాప్తి పి ల
జ్జాజాడ్యాకులదృష్టిఁ బ్రత్యవయవేక్షం జేయుచో నెండి వ
క్షోజాగ్ర్యద్రుమఁ గాంచి తల్లడిలు నీను న్దావముం బీలఁగన్. ౧౪౯

చ. కుముదరన త్రుటి స్ఫటిక కూల నవోత్పలశయ్య వ్రాలి, పూ
ర్తిమలఁ దిశాశిఁ గట్టసురు త్రెక్కైన ధర్మవుదార పట్టు శే
షము రెయి మల్లి కాశిరుతి చక్కఁగఁ జేయ కయుంత సిల్పు, నా
యమ మఱునాఁటికిం గలుగ, నాఁటగశ చ్ఛ్రిత గండశైత్యకువుల్. ౧౫౦

తే. నెలఁతఁ గుచకుంభ యుగళ ముండియు వియోగ
జలధి యీఁదింప లే దయ్యెః సఖులు వంచు
మన్న పన్నీటి వెల్లి లోఁగొన్న కతన,
ముంప కది లాఘవమునఁ దేలింపఁగలదె. ౧౫౧

ఉ. చంచలనేత్ర దాల్చు జలజాతమృణాలసరంబు వెగ స
శ్శించినఁ, బాఱుతెంచి కటళించి తదూష్మకు నంగలార్చ రా
యంచ కుచేష్టఁ గాంచి, యిఁక నైనను గందుమొ యంచు మోపె వీ
క్షించినఁ, దోఁచు లేనగవు నేరుచు బోట్ల కొకింత ప్రాణమున్. ౧౫౨

ఉ. శ్రీపతి మీఁది గీతముల ప్రేమ విపంచిక నంటఁ, బాణి నం
తాపము సోఁకి మెట్లమయినంబు గరంగిన. డించి, పాడ నా
లాపిసఁ దాల్చి, పెన్నెమటల న్మఱి తంత్రులు జజ్జుకోఁ; గలా
లాపిని దాన పాడును, గళంబును గద్గద మైన, మ్రాన్పడన్. ౧౫౩

తే. వ్రతికుసుమతల్పమునఁ జాఁజి పడిన తప్త
వలయ మలినాంకయుగము వర్తులతఁ బొలిచెఁ,
జూడ సిఁక మాన ధైర్యము లున్న లనుచు
సుదతి బోట్లకుఁ ద్రవ వ్రాసి చూపె ననఁగ. ౧౫౪

ఉ. ఆ వనజాక్షి కాఁకఁ బొరలాడ, నలంగిన సొమ్ముఁ జీరలుం
వే వెస నూడ్చి యూడ్చి మఱి వేఱ వహించుటఁ వారిక్ష్మ ప్రపన్

గా వనమాలి సేవయొనఁ గాంక్ష నొదుంగక, కల్లతెల్వితో
నే వలపంత దాఁగఁ జరియించిన. దాఁగమిఁ జూచి నెవ్వగన్. ౧౫౫

క. పుత్త్రియుఁ దాఁ గామిని నొక
పుత్త్రియు నట్లుండుటకు సబుద్ధేక్షుధనః
పత్త్రి యగు విష్ణుచిత్తుఁ డ
పత్త్రప లే కడియు నేతవంటో యనుచున్. ౧౫౬

వ. తలపోసి దినదిన ప్రవర్ధమాన తనయా తనుగ్లాని కత్యంత దుఃఖితుండై తత్కారణం బెఱుంగక వల దని మౌగ్ధ్యంబున వారించి చూచి యంత కంత కగ్గలం బగుడు గుడికిం జని పూజాంతిమ నమస్కారణానంతరంబున, దన మనో నిర్వేదనం బన్నగరి వెన్నునకు విన్నవింపం బునర్నమస్కృతిం జేసి, "దేవా దేవరదాసి యగు మదీయ పుత్త్రి యేమి గాంచియో విచిత్రంబగు ప్రతిచర్యం గాత్రశోషంబు సేయుచున్నది. వల దన్న విన, దపుత్త్రకుండ నగునాకుఁ బుత్త్రియైనను బుత్త్రకుండైనను దాన, యే నేమి సేయుదు; మఱి తన తపశ్చర్య తెఱంగు మా తపశ్చర్య తెఱంగు గాదు, ఏము భవద్దివస భవజ్జనిదివస రాత్రులం దక్క గణరాత్రజాగరంబు లెఱుంగ, మేము బిసబీజాక్షవలయంబులు, దక్క కనవలయంబు లెఱుంగ, మేము ప్రసాదకుసుమంబుఁ జెవిఁ జెరువుటఁ దక్క నవి గప్పుకొన నందు శయనింప నెఱుంగ, మేము చెంబుల భవత్తీర్థంబు గ్రోలినఁ దా సంగంబులు దడివి కొను, మేము చాంద్రాయణంబులం బ్రవృద్ధిఁ బడిఁ గడియెక్కించినఁ దా డించు, నేము నిదిధ్యాస నిశ్వాస నిరోధంబు సేసినం దాఁ దద్ధ్యానదశ వెలికి నిగిడించు, నేము చిన్ముద్రికై హృదయంబునం గేలు సేర్చినం దాఁ గపోలంబునం జేర్చు, వల్కలోత్తరీయంబు లేము వహించినం దాఁ గిసలయోత్తరీయంబులు వహించు, నేము సితపక్షు నూత్నేందుఁ గీర్తించినం దాఁ బూర్ణేందు నుపాలంభించు; నిట్లుగా బ్రవర్తిల్లుచున్నయది; యిది యేటితపం బున్మాదంబు గానోవు, నెంత భవదీయ భక్తి గలిగిన మాదృశులకుఁ బ్రకృతి సంబంధంబు విడువ; దంతర్యామివి నీవెఱుంగని యది లేదు; దీని తెఱంగెఱింగింపవే;" యనవుడు, ననుకంపాతిశయంబునఁ దచ్ఛందనంబునకు మందస్మితంబు సేసి మందగధరుం డిట్లనియె. ౧౫౭

## ఆశ్వాసాంతము

ఉ. కంధర నీలవర్ణ, మధుకైటభ నాశ సుపర్ణ, యోగహృ
ద్గ్రంథిభిదోక్ష భోగివసితా స్వనవచ్ఛ్యుతనద్రవచ్ఛిర
స్పంధి వన న్నిశాపతి రస స్రుతి దుగ్ధపయోధి వీచికా
మంథరకేళి కాదర, సమాశ్రిత పంక్తిశిరోఽనుసోదరా. ౧౫౮

క. ప్రపదానిశ నతిచర్యా
త్రిపదాపనపర్య, నాకి దేవాద్యమర
ద్వీప, దానవాహితోదిత
విపులాత్మభవా, భవారివిశ్రుతనామా. ౧౫౯

### తోటకవృత్తము

ద్రుహిణాండకరండక ధూర్వహగ
ర్వ, హరార్భక దుర్భర పక్షతివః
కుహనార్భక, వార్భృత క్షోణిరి హా
రి హిరణ్మయ హర్మ్యచరిష్ణుపదా. ౧౬౦

మ. ఇది యంధ్రోక్తి యథార్థనామ యవనాస్యకూర్చ కెంబావి వా
రిద వద్ధత్యపరోధ వప్రవలయ శ్రేణీవిఘాతక్రియా
స్పద సేనాగ్రగ కృష్ణరాయ మహిభృత్సంజ్ఞాస్మదాముక్తమా
ల్యద నాశ్వాసము పంచమం బమరు హృద్యంబైన పద్యంబులన్. ౧౬౧

పంచమాశ్వాసము సమాప్తము

—:౦:—

శ్రీరస్తు

# ఆముక్తమాల్యద

## షష్ఠాశ్వాసము

శ్రీకారి కృపార్ద్రేక్షణ,
వైకుంఠ, యకుంఠ, భక్తివరద పదాబ్జ
స్తోక మరందాయిత గం
గా, కాకోదర నగోదయస్థ పతంగా. ౧

వ. అవధరింపు మనంతర వృత్తాంతంబు. ౨

### మాలదాసరి

ఉ. కలఁ డొకరుండు పేరుకొనఁ గాని కులంబు మదీయభక్తుఁ, డి
య్యిల మును వాఁడు వామనత నే వసియింప నౌ పుణ్యభూమి, నం
దుల కొకయోజనత్రయపు దూరపుటూర వసించి, బ్రాహ్మవే
ళలఁ జనుదెంచి పాడు మము లాలన మంగళనామ కైశికిన్. ౩

వ. అహరహంబు నమ్మహాత్ముండు. ౪

క. జాత్యుచితచరిత్రము
మత్ప్రీత్యర్థం బూఁది తనదు హృదయము శుచితా
నిత్యంబుగఁ దత్తనుసాం
గత్యము మనిపాఁత మానితంబై యొదుఁగన్. ౫

సీ. చమురైన తోల్కుబుసంబు చెక్కియును ని
త్తడి శంఖ చక్ర కుండలము లమర,
దిపెదారికొమ్ముఁ దోల్తిత్తియు జోడమ్ము
మెడమీఁది మొగలాకు గొడుగుఁ దనర,

మత్పాదద్వయపూవు పెన్నొలకఁ దొ
ట్టిన యోటి తిపిరిదండెయును మెఱయఁ,
జిటితాళములు సంక పుటిక నొక్కొకమాటు
గతిరయంబున, దాఁకి కలని మెరయ?

దే. వలుద వనమాలికం బెరయు మలిన తనువుఁ
బట్టెతిరుమణ్ణు బెదరుగెంపుట్టుఁజూపుఁ
బనుపుఁబొడితోలువల్లంబు నెసక మెసఁగ
వచ్చు సేవింప సురియాళు వైష్ణవుండు. ౬

శా. గండాభోగముల న్మదశ్రుజహరుల్ గప్ప న్నుతుల్పాడి యా
దంత న్వ్రేఁగులు డించి భక్తిజనితోద్యత్తాండవం బాడు, నా
చండాలేతరశీలుఁ డుత్పులకుఁడై చాండాలిక న్మీటుచున్,
గుండుల్ నీరుగ, నెండ గాలి వసి తాఁకుం జూడ, కాప్రాహ్ణమున్ ౭

తే. అట్లు దడవుగఁ గొల్చి సాష్టాంగ మెఱఁగ
గర్భమంటపిఁ గడిగిన కలఁకజలము
లోని తూఁటొట్టి నిండి కాలువగఁ జాఁగి
నడివెడలి వచ్చునది శూద్రుఁ డిడఁగ గ్రోలి. ౮

ఉ. అతఁడు ముఖ్యజాతిఁ గని సంతస మాయుచు, నెండ గాలి నెం
తో తడపుం బ్రసాద వినియోగము వార్చి వసించుచుం, ద్రివ
ర్ణేతరజాతి మెచ్చి దయ నిడ్డ ప్రసాదము దండె సాఁచి శ్ర
ద్ధాతిశయంబునన్ వినతి నంచి, భుజించుఁ, గొనుం దదంబువున్. ౯

వ. ఇట్లు దన దివాకీర్తి జన్మ నత పరమార్తి నైచ్యంబు సకలజన శోచ్యంబుగా గుడి లాఁపరా తూపరాణి కడ నిలిచి బహిరావరణ ప్రదక్షిణంబు గావించి ప్రొద్దెక్క నిజపక్కణంబునకుం బోవుచుండు, నిట్లుండి యొక్కనాఁడు. ౧౦

క. అద్దమరే యద్దాసరి
యద్దండ బిడాలగాహి తాలయ కృకవా
కూద్దండ రవము విని తను
బ్రొద్దాయె నటంచుఁ దాఁ బోవుచుఁ ద్రోవన్. ౧౧

ఆ. మరులుఁ దీఁగ మెట్టి యిరు లన్న నో యని
యెడు తమిన్నఁ గాసుపడి పొలంబు
లెల్లఁ దిరిగి తూర్పు దెల్ల నౌతఱి నొక్క
శూన్య హనవాటిఁ జొచ్చి చనుచు. ౧౨

సీ. ఇదిసిన యిసుపుల యెదలఁ బొ్రదే నుత్త
రేఁప గసెంద కోరింవ పొవలఁ,
గెంసిన గిరిసెల క్రింద లాఁగలఁ గ్రిస్సి
యదవకాఁపురముండు నాఖుతతుల,
సగము దుమ్మువఁ బూడి చిఁకిరింత వామూయఁ
బెరిఁగిన నూతిపాఁతర బొటియలఁ,
ఊమలు ప్రాలిన్వఁ జవికిన వెలుఁప
ట్టునఁ బండి యెండి క్రుంగిన గునకులఁ.

తే. బెంటదొగ్గళ్లలోఁ గడు వండి శ్మ్రశ్రు
చలనములఁ గ్రుక్కు జీర్ణోతుపులఁ బొలంబు
దుండుగల మళ్ళ యొరులఁ దూలి నాడు
చిక్కనేతాల పాతఱు సీమఁ జనుచు. ౧౩

క. అవమార్గత నరుగుచు మా
ర్గపు ధామార్గావవుఁ గంటకంబులఁ గాళ్ళన్
విపరీతత నూఢ్చుచు నే
రుపున నృశ్లేషు లీడ్చి త్రోయుచుఁ జనుచన్. ౧౪

శా. కాంచె న్వైష్ణవుఁ డర్ధ యోజన జటా ఘాటోత్థశాఖోపశా
ఖాంచజ్ఝాట చరన్మరుద్రయ దవీయః ప్రేషితోద్యచ్ఛదో
దంచ త్కీటకృత ప్రణచ్ఛలన లిప్యాపాది తాధ్వన్య ని
స్పందారాత్త మహాఫలోపమ ఫల స్ఫాయద్వటక్ష్మాజమున్. ౧౫

ఆ. కాంచి యాతఁ డొక్క కాలిత్రోవయు నంతఁ
గాంచి యందుఁ దెరువుఁ గాంచినదియ
వరమలబ్ధి గానఁ ద్వరితంపుగతి నవ్వ
టావనీజ మంత నంతఁ గదిసి. ౧౬

సీ. ఎలనీటి బొండలంబులు వోలె
మెదడెల్ల జుఱ్ఱి పైఁ జిదిన తొల్లు పుఱ్ఱె గములు,
నెఱచి గీఱిన జీర లేర్పడఁ దుదముట్టఁ
జీఁకిన నులివచ్చి కీకసములు,
చొనదొన యను సీఁగెఱుట్టెల రూపేరు
వడక క్రంపలను వ్రేలెడు గరుసులు,
దూళ్ళ మఱ్ఱికొక్కి మంగళ్ళతిప్పలు రేఁగు
వడువున గాలి నాడెడు నెఱకలుఁ,

తే. దుసినిన నరాంగకములఁ బొత్తులను గమిచి
పోక యొండొంటితోఁ బోరి పీకులాడు
శ్వాపదంబులుఁ, బదహతి ప్రస్రవలుచు
వరుగు దఱచగు ముఖ్రోవ నరిగి యెదుట.

సీ. ముంగాళ్ళఁ జాఁగి పై ప్రముచ్చుఁ జూవులు పర్వ
బొమిక లెత్తుచుఁ బాఱి పోవు కునులఁ,
బలలతోరణములు పట్టి బిట్టెగయ శా
ఖాఘాతి నెగయు కంఠములరౌదల,
నష్టంబు దిరిగి తలాహతిఁ బడి రొండి
హస్తంబు లిడి యంగ లార్చు రవుల,
దబ్బాటుమై నొక్కెడలు నూపి యవి మాయ
నవగఁ వేతెవఁ జూపు వ్యాపృతులను,

తే. కని యెవఁడొ యొక్కరుం డిందుఁ గలఁడు, వాఁడు
నరుఁడు గాఁ, డింధనాదికాహరణమునకు
వేళయును గాదు. పొలగాలి వీచెఁ, దెరువు
నెఱ, పనుచు జాలిగొని సంశయించుపేళ. ౧౮

సీ. మృతమర్త్యు రెంటాస నిడ్డఁ బాలక నెత్రు
రంజిల్లు పెనబొడ్డు ముంజివానిఁ,
బల్లనీమల వక్షభల్లాతకియోఁ బోలె
నెఱ్ఱదుప్పటి నొప్పు కట్టువాని,

వ్యత్యస్త హస్తమ స్తాభఁ బాయగు గడ్డ
మును దంష్ట్రికము బొల్చు మొగమువానిఁ,
గడుఁదుర్గ నిడు తుట్టెగటిఁ జొంగలోఁ బాండు
రత మించు కపిలకూర్చంబువాని,

తే. నెలకుఁదెలువరిఁ గన శాఖ లెక్కఁజాలుఁ
బ్రేవుజందెంబు గసరి పైఁ బెట్టువాని,
వ్రేలు తగుబొజ్జ గల బూరగాలివానిఁ,
బెంబుతలవాని నవటు కచంబువాని. ౧౯

తే. కంచకన్నులవాని, నాఁకటను బండ
తిట్లు బేతాళికల సారెఁ దిట్టువాని,
నగగరిమవాని, నన్వర్థ నాముఁ గుంభ
జాను వనునొక్క ద్విజనిశాచరునిఁ గనియె. ౨౦

ఉ. వాఁడును గంటిఁ బోకు మని వ్రాలె మహీస్థలపాళి నుగ్గుగా,
వీఁడును మున్న రేపగటి వేళను మానిని యొంటఁ, బోరిలో
వాఁడిమిఁ గొంతకాల మిల వ్రాలుచు లావరి యోటు, నిల్చి యా
వాఁడిశరంబుచే నడఁప, వాఁ డది ద్రుంపుచు వీఁడు నుద్ధతిన్. ౨౧

సీ. తిగిచిన నడుగులు దెమలక యొమ్మవ్వ
లించి యవ్వలికిఁ జాదించి దాఁటి,
చటచిన వంచించి చరవ భాగము నకై
తిరిగి, తత్క్రియ కగు దృష్టి నిలిపి,
పైబడ్డఁ జనుమున వచ్చ కొడ్డుచునందు
పిడికిళ్ళ బలిమి లోఁబడక నిలిచి
చొరఁబూని గ్రుంగి మఱ్ఱుఁబిగి కోటగాఁ
జాంపీక తిరిగెద చోన తిరిగి

తే. యసుర వధసాధనము రోయు నపుడు గ్రద్ది
దాచి తిరిగినఁ గృతముష్టి దండ నిలిచి

యెదకొలఁది * వెన్కనర నొయ్య నడచి యడచి
మత్పదస్మృతి యాత్మ నేమఱక యతఁడు. ౨౨

తే. తాఁచి పోఁజూడఁ దన రాక్షసీచయంబు
నెల్లఁ జీరిన డిగ్గి వా రేఁగుదేరఁ,
బోయె నదె వాఁడు రారె రారే యటంచుఁ
దాఁకి వాటును దానును బట్టికొనుఁడు. ౨౩

క. ఐంతో తద్దానవరి య
ష్టం బదహతులను గపోణి పోటుల నిరుమై
లం బొడుచుచుఁ బెనఁగ చుఁ బో
వం, బట్టి వటంబుఁ జేర్చి వాఁ డిట్లనియెన్. ౨౪

శా. సారాస్వాదనఁ బ్రాణపంచకము తృష్ణం బాసి నంతర్వణ
న్మారింబో ననిఁ ద్రుంచి పొంగెదు భవన్మాంసంబు ధారోష్ణ మిం
పారం గ్రోలి, పిశాచి నీదు కఱకు ట్లందీ, నదస్త్రాలకాం
తారాంత ర్న్వకపాల కుండ విగళ న్మైరేయముం ద్రాగెదన్. ౨౫

క. న న్నిం తలయించిన ఖలు
ని న్నే ఋజువిధి వధింతునే యని యార్పుల్
విన్నందగ బుసకొట్టుచు
నన్నిచుఁడు దగ వెలువడు నవ్యక్తోక్తిన్. ౨౬

తే. ఆసియుఁ బాత్రియుఁ దేఁ బంచి యాంత్రవల్లిఁ
గోలఁగగ్గిఁ ద్రోయ నక్కుజములోఁద
నారగి రక్కసుతో దైన్య విరహితముగ
ధర్మ మెఱిఁగించు సూక్తి నాతండు వలికె. ౨౭

చ. విను మొకమాట రాత్రిచర, వేగిర మేటికి? నీఁ జయింతురే
యనిమిషులైన? ఖాజన గతాన్నమ నే నిఁక నెందుఁ బోయెదన్?
బెనఁగక ప్రాణరక్షణ ముపేక్ష యొనర్చుట పాప, మిందు కై
కనలకు, నాకు మేనియెడఁ గాంక్షయు లే, దిది వొవుదే యురున్ ౨౮

---

*పా. వెనుక నడు మొయ్య

ఆ. హీనజన్మ మఱుట, యెవ్వఁడే నొకప్రాణి
సంతసిలుట, ముక్తిఁ బొంద గనుట,
మేలెకాదే ; శిబియ మేల్పంతిగాఁడె న
శ్వరపుదేహ మిమ్మి వరము గొనుట. ౨౯

చ. తెవు లయినం, గ్రహం బయినఁ, దే లయినం, గర మైన, నాత్మ వెం
దెవు లయిన, న్జలం బయినఁ, దెక్కలియైన, మృగాగ్నులైన, మే
త్తవు లయిన, వ్రణం బయిన, ద్రాఁచయిన, న్విడుఁ గైనఁ. దీర్పు పే
లవ తను వూర కే చెడ శిల న్నృణ నొక్కనిఁ బ్రోచు టొప్పదే. ౩౦

వ. అది యట్లుండె, నింకొక్క హితంబు సెప్పెద, నదియును బ్రాణభయంబున నాడు కార్యవశంవు మాటగాఁ దెలియక, మాధ్యస్థ్యంబుగాఁ దెలిసి, వినుము. వినకున్న భూతహితంబుఁ గోరి యుచ్చరించు మాట యీశ్వరుండైన మెచ్చుఁ గదా ? వ్యాఘ్రసింహ వరాహ వృక జంబుకాది శరారుపులయం దొక్క తిర్యక్కృవుగావు ; దేవయోనివి. నీకును మాకుంబలెఁ గర చరణ ముఖావయవం బులు గలవు ; మాటలను మాయట్ల యకర్తవ్యతాపిచారంబులు సమానంబ హొ మఱచి యుంటి ; స్థావరంబులకంటె కీటాదులును, వానికంటె మఱి మృగాదులకు, వానికంటె మఱి పశు పతంగాదులను, వానికంటెను మాకును, మాకంటెను మీకును, గరణ కళేబరాది పాటవం బెక్కుడు, విజ్ఞానంబును, ఘనం ; బట్టి నీ కేమంత కుత్సాపహంబగు బీభత్స వధ్యావధ్య పథ్యాపథ్య భక్ష్యాభక్ష్య పేయాపేయ వివేకంబులు లేకునికి యుక్తమే ? రుచి గాదు, శుచిగా దీదురాహారం; బిదియు సకల దురితావతంస యగు హింసనొనఁగూడు నది. హింస పరలోకంబునం గదా బాధకంబు, పరలోకంబు ప్రాణాంతంబునం గదా ; చిరస్థిరప్రాణులమగు మాకేం హింసాభయం బనవలదు ; ప్రాణ భయంబు మనుష్యుల మగుమాకు నేఁడైన, మీకు మఱునాఁడైన నవలి నాఁడైనఁ మఱ యుగాంతంబునందైన నిడువు గిలుబడ నెప్పుడుఁ దప్పఁ, దంతవత్త్వంబునకుఁ దారతమ్యం బేమి ; మున్నిటనైనను మునుముట సరి యగుటఁ బవ్వతంబునకుం బరమాణువునకు నేమి యంతరంబు ? మీఁదు విచారింప వలవదే ? తపోలబ్ధవరాదులం బూర్వంబునం గీర్వాణుల మదం బణంచి హెచ్చిన హిరణ్యకశిపు దశముఖాదులు శతసహస్ర సంఖ్యాక సంవత్స రంబులు జీవించియుం బంచత్వంబుఁ బొంది తారు మున్ను జయించిన జము

చేతనే చిక్కరే? యిక్కడికి వీరు ప్రబలులరైన నక్కడికి వారు ప్రబ
లుండు, సకల భూత తారతమ్యంబును నిజ నిజస్థానవిశేషంబునన వచ్చు,
సర్వాంతరాత్మ సుకృతిని వీట మేరం దప్పిన మాకుం దప్పనియట్ల బాధ వీరికుం
దప్పదు. వీరు నాసౌరిముఖ బర్హిర్ముఖులు జాలం దలపోయ ధాత; లట్లయ్యుం
బలంబున మీరు వారు బాధ్యబాధకతల నొందుచున్నారు త్రైజనంబగు తార
తమ్యంబునకుం దమస్సత్త్వంబులు హేతువులు, వాని కార్యతులు వే తు
వులు, వ్యాహృతులం గ్రతువుల చరపురోడాశాదుల భుక్తులం బవిత్రులై
యమర్త్యత మీకంటె నతిదీర్ఘకాలంబు వారు జీవించెద. రహ్నాపనత చూచి
కదా చతుర్ముఖాంశజుం దగు సుధాంశుండు గరంగి సకల రసముల కవధి
యగు సుధారసంబున నాప్యాయనం బొనరించుచున్నవాం. దేవదత్తంబు మా
కుచ్చరించరాదుగాని వేదంబు ప్రథమకళ యనలుండు ప్రావు నని చెప్ప
మటిమను నాయూకళ లాయూ వేల్పులకుం గ్రమంబునం జెప్పు. నింత విదా
రించి రుచించినట్లు నకువు; మనసు, సహాసహ సర్వ యద్ధాసరికి సురద్రోహి
యిట్లనియె ౩౧

క. చంపకు చదువుల, మేము వ
ధింపని శాస్త్రములె? మావధింపని క్రతుకే?
యింప వవి నమ్మ వే 'ప్రథమాం
వికలే వహ్ని' యనెడుమాటవుం గాదే ౩౨

మ. నిజ మోహో మను వారి ప్రాత లనుచుం నీవంటి, వార ల్పురా
తు లపూతాత్ములు గా రటంటి, ప్రతిప త్సోమాంశము స్తోత్రిలు ముం
జ్యాదిపుం దం, టిరె నొంకు నిన్నడిగెదం ? సర్వాశి గాండా, యతం
డిలం దన్న్యాయము చాలు, మాకు నిమ మే ? వృద్ధాపదారం బిరం. ౩౩

తే. హరికి సఖుండును రథమును నగు గరుడుండు
దొరకి నమృతంబు సురలకు మరల నిచ్చి
యపలు గూడుగ వరమున నడిగికొనండె ?
యమృత మైనను జవుల జాత్యన్న నమమె ! ౩౪

చ. నిదురయుం గూడుం బోం జదివి, నేనిటుం గన్నదియేమి ? యెవ్వండి
చదువుల యత్నవాచపు న్నృష ల్గాని భేప్పదు, నీవు మాయెడం

ఐదువులమాట లాడి కనఁ జాల వొకానొక మెచ్చు, నొక్కఁ 'డీ
చదివిన కూర వింతచవి, చాలఁగఁ, దె' మ్మను మెచ్చు దక్కఁగన్. ౩౫

వ. అని గీష్పతి మతం మవలంబించి, నిజాలాపహేళనపరుఁడైన రక్కసు కుత
ర్కాకులకుం గృష్ణస్మరణంబు సేసి యిందుఁ గొందఱకు ప్రత్యుత్త
రంబుల వీనిఁ గెలిచిన బుద్ధి ఘోరంబుగా, నింతకంటె నేమి యబద్ధంబులు
వినంబడునో, మీఁదఁ గార్యంబు గల మాకు దీనిఁ గావనం బని లే, దని
యందంబుఁ గూడ కొని. ఛందోనువర్తనపరుండై, పిచనంన్మ్రతిఁ రోసి.
తన్మనోల్లానంబునకు శబ్దచ్ఛలంబున నంతర్గతంబున సుగతు నిడుకొని నీవు
సర్వజ్ఞుఁడ, నేను నరుఁడ. హీనకులుండ, ననభ్యస్తశాస్త్రుండ, నీ
కుత్తరం బీ శక్తుండనే. నువ్వచనస్ఖాలిత్యంబులు నహించి దయచేసి నమ్మి
మత్ప్రార్థనంబు గావింపుము. ౩౬

శా. ప్రఖ్యాతుండవు దైత్యులందు మును, పా దైనొక్క నీకా యశో
లిఖ్యన్నెనును జేర్తు, మే యొనఁగఁ 'దప్పింప, వ్రతం బొక్కఁడే
ముఖ్యంబై యునికింతు, దాని నఫలంబు న్సేయఁగా లేవుఁగా,
'సత్యం సాప్రపనీన' మన్మన మిథ స్సంగత్య మూహించుమా. ౩౭

వ. అది యెద్ది యంటేని ౩౮

## దాసరి యొట్టువెట్టి తప్పించుకొని కైశికసేవకు పోవుట

క. ఈకఁ జగటి యాకఁ జుఁగుడి
వైకుంఠనిఁ బాడి పత్తు ప్రతమగఁ. దత్సే
వాకృతికి దవట నళనము
నీ కొదు; న్మఖ్య మిదియ నేఁ వఁ దుదకన్. ౩౯

ఉ. ఆము నశంసు పల్కఁ. దరహాసినఁ జెక్కిలిఁగొట్టి లెన్సువం
దించితి వోయి దాసరి. వనిం దెఁవాటులు గొట్టికొట్టి మే
న్వెంచి విరక్తి దాసరివి, నిన్నఁగదా యయినాఁడ, వీ మమున్.
గొంచెముఁ జేసి త్రాద్ధాటికికోఁ గఁలపోసెదు, మెచ్చితి న్నినున్. ౪౦

శా. ఏ రాజ్యంబు నరుండు నోరి కదవో నీబోధ మాలించు ? నిం
కేరాజ్యంబు నరుండు భాసకయి మే నీఁ దాన యేతెంచుఁ ? దీ

పొరవ న్నేఁ జననీమియు న్మగిడి నీవారామియుం దెల్ల; మే
లారంతు, ల్పలుపల్కులంత్యకులం, యేలా చింత, యేలా వగల్. ౪౧

తే. అనిన జెవిఁ మూసి నారాయణా యటంచు
నతఁడు నను నమ్మవేఁ ఓశిఠాశి? యొక్క
శపథమున నమ్ము మని వాఁడు సమ్మతింప
వేనవే ల్సత్యములు వల్కి వినకయున్న. ౪౨

ఉ. "ఎవ్వనిచూడ్కిఁ జేసి జనియించు జగంబు, వసించు విజ్జగం
బెవ్వనియందు, డిందు మఱి యెవ్వనియం దిది, యట్టి విష్ణుతో
నివ్వల నొక్క వేల్పు గణియించిన పాతకి నౌదు నేఁడ నే
నెవ్వధినైన నిన్గదియనేని," యన న్విని బంధ మూడ్చినన్. ౪౩

దాసరి మరలుట

చ. అతఁడు తదల్పపావఫల మందుట నుంకము దీఱి పోయి, త
చ్ఛతదళపత్త్రనేత్రునకుఁ జాఁగిలి మ్రొక్కి, రణద్విపంచి యై,
స్తుతిఁ లలితప్రబంధములఁ జొక్కఁగఁ బాడి, యసత్యభీకర
ద్రుతగతి వచ్చి, రాత్రిచరుతో వ్రతపూర్తి గతార్తి నిట్లనున్. ౪౪

ఉ. నీ చెఱఁ బాసి, పోయి, రచనీచర, చక్రి భజింప, ముక్తి పొం
దేవెర, యే చెఱం దవులనే. నిఁక నుండఁగ జూడు, వంచుచో
నేచరణంబు లేయుదర మేయుర మేశిర మేకరంబు, లీ
వా చరణంబు లాయుదర మాయుర మాశిర మాకరంబులున్. ౪౫

తే. అనిన దత్సత్యమునకు నేత్రాంబు లురులఁ
బ్రమద పులకితగాత్రుఁడై పాఱుఁటసుర
యినుని మధ్యందినపుటెండ దవదు పెద్ద
బట్టతల మించఁ బ్లవుఁ జేరఁ బాఱుతెంచి. ౪౬

దాసరి బ్రహ్మరక్షస్సు ననుగ్రహించుట

ఉ. కొంతయుఁబోలె భక్తి వల గొంచునె, వాఁడు నిజద్రుమ్మత్రమీ
హింతవ ద్రావలుపాకలపు దేన్కఁగుఁబోలె, నొన లదంబ్రముఅం

దుండ, రౌద్ర స్మహాగిరులు హోరనఁ, బ్రస్తుతి వ్రాలి, దంష్ట్రి కా
దంతము లెత్తి పట్టిన పదం, బొకఁ దొక్కఁడ నెత్తి జేర్చుచున్. ౪౭

శా. "ఈసర్వంసహ దేవదానవమహీభృన్మౌనివాదాతప
శ్రీసర్వస్వము నేతదన్యకృతులం జెప్పంబడు, న్ఘోర మా
నీసత్యం బురరీకృతాంత, మిల నెం తే వృద్ధనై మంటి నే,
నాసత్యం బిఁక నిన్నుఁబోలు కృతసంధా ధూర్వహు ల్లేమికిన్. ౪౮

చ. ఇతరులు నీకు నీడె మఱి? యీ వృతి, నీస్మృతి, నీబుతేరిత
స్థితిగతి, నీమురారిపద సేవన జీవనవృత్తిన్, సమా
దృత కలగాన సింధు లహరీ ప్లవన ప్లవభావ భా గురు
శ్రుతి తత బద్ధ తుంబికిఁ గుదంగుడినంటి కృపావలంబికిన్." ౪౯

తే. అనిన నాతనిఁ గౌఁగిట నునిచి పలికె,
వ్రత మొనర్పించి తని భాగవత వతంస
"మోయి రజనీచరేంద్ర నీ యురుకృపాక
టాక్షమునఁ జేసి ధన్యుఁడ నైతి ననఘ. ౫౦

ఉ. దాసలు బందికండ్లు, మఱి ప్రాణభయంబున లక్ష సేసినం,
గ్రాసము కృచ్ఛ్రలబ్ధ, ముదుగ న్పరమే? యిది నీక చెల్లె, నో
భూసురవంశ్య. పుణ్యజన పుణ్యజనాంకము దావకీనమే
పో, నమకూరెడిం గుణము పొత్తున దైత్యులకెల్ల నంకతన్. ౫౧

చ. కడుపు మహాక్షుధ న్నకనకంబడ న స్వృతకృత్యుఁ జేయఁ డో
విడిచితి, వేము జాత్యముగ వేధ విధించిన కూడు మీకు, నీ
యెడ నొకకీడు గల్గ, దిఁక నే మనిన, న్మఱి నీకు నాన నూ,
బడలిక దీఱ నిత్తనవుఁ బారణసేయుము మైత్రిఁ గ్లినన్. ౫౨

క. ఈపూట న్పారపొచ్చెము
లేమికి నీశ్వరుఁడ కరి నిలింపవిరోధీ,
నామెయి మేదోమయ దృ
ప్తామిషములు మెసవు" మన్న, నతఁ డను నార్తిన్. ౫౩

శా. "ఎట్టూ? యిట్టఁగనయ్య పల్కఁ దయలే? కిన్నాళ్లు నీకూడె యీ
పొట్టం బెట్టి, మహోఘులబ్ధిఁ దసువుం బోషించి యెన్నాళ్ళ కే

నట్టి నొక్కతపస్వి యొక్కప్రతి రాఁదే, చూడఁదే, తత్కృపన్
బుట్టు నీఁగెద దీని, నా నొదవి, యో పుణ్యాత్మ యిట్లంటివే? ౫౪

క. మీవంటి భాగవతులుం
బావనులుగఁ జేయరేని మఱిగతి యేదీ
మావంటివారి కిఁక మా
యేవము వెనుకటివి చూడ కీక్షింపు కృపన్. ౫౫

తే. స్వధితియైనను ద్విజుఁ డిన్న శస్త్ర మైన
సరియకాఁ గాంచనము చేయఁ బరుసవేది,
యీయసాధారణన్యాయ మెన్నఁ బలదె
మాదృశులచోటఁ గదియు భవాదృశులకు?" ౫౬

తే. అనిన దేహార్పణము నొల్ల కార్తిఁ బలుకు
కృపణత కతఁ డభిప్రాయ మెద్ది యనిన.
"సిత్తుఁ దను వంట యనుకంప యే. ? మదాత్మ
కనఁటఁ బావుటయే యనుకంప గాక. ౫౭

శా. పంటాకర్ణుని మించుకర్మ మొకొ నా కర్మంబు? మౌనీంద్రులం
డంటు ల్సేయఁదె? మాన్పి యీఁదె భగవంతుం డిట్టి శ్రీ? యట్టి శ్రీ
కంటె న్భాగవతుండు మించ నొసఁగం గాఁడె? యీ మేలు నా
కిందింప న్మఱి రాదె? పూజనము గాదా ప్రాణిమే ల్పెక్కిఁకన్." ౫౮

వ. అనిన విని మాతంగుం డాతెఱం గెఱుంగైన సంగతం బగు ననిన, నాతం:- "దే నొక్క బ్రహ్మరాక్షసుండఁ, గుంభజానుసంజ్ఞుండ, నుగ్రకర్ముండనై యీన్యగ్రోధం బాశ్రయించి వంచనం బశిః పంచజనచర్వణంబు సేయుచుండుదు. పూర్వంబున సోమశర్మ యను భూబర్హిర్ముఖుండఁ, బ్రాగ్జని ద్విజుండఁ గాన దయనీయుండన; యొక్క దుష్కర్మంబుననిట్లైతి. నీవు కైటభారిం బాడిన నేఁటి పాట ఫలంబు సజలంబుగా నాకిచ్చి తేని బీభత్సకుత్సార్హం బగు నీజన్మంబు వేఁగు. నీకు నా రరక్షణంబున వగు సుకృతం బనంతంబు సిద్ధించు, నత్యంత ధర్మసాధనం బగు నిమ్మేను నిల్లునేరు;" ననిన, నమ్మేని మాటలకుఁ గలకల నవ్వి యవ్విష్ణుదాసుం డిట్లనియె. ౫౯

క. "ఇటువంటివి యిట లెక్కుఁడు
నిఁ దిగుడువి యొండ నెన్ని యే, నిదియును నా
క్కాటి, యొకనాఁటిద కా దొక
త్రుటి గీతఫలంబు నొసఁగుదునె యిమ్మెయికిన్ ? ౬౦

సీ. దిక్పాలతను వెత్తి తిరిపతనవుఁ దోన
యెన్నిమా ర్లెత్త మీ యేను నీవుఁ ?
గేసరి తను వెత్తి కీటతనువుఁ దోన
యెన్నిమా ర్లెత్త మీ యేను నీవు ?
మాతంగ తనువెత్తి మశకతనువుఁ దోన
యెన్ని మార్లెత్త మీ యేను నీవు?
ధరణీశ తనువెత్తి దాసతనువుఁ దోన
యెన్నిమా ర్లెత్త మీ యేను నీవు ?

తే. సోమయాజులమెన్ని మార్లొము, శ్వపచ
ఖగకులుల మెన్నిమాఱులు గాము, పాము
గాములము నెన్నిమాఱులు గాము వెండి
కంసరిపుభక్తుల మొకండె కాము గాని. ౬౧

ఆ. ఊఁతనీరు చెలఁది నేఁత మూటంయిటి
దూది యెంతపసువు దొట్టియక్క
రంబు మేను, దీని రహిఁ బుణ్య మమ్ముట
కప్పురంబు వెట్టి యువ్వు గొనుట." ౬౨

వ. అనిన వనుజుం డిట్లనియె. ౬౩

క. "సంగీతఫలంబునఁ గో
సంగీ సగమైనఁ దయ నొసఁగ నీవే; మీఁ
గ్రింగినగ్రక్కు న్వారిధి
కిం గొఱఁతయె? కొదయె విష్ణుకీర్తన" కనినఁ? ౬౪

శా. "ఏలా నొంచె దదేహ మిట్లడిగి? యెం తే బాస మేనం బలం
బో, లీలావటు గీతకీర్తనఫలం బో, నీయెక న్మన్ను? పా (బే)

తాళప్రశ్నలు మాని మెల్గొనుము; బేతాళ చ్ఛలోక్తిక్రుషం
దూలింపం దలఁతేవి. పుట్టువఱి నూతుల్ద్రవ్వ బేతాళముల్." ౬౫

వ. అనిన సాలంకటంకటోయుఁడు సెలఁగటకటంబడి, కార్యేచ్ఛం గన్నీరు గ్రుక్కుకొని, "కటకటా! కైటభారి కనుంగలుగు డింగరీలు చియాబువులు గావలవదే? తొల్లి దక్షిణ ప్రవర్తకుండై వైయాసికంబులగు సూత్రంబులు వివరించి పిష్టరశ్రువు నద్వైతవైశిష్ట్యంబు ప్రతిష్ఠించిన లక్ష్మణాఖ్య యోగీంద్రుండు, చిరకాలసేవా సంతుష్టుఁడై నిజదేశికుం డగు పూర్ణాహ్వయుం డనఃకారులకీడు మని విధియుక్తంబుగాఁ దనకుఁ బ్రసాదించిన గీతాచరమార్థంబుఁ, గృపాతరంగితుండై రంగేశధామ దామోదరనామ చామీకరగోపురం బెక్కి, యచ్చైత్రస్వనంబున నుచ్చరించినఁ గురుం డలిగిన, 'దేవా! దేవరయాజ్ఞ మీఱి యే నొక్కరుండ రౌరవంబునం బడుట మేలో? భాగవతపరిషత్తునకుఁ బరమపద మగపడుట మేలో? యని వితర్కించి సీ వుచ్చరించుట గా నుచ్చరించితి' నని తదభినందితుం డయ్యె నతండు నిజాచార్యుని సత్త్రింబునకుఁ బ్రత్యహంబును గల్యంబున మూల్యం బొల్లక గవ్యంబు సమర్పించి వేఁడిన వల్లపీవల్లవులకుఁ బరమపదంబుఁ బ్రసాదించె; నతండ బంధముక్తుం డయ్యె నపతానాంతరంబునఁ గాలాంతరంబున నంకుచితజ్ఞానులై విషయపరులగు నరులకుం బరమునందలి తీపొంప సుందరజామాతృ నామంబున నర్చిరాదిగతి విశదీకరించె; నతండ యిటమీఁద యాదవగిరి వెంకటంబు పాషండసంకులంబుగా వచ్చినఁ దచ్చృతికి శఠకోపనమాఖ్య సంభవించి నీరంధ్రవాదంబున నంధ్రాదివిషయ విద్వజ్జనంబుల నధోక్షజవిజయవాద భిక్షవేఁడి దిగ్విజయంబు సేసి గరుడధర గుహాకుంత స్వకంఠీరవంబు కుహనాత్రిదండియై బ్రుసీ కుసుంభాంబరాంభః కుండిక లొనంగి నంగీకృతాంతమాశ్రముండై, ఫణివ కణభుగక్షపాద బాదరాయణ కపిల జైమిని శాసనంబులు మత మహాసన మహీసురులు మున్నుగా నెంతేవాసి నంతేవాసులకుఁ దెలిపి నయుపం బరమహంసానుష్ఠాన పరకాష్ఠయై, పదయుగ ప్రపన్న భువనప్రపంచపంచజనహృదయ భవనంబులం బద్మపద్మాక్షులు పల్లేర్లు దుడిచి పాడెక్క భక్తి బోధించి భూతలంబుఁ బావనంబు సేయం గలవాఁడు. మఱియు హయవదనపదారాధకుండై వెంకటేశుండను నింకొక్క మనీషి మధుమథనమతప్రతిపాదకం బగు ప్రబంధశతంబు రచించి శిలోంఛవర్తనంబునం దపంబు సేయం దనకు జరచ్ఛదన శాకాదానంబు సేయు నగ

స్త్యోర్వీరుహంబునకు నిర్వాణంబొనంగం గలం ; డిట్టి యేష్యంబులు మదీయ దివ్యబోధనంబున నెఱింగియుండు, నేతాదృశం బగుత్రైకాలిక జ్ఞానంబు కలిమి నిమ్మెను మాననీయంబుగదా యంచేని యది జాత్యంబుదక్కఁదపస్సత్యశమద మాది లబ్ధంబుగాదు ; నిషాది భవిష్యదర్థంబులఁ జెప్పుచున్నది. అది శుచియే ? కౌశికంబు తబ్బిగాటి గబ్బులుఁపు గౌళి కనుంబెంటి పైఁడికంటి లోనగు తిర్యక్కులు భావిప్రయోజన సూచకంబులై యున్నయవి ; యవి తపస్వులే? యట్ల మావిజ్ఞానంబును ; నెట్లనిన, నాస్తిక్యంబువలన శాస్త్రంబులెడ నధీతి బోధంబులు దక్క నాచరణప్రచారంబులు లేమి ధర్మంబు దూరం, బది నిమిత్తంబుగా నిత్తెఱం గెఱుంగక భవోత్తారకంబుగాదు, గావునఁ గలుష రహిత కాయంబునంగాని కల్యాణంబు లబ్ధంబుగాదు. గాఁబట్టి యివ్విరూప విగ్రహం బనుగ్రహంబున నుడివి కృతార్థుం జేయు ; మని పాదంబుల ప్రాలి పాటం బాతికపాలేని యీవే యనిన, నతం డదియుసు నీవేనన్నుఁ బోని మ్మిప్రభాతసమయంబునం బాడిన చరమగీతంబైన నిచ్చి ప్రసన్నుండ నగు న న్నవిపన్నుంజేయు" మని లేవకున్నం బరమదయార్ద్రుండై, 'యట్ల కానిమ్ము లె' మ్మని యతని లేవనెత్తి. యత్తన్నుఁబాపి ప్రకారంబు నవిస్తరంబుగాఁ జెప్పు మనిన నవధరింపుమని యప్పొలదిండి దుఃఖార్తుండై యిట్లనియె. ౬౬

## ఆశ్వాసాంతము

మ. అజ చౌర్యాపహృతాత్మ తోక నముదా యాభీరకాంతామణీ
ప్రజగోరాజిమనఃప్రమోదికర తద్వత్ప్రాప్త రూపానురూ
ప జని ప్రాభవ, ద్రౌణిజోదర కన ద్బాణాగ్ని వృత్తి ప్రకో
ప జలాసార. నరోజ బాంధవ శశి ప్రాంచ ద్విశాలాంబకా ! ౬౭

క. అనవరత నవ రతాదృత
వినుతప్రేమాత్తవల్లవీజనజాలా,
మననపర మౌనిమానస
వన వసిత్ర మరాళవర, సువాసితమూర్తీ. ౬౮

ఉత్సాహ. నలముఖాది చక్రవర్తి నాథ వనసమర్పితా
త్యలఘుమకుట ముఖ్య హా ర్యుపాయనా, యనావిలా

ఖిల సురారిహరణ నిజ వశీకృతాఖిలాంత ని
ర్మలగుణా! యమేయరూవ రంజితార్యపోషణా. ౬౯

మ. ఇది నైరామన యాపనావని ధవాహీనాగ్రభమంబి స్ఫుర
ద్విదితాఖిల మణిగృహాళీ దళనో ద్వేలోగ్ర హస్తి వ్రజో
ద్య దనీకాగ్రగ కృష్ణరాయమహిభృ త్సంజ్ఞాన్మదాముక్తమా
ల్యద నాశ్వాసవరేణ్య మాఱవది హృద్యంబైన పద్యంబులన్. ౭౦

షష్ఠాశ్వాసము సమాప్తము

—:o:—

శ్రీరస్తు

# ఆముక్తమాల్యద

## సప్తమాశ్వాసము

శ్రీమదుమాసులభాంగక
సామజహరనక్రదళనచక్రసదాశ్రీ
క్షేమంకరచరణాంబుజ
హైమోజ్జ్వలవాస! వేంకటాచలరమణా! ౧

### బ్రహ్మరాక్షసుని వృత్తాంతము

వ. అవధరింపుమప్పొలసుకండి మేఖారుండై యిట్లనియె. ౨

ఉ. ఉండుదుఁ జోళభూమి నొకయూరఁ గరాళ్ పయస్కాల్గు నేర్చి. వా
క్చండిమఁ జర్చ గెల్తు సకలార్థుల, బ్రౌఢుల నొప్పఁ బట్టుమీఁ,
ఖండలముష్టి పిప్పఁ గని నవ్వుదు, నెండి ప్రయోక్తలన్ సుధీ
మండలి గ్రాంథికత్వ మవమానము సేయుదు జల్పవాదినై. ౩

వ. ఇన్నవవడిం బ్రభిన్నగండం బగువేదండంబుపండోలె మదాంధుండనై, యల్పవిద్యాదృష్టి విడువ మునుప వేసరని పిసాంబుగల రెడ్డిమయుండబోలె, నచ్చదువె పరబ్రహ్మంబై, పెద్దలంజెనకి యోడియు నతి యైతి ననియును, సరిపోటు జయించితి ననియు, నబద్ధంబు లాడి చిల్లరప్రభువుల భ్రమియించుచుండ, దీక్షితులం జూచి యయజ్ఞవాంభమి ద్రవ్యభిక్షార్థినై మధురకుం బోవు యప్పురంబున.

సీ. బహువర్షద్విజున కల్పపుఁ బాచితం బిడి,
పసిఁడికై తా వాని బంతిఁ గుడిచి,
కలసి వణిక్పురోధలతోడఁ బుణ్యాహ
ముల బియ్యమునకు నై మొత్తులాడి,

శశి రవి గ్రహ జపస్నానాదికము లెల్ల
  దొరలవాకిండ్ల కే దొద్ద యిచ్చి,
వచ్చిట్టితో ల్పట్టె చు ట్టాలమె ట్లంది
  కొనఁ దాన యూరెల్ల గుత్తపట్టి,

తే. దర్పపోటులఁ దిని, లేని తఱిఁ మైత్రి
  నంటి పిత్ర్యశేషము భుజించి, యదియు నెడల,
నక్క-వాడల నరకూళ్ల మెక్కి, మీఁద
  పినిశేఖర మొక ఘలాత్రివ్యాజ్యము కొని.

ఉ. ఇ ట్టొనఁగూర్చి వైశ్యునకు నిచ్చి, చన న్మతి వుచ్చి, చీకము
ల్వెట్టుచు, వడ్డిలెక్క- లటు వెట్టుచు, ధారణవానికై కొదల్
వెట్టుచు, వాఁడు రేఁగి మఱి 'పెట్టుదుఁ బెట్ట' ననంగ, మిట్టఁ గా
పెట్టుచు, నిట్టు పోరఁ, గసిపెట్టుచు, నొక్కరుఁ డుండి వెండియు౯.

సీ. వెలివాడఁ బని క్రొత్త మలకడా ల్గొని నూనె
  యిడి తంగెడాకు గట్టెడు తహతహ.
కూర్చుండు గొరిగించుకొని యష్టతోయంపు
  టంగడిఁ దలగతగాడు తడవు,
వంట పూఁటింటి కెప్పుంటికంటెను బాలు
  పెరుఁగు నే గూర లంపెడు తెగువలు,
సంబెళ విదలించి తాంబూలదళ పూగ
  నివహంబుఁ జాలఁగ నించు సుబ్బు.

తె. బ్రహ్మచారిభుజంబు మాత్రకు సదింపుఁ
  బ్రాలు, నాలికి మేలుచీరలు. గొనియెడు
సంభ్రమంబును, బెఱపాంథజనులఁ బయన
  మడుగు ప్రశ్నలుఁ, గని మత్ప్రియాణ మెఱిఁగి.

క. హత్తుకొని యొక్క- కొందఱ
నత్తెరువుం గట్టఁ బనిచి, యందఱుక్రియఁ దాఁ
దిత్తి యొకటి, గొని త్రేటి మ
ఱుత్తర ముత్తర మటంచు నొకప్రొద్దుకడ౯.

తే. లేచి పోవంగఁ దత్తఱ మేచి తోడి
వారు నన నేను ముదెమోపు వటున కెత్తి
పోవ వాఁ డిందు రండని త్రోవ యడపఁ
బెట్టి యొకవాఁగు డిగ నీల వెట్టుటయును. ౯

క. ఆఱచేత వ్రాలు గను న
తఱిఁ ఒదె నొకయంపకట్టె, దానికి నిలువం,
బిఱుబిఱ్ఱున కాలుపడెం
దెఱపియుఁ గనలేమి సాతు దిరుగుడుపడియెన్. ౧౦

మహాస్రగ్ధర

కవిసె న్గల్పాంతజంతు ప్రసర ధృశ భుఘా త్వర త్ర్యక్షి పాక్ష ప్రే
ప్లవమా నోత్పాత [1] బేతాలకుల పడిమ హాలాహల స్పర్థి హేతి
చ్ఛవి రేఖానేకరాహూ చ్ఛలిత విపులు రక్షిశ్చముఖ తుషింద
ప్లవబృందంబు ల్గాని వృల్గడిఁ బోకపొను మన్పులుక్కలు స్కల్కులు గ్రొన్. ౧౧

వ. ఇట్లు చెట్లు వెడలి విడ్లువంబుగొని ముంపుకొను నన్నల్లిప్రజం జూచి
హల్లకల్లోలంబై విఱుగంబడు నెడ. ౧౨

సీ. పనలేదు నింరోయి పాతకులా రవి
దేవాయుధంబులు ఊవువారు,
పైఁడి బాసము జెట్లఁ బసపైచి దుడ్డుపె
ట్లకుఁ బాయుటనె యొలె ల్వేచువారు,
బరువు డించి కటారి పరుజించి నిల్చి యిం
దెందు వచ్చెద రని యెమిరువారు,
వస్త్రంబుఁ గొండు దేవర యోయి యిది చన్నఁ
బనసి దయపుట్టఁ బలుకువారు.

తే. కఱవి మామూక సిప్పింతుఁ దొంగెపఁ, గొకటి
యాఁడుదాని జే నంటకుఁ దనుచుఁ బెద్ద

1 పా. భూతప్రకర

తనము సరిమానమును దెంపు గనఁగ బలికి
సిరివి దోఁచిచ్చువారు నై తొలఁగి రపుడు. ౧౩

సీ. తొడువిండివాఁడు సన్నోఁగివఁ బోవక యెదు
రృడుశాంత్రఁ దొడిఁబడఁ బదరి పొంచి,
తినుఁ గీల పెనఁగినఁ బెద్ద నొంపక యెట్టుఁ
బాతించి చేఁ గలవాని నాఁచి,
యాయితంబై చించి యరిగెడువాఁ డేటు
నకు మీఱి చన్న వెఁజా దపులు కుడిగి,
పొదువు చే లేకయ వుటవుటయాను నైన
పాని శోధింప నవ్వలికిఁ బనిచి.

తే. పొసలఁ మాటిన నీఁచె దాఁపుం పెసల్పుఁ,
గట్టుబట్టలు గొని ప్రాఁతబట్ట దయను
గోఁచులకు నిచ్చి, గనవరాకులు నిగిడ్చి,
చెప్పుపట్టలు శోధించి సిగలు విప్పి. ౧౪

వ. ఇట్లు పాంచచ్చరులు పెచ్చుపెరిగి విచ్చలవిడి నుచ్చావచంబుగు సార్థంబు
నర్థంబు లపహరించు సంకులంబున. ౧౫

సీ. కటినుండి చనుమల గిడి గాఁగ బిగియించి
కట్టిన నిడు నీలికాసె మెఱయఁ,
బిల్లిగడ్డము మించఁ బెరిఁగి మీసలు కుక్షి
గోళంబుమీఁద నుయ్యాల లూఁగ,
బూఁది బ్రుంగిన మొగంబున గొదకిట్టు మై
నపుమైల ప్రాఁబౌతు నాఁజెంగఁ,
జిటిబ్రేలి పూసపై ఘటియిల్లు వెడఁబట్టు
చిమ్ముల సురియ దాల్మి మ్మరముగ,

తే. నూరనుండియుఁ గనుపెట్టుచున్నవాఁడు
దప్పిపో నన్ను దట్పాటు దాఁ బొదగని
యట్టివేళఁ గాకళ్ళత్రు వనెడు నొక ప్ర
చండ చండాల చోరభటుండు దఱిమి. ౧౬

చ. తన పటు డించి యేఁ గునుకఁగాఁ, సురెఁ గొంకులఁ దార్చి, కూలుడు,
న్నివిడిన బొజ్జపై మిగుల సిద్ధపు దోపతి దట్టి దొల్లిరాఁ,
డివిచి, పెనంగ, వల్లువముఁ ద్రెంచి, యనంతుని గంట్ల కూనవుం
జెవులుగ గొదకట్టు గనెచేరుల చెక్కుయు దోఁపు నొల్చి పోఁ. ౧౭

క. నోరిసని నుండ, కే 'నో
రోరి, యకట! మా సమీప పూరనె మనియుం,
దూరము వోయితివే! సో
మ్మేరితివి నీకు దక్కునే కాసిరా.' ౧౮

తే. అనిన లాఁతుగఁ గోల్పోక యతఁడు రద్దు
రాజుఁ గను నని కొదయుఁ దీర్పంగ మగిడి
యంత వరియును బైప్రవజ కలికి పాఁచ
పోవ వాఁడును వెకపోట్లు పొడిచి చనియె. ౧౯

ఉ. అంతట బొంతఁ బెన్దెరువునం దరుదెంచు విశ్రాంతిమంది మ
త్కాంత సహోదరుండును నొకం డరుదెంచుచు సాతు వద్ద వృ
త్తాంత మెఱింగి నన్నుఁ గని తాఁ గని యార్తి నొకింతు దా నతి
శ్రాంతుని నన్నుఁ గావట దినంతులు గొట్టుచు మోచు చేఁగుచోఁ. ౨౦

సీ. కొంగవాల్నఱకు లాగులఁ బట్టుచు డబ్బ
లంటఁ గుద్దిత వెజ్జు నరయువారు,
తలఁ బద్దపదియ ద్రవప్పుంగ్రాఁత మని యిడి
యంజలిగం జింప్ల నడుగువారు,
తమనేగఁ జెప్ప లో దయామీఱ వివి నీరఁ
జించి యియ్యంగ దీవించువారు,
నొలఁబడ్డ నెపమునఁ గలతేని నిరఁ జప్పి
చుట్టలపై దాఁకి వెట్టువారు,

తే నైక పాంథుంచేతఁ గ్రంపైన యూళ్ళ
జానగా నిఁ దెచ్చి యన్నిద దించి,
పాటు నీ రానఁ బోవ నూర్పాటి మరిది
వచ్చునాళోన సీరూపు వచ్చె నాకు. ౨౧

వ. కయ్యంబునఁ బాలుఁ బాలు గాయంబు సేసి వెలవేఁకిఁగొలిపిన కాకశ్మశ్రుసాహ్వ ధేయచండాలు కరాళవేషంబు గన్నులం గట్టినట్లుండఁ గడఁ గనుట నిట్టి కరాళవేషంబు గలిగెఁ; గైశికీగాన ఫలదానంబున దీని మానుపవే? అనిన నతం డేను ఫలంబెఱుంగ, ఫలంబు పరమేశ ముఖోల్లాసంబు, యాజ్ఞాకైంకర్యంబులకు ననుమతికైంకర్యంబులకు ఫలపరిమాణగణన ప్రపన్నులం కెక్కడియది? కాన బాధకంబగుట ఫలం బింతంత యందుఁ గొంతఁ గొమ్మనవెఱతు, భగవతుండ రక్షించు, నూఱడిలు మన్న నన్నోరిమాట నోరవ యుండ నతండు. ౨౨

సీ. స్నిగ్ధత్రిభాగ ముండిత శిరశ్శిఖతోడ,
హిమధవళోపవీతములతోడఁ,
బుహ్వష్టద్విత్రయోర్ధ్వ పుండ్రవల్లులతోడఁ,
తులసికాబ్జస్రగావళులతోడఁ,
గాఢీన కటిసూత్ర కాషాయయుగితోడ,
జలపూర్ణశుభకమండలువుతోడఁ,
బాణిస్థ దివ్యప్రబంధసంపుటితోడ,
నుత్తరవాక్పూర్వ కోక్తితోడఁ,

తే. బసిఁడిజిగితోడ బ్రహ్మవర్చసము వొల్చు
భాగవతలక్ష్మితో ధూమపటలినుండి
వెడలు శిఖవోలె నమ్మేను వెడలి చూడఁ
జూడ వైష్ణవుఁ డై నిల్చె సోమశర్మ. ౨౩

వ. ఇట్లు భాగవత పరిచర్యా ప్రభావంబున బ్రాహ్మణ్యంబె కాక భాగవతశ్రీయు నం గలిగి యుప్పొంగి యనుమతియగు చందంబునం బరమహర్షభరితుండై స్వరూపానురూపంబుగా నతనికిఁ బూజఁ గావించి. ౨౪

సీ. జయ దురుత్తరణ సంసరణాబ్ధిదళ నీర,
జయజయ గాయక సార్వభౌమ,
జయ శౌరి గాథా రసజ్ఞ పుణ్యరసజ్ఞ,
జయజయ తత్త్వసంభవయ పవిత్ర,

జయ జనార్దనీన జని సంగ వంచక
జయజయ దేశిక చరణ శరణ,
జయ యుక్తవాక్ర్యతిష్ఠా తృణీకృతదేహ,
జయజయ భగవదాజ్ఞాకృతిస్థ,
తే. జయ సకలజంతు సమచిత్త జయ దయార్ద్రి,
జయముకుందాన్యదేవతా శాస్త్రబధిర
జయచతుర్వ్యయభక్తిలక్షణచితాంగ
జయ మురారిప్రపన్నాంఘ్రి జలజమధుప. ౨౫

వ. అని ప్రస్తుతించి ప్రదక్షిణంబు గావించి పునర్పునర్భయంబున భవన శార్యా ప్రముఖ సుఖ విముఖుండై బదరీవనాదిపురుషోత్తమాధిష్ఠిత పుణ్యభూములఁ బౌనఃపున్యంబుగం దీర్థయాత్రఁ జరించుచుఁ బరమనిర్వృతిం బొందె. నిప్పుణ్య కథ వహనసమయంబునఁ గహనావరాహంబువలన మహీమహిళ మదీయ పూజోచితోపచారంబుల విశేషఫలదంబు గానంబ యన విని వైష్ణవియం దాఁ గావున దదాకలన కుతూహలంబునం గూఁతురై సీ కొదవి యహరహంబును విప్రలంభదంభసపీరితాగాధ గాథార్థసమేతగీతరసంబునం బ్రొద్దుపుచ్చుటగాని వేఱొండుగా దేమి తపంబు సేయుచున్నదియో యం చింతకంబెఁ బ్రేమ తపంబున్నదే? యన్నియును మేలయ్యెడు, శ్రీరంగంబునకు రంగేశు సేవింపఁ దోడుకొనిపోయి రమ్మనుటయుఁ, బ్రసాదమ్మని ప్రణామమ్ము సేసి పసిండిపల్లకి సబ్బాలికారత్నంబునునిచి పరిచారికాశతంబును భాగవతపరిషత్తునుం గొలవఁ బ్రయాణపర్యాయంబుల బరమానురాగంబునం బోయి. ౨౬

గోదాదేవి శ్రీరంగమున రంగనాథుని సేవించుట

మ. చని కాంచె న్విరజాబిధాంతః వపు స్స్పృహ్యోద్యవాతీర సం
దనవాటీ వలయద్రుమావళి దళాంతర్వ్యాళ్ళ పాపాళి కం
జన దాంపేయ సుమాయమాన విషమస్వర్ణాన్వృతిప్రాత ర
త్న సదస్సృక్కిళికాళి దీపకళికా శృంగంబు శ్రీరంగముఁ. ౨౭

క. ఏళీ హల్లక దళ కవ
పాళీ పాళీభవ ద్విపంచీ స్వన భృం

నింగి నీరెంతఁ గాయు వేదాంగు వినత
సుతుని నటఁ గాంచి మగఁడఁ దన్నతియుఁ గాంచి. ౩౩

వ. అతనిచే విజ్ఞాపనంబు సేయించి యనుమతిం గాంచి చతుర్భుజులు జలధర శ్యాములు శతపత్త్రలోచనులు చపలాపిశంగవసనులు వనమాలికాబద్ధబాహుమధ్యులు నైన మధుమథన ప్రతిబింబంబులం బోని పారిపార్శ్వకులఁ బరాంకుశ ప్రభృతిముక్తుల సేవించుచుఁ దదనంతరులై చని మహావకాశంబును మణిమయ స్తంభ సంభృతంబును శాతకుంభకుంభశోభిత శిఖరంబునునై చిత్ర నేత్ర వితాన లంబమాన నానాప్రసూనదామ ముక్తాగుళుచ్ఛాచ్ఛదామరంబును నుద్వేల కాలాగరుధూప ధూపితంబు నగు మహావిమానమధ్య విధుకాంతవితర్దికాతలంబునఁ జరణముఖ త త్త్రత్రయీ పిషిత ధర్మాదిసూరిపరిషదాత్మకంబును దేజోమయంబును నగు విపుల విమల పీఠంబునఁ బరిమళాలోలరోలంబజాలంబగు నంబురుహంబు జాంబూనద ఘటితమణివిస్తీర్ణకర్ణికోపరిపీఠి నూర్ధన్యపాథోనిదానంబునకుఁ బ్రథమ హేతుభూతంబగు భూతధాత్రియుం బోలెఁ బారద స్ఫటిక ఖచిత పాండురుచి పుండరీకంబును వసకు మసమనక లెనకొల్పు మినిమిగల కోఁగిలిఁగ రాగంబునకుం బరభాగంబు మిగులఁ దదాత్మకంబు యగు నుపబర్హంబున మహార్హకేయూరమణి ప్రకరంబగు కూర్పరంబు బూని మననవర మునిమనోరాగరస మార్జనంజేసి ... నరుణిమ వహించెనో యనఁ జాలు కెంగేలు కపోలంబునం గదియం ద్రిదశతరు కుసుమ కంచుళిత కంచుకితంచుకాత్మకంబగు దుకూల వినోళంబున నొత్తిగిలియున్న వానిం, గరింగ ... బెట్టి బిట్టు దనచేతి చక్రంబునం దెగవ నక్రంబు పూర్వ్యంబగు సాయుజ్యంబు నొందెనో యనఁ నుపరి పరిస్ఫుర్యమాన గండస్థలస్థ మణిమకరకుండల ప్రతిబింబ రుచి దంబకంబునం బరమ సౌందర్య మకరందనిష్యంది యగు ముఖారవిందంబున నందంబగు వాని. నిర్నిమేషదృష్టి నెట్టుకొని చూచుతఱి లీలావదాతయు తెప్పవట్టు తఱి బెద్దదర్శ్యాను కలధౌత గౌరగౌర మహా మహఃపూరంబున మునింగి దుర్నిరీక్షయు నగు నిజ రుచిర మూర్తివలనఁ దవదు సాకార నిరాకారతలు వారికిఁ జూపు రూపున దీపించు వానిఁ, గళత్రంబులగు శ్యామాద్యాములచేతఁ బ్రేముకిం బొమవంబడిన యట్లు కవ్వలు దొంగలు వగు పక్ష్మకాలిం నొవ్వ సోమ సూర్యాత్మకంబులం మెఱంద సిరువాలు బెళ్ళసెకం కన్నులం గెంపమ్మితేకళ వెదఁజల్లువాని, మంకెన విరి బింకంబు

సింకించు నధరశోణిమ నెపంబున వెలుంగు ముఖజనితపల్లవతాళనుతోఁ దత్సఖుం డగు గంధవహుం గూర్చి నిక్కినన నొక్కింత నిక్కి చొక్కపుఁ దొడిమఁ జూపట్టి తిల కుసుమ విలసనాపహాని యగు నాస భాసమానుం డగు వాని, నుదరజాత శ్వేతధామతామరసంబుఁ గనుఁగొని మహదాశ్రయంబు గనిన పూర్ణిమాశశాంకుఁడను శంక నాతనికి నాకు వైరంబు మాన్పుమని తత్సహోదరిగావున రత్నకాంచనంబులు లంచంబులుగా నివేదించి యడుగ లొత్తు నిందిరకు వరముం బడియున్న రాహు వనం గేయూరకటక మణి ముద్రికాంకితం బగు దీర్ఘ బాహు పరిఘంబు కటితటోత్సంగంబున మెఱయు వాని, నురఃస్థల న్యస్త నిస్తులాస్తోక కౌస్తుభ గభస్తి మండలంబున నిందోల గంబుండు పుండరీక వికేతన తనుచ్ఛాయ యన నచ్ఛచ్ఛం బగు శ్రీవత్సంబున లోచనోత్సవంబుఁ గావించువాని, విజితమృగనాభి నాభిసౌరభ్యంబునకు నెఱయు నుత్తుంగ భృంగ మాలిక యన మెఱయు ననిత పేశలతులసీపలాశ దామం బున నభిరామ కోమలాలంకృతి యగువానిఁ, గపట కరటి విరోధియై యసుర యనుటుం గాని మనుజాంగంబు సంగీకరించునెడఁ దలంపం బడమి నట్లనయుండె నన బడుగగు నడుము పసఁ గడునొడిక మగువాని, ఘనజఘన చర మేతర ధరాధరాధిత్యకాతలంబునం గాంచన కాంచికామణిమకుట గగనమణి గాయు నీరెండ మెం తనంబరగు మెఱుంగు పీతాంబరంబునం బొదువంబడి దాని సన్నదనంబునఁ దన సన్నదనంబు వెలువలం దోఁప గనక పుష్య రాగంపుఁ దెరవారు వైదూర్యమణి స్తంభ యుగంబునుంబోలెఁ గించిదాపీత నీలిమం బగు నూరుయుగళంబు వానిఁ, త్రైవిక్రమం బగు విగ్రహంబుతో నాగ్రహంబున మీఁదికిం జూచు తఱిఁ జంక్రమణరయంబునం దగిలివచ్చిన మణిమయస్వర్భువన జాంబూనద ప్రాకారవలయంబునం దీండ్రించు నుద్దండ గండపెండేరంబునం బొదవు నఖంద ప్రకామంతలంబునం బరిహాసితంబులై మత్తివండుల పదువుగల మడమల బెడంగుపడి భావి నిజ కమఠాపహార సూచకంబులుం బోలెఁ గొదమ తామేళ్ళ మేళ్ళనగు మీఁగాళ్ళతోఁ గోకనద మృదూదరంబు లమర మెఱుఁగు టెక్కుల జిగి మొక్కపఱుచు నఖచక్రవాళ చంద్రికల భక్తజన మనస్తమోవిదళనంబుఁ గావించుచు హలకులిశ కలశ కమల మకరాంకుశాంకితంబులై లక్ష్మీకుచ కుంకుమాకలన నరుణారుణంబు లగు చరణంబులం దావత్రయాపహరణంబు సేయువానిఁ, నారాయణుం

బురాణపురుషుఁ బురుషోత్తముఁ బ్రణతార్తిహరు వాసుదేవు హృషీకేశు నీశసుతు విభీషణవరదు ససంగజనకు రంగరమణుం గాంచి సహ సమాగత భాగవత పరిషత్సమేతంబుగాఁ దానుం దనుజాతయుం బ్రమద భయ భక్తి రసమగ్నలై జయజయ శబ్దంబుతో సర్వాంగాలింగిత క్షోణీతలంబు లగు సమస్కారంబులు గావించి నిలిచి నిటలతటఘటితాంజలియై యిట్లని నుతి యించె. ౩౪

తే. విభగృహాలయ విత్త సేవధికి శరణు
చిరకృతేక్ష్వాకువృష్ణ్యారాశికిని బ్రణుతి
దనపతిబ్రాప్తకులదేవతకు జోహారు
నతమృదావిక సుమనస్సునకు నమస్సు. ౩౫

తే. కొలుతు సర్వేశు సర్వాత్మకుని ననంతు
నప్రకాశు నభేద్యు సమస్తలోక
సముదయాధారు నఖిలసమూహములకును న
టీయు నిన్ను నన్యాధారు నిత్యు సత్యు. ౩౬

క. నారాయణు భూ ప్రభృతిక
గౌరవ ద్వన్ముఖిలతఁ దెఁచె మిగిలి పెం
పారు గరిష్ఠత గల వర
పూరుషు శరణంబు వేఁడి పొగడెద నిన్నున్. ౩౭

తే. ఆఁశివాదిక మగు నీసమస్తజగము
నెందుఁ బ్రభవించు వర్తించు డిందు నట్టి
మహిమ కిమ్మైన నిత్యు నమస్తభూత
మయుఁ బరులకంటెఁ బరు మహామహునిఁ గొలుతు. ౩౮

సీ. పరపురుషునికంటెఁ బరుఁ బరాఁ జనవాస్య,
పరమాత్ము, ముక్తికై వరమయోగి
పరిషత్తుచే సదా భావింపఁబడువాని,
నెవ్వనియందుఁ బ్రాకృతము లైన
సత్త్వాదిగుణముల సందడి లే దట్టి
విమలుని, సర్వభూతములకంటె

సాధ్యుఁడు శుద్ధుండు నగువాని, విభుఁ, గళా,
కాష్ఠానిమేషాది కాలసూత్ర

తే. మయిన యెవ్వాని శక్తి యింద్రియవితతికి
గోచరము గాదొ సర్వేశుఁ డై చెలంగుట
నతివిశుద్ధుఁడు దానయ్యె నౌపచారి
కృత్తిఁ బరమేశుఁ డగు నిన్ను విష్ణుఁ దలఁతు. ౩౯

వ. అని పరస్వరూప సురసేవ్య భవ్య దివ్యావతారలీలలం బ్రస్తుతించినఁ గౌస్తుభాభరణుండు కరుణాతరంగితంబు లగు నపాంగంబుల నమ్మునిం గనుంగొని కుశలప్రశ్నంబుఁ గావించి కంకణాలంకార క్రేంకారంబు లంకురింపఁ బదపంకజంబులకు, గుసుమాంజలులు సమర్పించు సకలసీమంతినీసీమంత ముక్తామణి యగు నాముక్తమాల్యదరూపు నెలఁ బ్రాయంబు సాభిప్రాయంబుగాఁ జూచి తనలోన. ౪౦

సీ. దీనిమూపు మెక్కుఁ గానెకా సిరిపట్టి
కిని బోర బిరుదుఁదెక్కెంబు గలిగె,
దీనికౌ నల్లాడఁ గానెకా గర్వించి
యుర్విఁ జైత్రునకుఁ గాలూఁద గలిగె,
దీనిపాలిండ్లుబ్బఁ గానెకా రతి చేతి
కిన్నెరమ్రోఁతకు వన్నె గలిగె,
దీనిమో మొప్పారఁ గానెకా వాణి రా
యంచలేమకుఁ గలాయంబు గలిగె.

తే. దీని వెన్నెఱు లేపారఁ గానెకా ప్ర
పోషితమయూరికి విరాలి పొంకఁ గలిగె
దీనియడుగులు రంజిల్లఁ గానెకా వి
పానఁ బడుతేఁటులకు మెట్టపంట గలిగె. ౪౧

తే. అనుచు నువ్విళులూరి మురారి తమక
మాఁపలే కాత్మ దివ్యశుద్ధాంతసీమ
కన్నెలంతఁ దార్చి యొక్కమాయావధూటి
నట్ల కావించి వారున్నదనియ యుండ. ౪౨

వ. పూజకులచేఁ బాదతీర్థప్రసాదపరివేష్టనంబు లిప్పించి విడిది కనిపిన గుడి వెడలి శాంబరీతనుసంభవం బాలికిం బెట్టి గృహంబునకుం జని వంజరంబు సతలించి యచ్చంచలాక్షిం గానక.

శా. ఆబ్రహ్మణ్యము! లోన వైదికానె న్యాయంబున న్మత్సుతం దా బ్రహ్మదుల మేర నిల్పియుఁ బ్రభుత్వం బూఁదియుం దోఁతురే యీ బ్రక్కన్ ద్విజుఁ జూచ రయ్యె నభవా శీరంగభృత్తంచు దుః ఖాబ్ధిం బడి బాష్పకంఠుఁడు సముద్యద్దోషలాలుఁడు నై. ౪౪

శా. అంతేవేతుకయైనఁ బెండ్లిగుట కీ నా, దేహము బ్రాణముల్ సంతానంబు నిశాంతము స్థనము నన్యంబు ల్పశుశ్రేణు లే కాంతన్పస్వతనార్చనంబునక కాదా కూర్చుదే, మీ, కయో వింతే, యీ బుడు తెంత. న న్గుబుచఁ గావింపం దను న్మెత్తురే! ౪౫

చ. శివుఁడు విరించి వాసవుఁడుఁ జెప్ప నశక్తులు, కొల్చునట్టి వా రవుట, సిరంకుశుండ నని యక్కట పాడిఁ దొఱంగఁ జెల్లునే! భువనములెల్ల నీ వయినఁ బొంత దయానిధి యమ్మ లేదె? భా గవతులు లేరె? నా కొఱపఁ గాఁగ వహించుకొనంగఁ గేశవా. ౪౬

ఉ. నెట్టన యల్లి లచ్చి యల నీళయు భూసతి యుండ, నీకు నీ నెట్టిక నీలపై మనసు నిల్పుట కే మనవమ్ము? వెఱ్ఱి యౌ నట్టుగఁ బేద నన్నుఁ బరిహాసము సేఁతకుఁ దక్క, వింత చూ పెట్టిది? దిద్దు నెవ్వఁ డిల నేలులవంగల వారిదొంకలున్. ౪౭

వ. అని యిట్లు ధరణీసురుం డదవెట్ట భాగవతక్షోభంబునకు భువనభర్త యు భయంపడి తద్భాంపవనంబునకుఁ గేలిసేయుచున్నవాఁ డను భావం బనతిఁ దోఁప మకరకుండలమండితంబు లగు గండదర్పణంబులం జెలువ వ్వేలర్ప నిట్లనియె. ౪౮

చ. ముది మఱఁదప్పితోటు మునిముఖ్య! భవత్తనయ న్గృహంబునన్ బదిలము చేసి వచ్చి మఱి బట్టబయ ల్వెదుదూరు దూరె. దా నదన మిఁ కొక్కమా టరసి చంచలలోచనఁ గాన కన్న దూ రెదు మఱి కాని బుద్ధివిపరీతతఁ బొందక పోయిమా కుమా. ౪౯

తే. అనిన నాతండ్రియా యాఁడె నే యనియె నేమె
ఱుంగ మే యార్తిఁ గడవు చల్లఁగఁ బలికి
కరుణఁ జేసితి విజుని గమ్మ యంచు
బాష్పముల మాఁగి యింటికిఁ బరువువాఱి ౫౦

ఆ. ప్రమోక్తి నట్టి తనయ మూర్ధంబు మూర్కొని
ప్రమదబాష్ప మరుల బ్రాహ్మణుండు
చేత వెన్ను నిమిరి నాతల్లి నినుఁ గంటిఁ
గా యటంచు నింద కలఁ పనింప. ౫౧

తే. రంగపతి బ్రహ్మ రుద్రుల బ్రాహ్మి గౌరిఁ
దనకు నక్కన్య నడిగింపఁ బనుపు నమును
వారు సేనేశ సహితులై వచ్చుటయును
విష్ణుచిత్తుఁడు నంబ్రమా న్వితుఁడ గుచు ౫౨

వ. విష్వక్సేనపూర్వకంబుగా వినయంబున నాతిథ్యంబు లొనంగి యుచితాననంబుల నాసీనులైయున్నవారి యాగమనప్రయోజనం బడిగి తెలిసి ప్రమదరస భరితాంతరంగుండై యిట్లనియె.

గోదాదేవి శ్రీరంగనాథుల వివాహము.

క. ధన్యుఁడ నైతిం దన కీ
కన్యక నీఁగాంచి భృగువుగౌరవముఁ బయో
ధిన్యాయము నొదవె నిదే
సన్యాయంబే? చమూప హర విధులారా. ౫౩

క. విను డీఁ దగు నంబంధపు
టెనయికఁ గని మోచి తెచ్చి యిచ్చె ననరె చు
ల్కని నరులు; గాన మాపుర
మునకు న్విజయంబు చేయఁ బుత్త్రిక నిత్తున్. ౫౫

తే. ప్రభుతఁ బరమేశ్వరుం డైనఁ బత్త్రివన్నె
ఇనమాన కొనంగు మీకు నీ చనవు. శౌర

తానె కట్టినభూమికఁ దాల్చు మాకు
ఘనత యిది మమ్ముఁ జేయుట తనదు ఘనత. ౫౬

తే. అనినఁ జని విన్నవింప దయారసాబ్ధి
చిత్తుఁడై విశ్వభర్త పక్షిప్రధాన
పావవాహ్యంబు నెక్కి బ్రహ్మాదిసురలు
బలసి తమతత్తదుల నెక్కి కొలిచి రాఁగ. ౫౭

క. నాసీరుఁ డగుచు సూత్రవ
తీసఖుఁ డుడుపీథిఁ బోఁకఁ దీర్చిన వ్రజ భూ
షాని శతకోటి శతకో
టి సవితృప్రభలు దిశల దెప్పర మలమన్. ౫౮

వ. శ్రీవిల్లిపుత్తూరికిం జని విశ్వకర్మ మణిమయంబుగాఁ గట్టిన విడిది పట్టున విడిసి యయ్యాదిమవరుండు వివాహప్రసంగలు హంసాదికస్నానీయ మంగళ ద్రవ్య మందనం బొనర్పఁ బెండిలికొడుకై దివ్యవాదిత్రంబులు నారదాది దివ్యముని గానంబులు వెలయం గలధౌత ధవళ ధారాధరంబులు గురియు సుధాధారల నభిషిక్తుండై ముక్తావళీ కౌస్తుభాముక్త కంబుకంధరుండును గేయూరకంకణా లంకృతుండును మకరకుండల మకుటాది భూషావిభూషితుండును దివ్యాంగ రాగ భూషితుండును పీతాంబర సంవీతుండును దులసీకల్పితరు ప్రసవస్ర గ్గాత్రితోరస్కుండునై యుండు నంత, నక్కడ నటకు మునువ గృహప్రవే శంబునేసి సంభ్రమాయత్తుం డగు విష్ణుచిత్తు ప్రయత్నంబున. ౫౯

క. శర్వాణీ వాణీ ముఖ
గీర్వాణీకోటి జానకీరఘుకులరా
ట్పూర్వాచరిత వివాహో
త్సవ సుగీతములు పాడఁగా విభవమునన్. ౬౦

తే. నెమ్మి నేకావళియు గ్రసగ్రైవేయయును జామ
రంబు లిరుగెడ నిడ హరిద్రాద్రవమునఁ
జెట్టిరి నలుంగు లక్కన్యఁ బెండ్లికూఁతుఁ
జేయ ఋషిపత్ను లర్థి నాశీర్యుతముగ. ౬౧

ప్రకృతికాంత క్రాంత సురకాంతలం గూడుకొని సంతరింప, హుతవహుం డగరుధూపంబు రేచఁ, బర్జన్యుం డుల్లెతయిడఁ, బ్రాచీన పాఠంబులు పాఠకౌముంబులయి బిరుదప్రబంధంబులు పఠియింప, విధినందన సనందనాదులు సంగీత మాంగల్యంబున నంతరంగంబున కింపొసంగ, విహంగపుంగవుండు మత్తమాతంగంబై ఖచితమణికల్యాణం బగు పల్యాణం బంగీకరింప, నప్రాకృత వైభవంబునం జని, పరమసంభ్రమంబున భాగవతపతంనంబు భక్తికలిత బహుప్రణామపూర్వకంబుగా నెదుర్కొన నెక్కిరింత దిగ్గి విష్వక్సేను కరం బవలంబించి కక్ష్యాంతరంబులం జంచలాక్షులు గడుగు నడుగుల జలంబులకుం బయిపయిం బడి గీర్వాణ సిద్ధ సంఘంబు లహంపూర్వి నుర్వి నిర్వారిగా నూర్చికొని ప్రాకింపఁ బ్రవేశించి తదీయ నిర్దిష్టం బగు కాంబూనద పీఠంబున నుపవిష్టుండై యతండు వెండియు బంగాముత్యంగారుకంబులఁ గనక భాజననిక్షిప్తంబు లగు కుశేశయ పేశల పదకినలయంబులు గడిగి షోడశోపచార సహితంబును సవరిక్రియంబు నగు మధుపర్కంబు నొసంగం గొని యయ్యాళ్వారు దేవేరియుం దానును ధారవోయ నా కన్యకారత్నంబుఁ బరిగ్రహించె ననంతరంబ. ౬౬

మ. కలధౌతద్రవ చిత్రము ల్కెఱయ ముక్తాన్యూత మౌ మేచకాం
చలవుం బెందెఱ వారి లగ్నము సమాసన్నంబుగా వేల్పుఁబె
ద్దలు పంపఁగ గుడ జీరకంబులు నముద్యత్ప్రేమ నన్యోన్య మం
జుల మస్తంబుల నుంచి రర్థిఁ గనుమించు ల్చిఱుము ట్టాడఁగన్. ౬౭

చ. మఱి పనసాలి చూడమున మానిని ముత్తెపుఁబ్రాలు వోయుచో
మెఱయుఁ దదంగుళీకినల మేళనఁ జిక్కి చెమర్చ రాలి మై
నతిమతి ఘర్మబిందువులు నమ్మణులు న్మొగిలందునుండి డా
ల్గిఱిగొన వాలు ధారల బలె న్వడగండ్లబలె న్గనుంగొనన్. ౬౮

తే. ఇంతి దోయిట సేసఁబ్రా లెత్తుచోట
గుబ్బపాలిండ్లకేవ గ్రక్కున మురారి
గన్ను వేయుటఁ గని లజ్జ గదుర బాహు
లెత్తక కరాగ్రములనె పై కెగరఁజల్లె. ౬౯

క. గళమునఁ గట్టెను హరి మం
గళ సూత్రము పులక లలిప గాత్రముఁ బొదువన్
నెలఁతయుఁ బతియును గరముల
వలపలిచిరి కంకణంబు లన్యోన్యంబున్. ౭౦

సీ. లలివచే నిష్ఠతో లాజలు వేల్పించి,
శార్ఙ్గి మెట్టించెను సప్తపదులు,
తెలివిఁ గూడి యరుంధతీ దర్శనముఁ జేసె,
బ్రహ్మరుద్రాది గీర్వాణకోటి
యర్పించు నుడుగుర లనుకంపఁ గైకొని
యనిచెఁ బ్రసాదభాజనులఁ జేసి,
యాత్మపట్టణమున కతివఁ దోడ్కొని విజ
యంబు సేసెను మహాహర్ష మెప్ప,

తే. సహ్యకన్యాతటోద్యాన చందనద్రు
కుంజముల నీలకుంతలఁ గున్తరించి
కంతుసామ్రాజ్యమేలించి కరుణఁ జిత్త
మొలయ జగములఁ బాలించుచున్నవాఁడు. ౨౧

ఉ. స్కందసరస్తటీరమణ కందర చందన కుందవాటికా
మందసమీరలోల వనమాలిక, నిర్మలదివ్యవిగ్రహా
స్పందవిభాధరీకృత నభస్స్ఫుట కాళిక, వల్లవాంగనా
బృందమనోభిమాన ధృతి భేదన, పేశలవంశవాదనా. ౨౨

క. అరిధారాఖండిత మధు దరిసంఘ, విహంగవాహనా, యుదరమహాం
బురుహ పుటభరిత మధుళం బర భర జలమానుషాయమాణద్రుహిణా. ౨౩

స్రగ్విణి. వాలినిర్భేదనా వారిజాతేక్షణా
శైలకన్యాస్తుతా శార్ఙ్గచంచద్భుజా
పాలదృక్పద్మభూపాకభేదిస్ఫుర
న్మౌళిమాణిక్యరుజ్మండితాంఘ్రిద్వయా.

మ. ఇది నీలాచలనీలచేలక సుభద్రేందీవరాభాక్షి కో
ణదృగంచద్భుజవీర్యధుర్య జయసన్నాహోర్వటీవాహ్యళీ
త్యుదితేభేశ్వర కృష్ణరాయమహీజాన్యుత్పాదితాముక్తమా
ల్యద నాశ్వాసము సప్తమం బలరుహృద్యంబైన పద్యంబులన్ ౨౪

సంపూర్ణము

శ్రీ కృష్ణార్పణమస్తు

ఓం తత్ సత్

# కొన్ని శబ్దములకు

## ప్రకరణోచితార్థములు

## (GLOSSARY)

### అ

అంకకాఁడు = బలశాలి

అంకెవన్నె = రౌతు కాలుంచి యెక్కుటకు గుఱ్ఱమునకు పార్శ్వమున వ్రేలఁగట్టెడి యినుపవలయముతోడి వారు.

అంచపదము = వ్రాఁతలో నడుమ అక్షరనష్టి సూచక చిహ్నము.

అంజనము = 1. ఆ పేరి యేనుఁగు.
2. మాలిన్యము.
3. కందెన.

అంట = గంటు

అంటిక = ప్రొయ్యి

అందంబుగూడుకొను = వానితోఁ దాను చేరు

అందు = అందుచున్న; అనుచున్న

అంధుయంత్రము = ఏతాము

అగప = అటక

అగపడు = అగ్గము ( = స్వాధీనముపడు)

అజస్రము = సర్వదా

అడవెట్టు = మొఱయిడు

అడుపఁ = మొత్తఁగా

అతంత్రము = వికలము, భగ్నము

అతర్క్యము = ఊహింపమి, అరయమి

అదటు = గర్వము

అదవకాఁపు = అస్థిరపుఁగాఁపు

అనరు = ఇబ్బంది

అనిష్టుఁడు = వైరి

అనుగళత్ = మాటిమాటికి పడుచున్న

అనుపు = సుంకము

అభిఘారము = పైని (నూనె, నేయి) పోఁత

అరి = ధనరూపమైన పన్ను

అలితియొడివి = గొంతుగండి

అలము = ఆక్రమించు

అవిద్య = 1. అగ్నిహోత్రాది కర్మ
2. అజ్ఞానము

అహంమానము = అహంకారము

అహి = 1. పాము 2. తనవాఁడు

అగ్గలిక = ఉత్సాహము

అగ్గెడ = అకృత

అగ్నిశిఖ = కుంకుమపువ్వు

అద్దా వాక్ = 'సరి' అనుమాట

అలుకు = భయము

అశ్మసారము = ఇనుము.

### ఆ

ఆఁక = నిరోధము

ఆకర్షకము = సూదంటురాయి

ఆతతాయి = (తన్ను) చంపవచ్చిన వాఁడు

ఆపాగా = తబేలం ( = గుఱ్ఱముల నుంచు చోటు)

ఆమని = సుళివిడి (వసంతఋతువు)

ఆయతికాఁడు = ధనమార్జింప వలసిన వాఁడు
ఆరు = తృప్తిపడు
ఆలావిని = తంబురా
ఆవులు = ఆవిరులు
ఆద్యము = శ్రేష్ఠమైనది
ఆర్చు = ఆడించు = పలికించు
ఆర్తి = ఇబ్బంది

## ఇ

ఇంగాలము = బొగ్గు
ఇడియు = చిదుగు, కూలు
ఇడుపు = ద్వారపార్శ్వము
ఇతరేతర = ఒండొరులతో
ఇనుఁడు = 1. సూర్యుఁడు 2. రాజు
ఇరమ్మదము = మేఘములోని జ్యోతి
ఇచ్ఛకులు = ఇచ్ఛకముగా నడుచువారు.

## ఈ

ఈఱము = పొద
ఈలకఱచు = ప్రాణము బిగబట్టు
ఈలువు = మానము
ఈషి = చూచు (= తలఁచు) వాఁడు

## ఉ

ఉదస్తు = పని నుండి తొలఁగింపఁబడిన వాఁడు
ఉదార = పెద్ద
ఉదుటు = ఉద్ధతి
ఉపాంశున = రహస్యముగా
ఉబుసుపోక = విరామకాలక్షేపము
ఉరవు = ఉచితము
ఉలుకు = జంకు
ఉలుచ = చిన్నచేప
ఉలుపాలు = కానుకలు
ఉప్ప్రానము = కలుషు
ఉత్పాతము = లోకస్వభావమునకు విపరీతమైనది
ఉత్సేకము = గర్వము
ఉద్గారము = త్రేన్పు
ఉమ్మనీరు = ఉల్పనీరు, ప్రసవజలము
ఉల్లనము = పరిహాసము
ఉల్లెడ = మేలుకట్టు.

## ఊ

ఊఁదు = ఊను
ఊర్జస్వలుఁడు = మిక్కిలి తేజోవంతుఁడు

## ఋ

ఋతువేళ = ఋతుస్నానవేళ

## ఎ

ఎగకాఁడు = కుంటెనకాఁడు, తార్పు కాఁడు
ఎడవు = దూరము
ఎరవు = సొంతముకాని, లాఁతితనము, తాత్కాలిక జీవనము
ఎఱ = మేఁత
ఎలగోలు = మొదట కురిసినది, వాన
ఎత్తు = దంత
ఎవ్వ = ఏవ, లేమి

## ఏ

ఏకాంగి = ఆలుబిడ్డల వదలి, కావి వస్త్రములుదాల్చి ధర్మ ... కర్యము చేయు విరక్తుఁడు
ఏతరి = నీతిమాలినవాఁడు
ఏవిరి = హద్దు
ఏరుసాగు = దున్ను

## ఐ

ఐకకంఠ్యము = ఏకాభిప్రాయత్వము

## ఒ

ఒండె = ఒక్కటె
ఒదర్చు = ఊడలాగు
ఒదుగుగా = సమృద్ధిగా
ఒరుము = చులుకెక్క
ఒరుదలకాఁడు = కొండెగాఁడు
ఒఱయిడు = ఆలోచనచేయు
ఒట్టు = అంటు
ఒడ్డు = నిడుపు
ఒల్లఁబోవు = మూర్ఛిల్లు

## ఓ

ఓటము = పరాజయము
ఓహరిసాహరి = తండోపతండము, నేను ముందు నేను ముందు అని.

## ఔ

ఔరు = పెల్లగిల్లరాని గంట

## క

కంకణము = 1. గాజు
2. కంకణాయి పక్షి.
కంకము = గద్ద
కంటకిత = 1. గగుర్పొన్న
2. ముండ్లుగల
కందనకాయ = గుండెకాయ
కందు = నొచ్చు
కుండము = 1. నరస్సు
2. కుండ
కక్కసము = బలవంతము
కటకాముఖము = బాణముపట్టుకొనననుతగు పిడికిలి
కట్టావి = 1. పొగ, 2. మిక్కిలివేడి
కడ = దావు
కడార = పసుపుపచ్చ
కడార కాచకటకము = పచ్చని లక్కగాజు
కనరు = ఓగరు
కనుగలుగు = చక్కఁగ పరికించు
కన్కినరు = అసూయ
కన్దుఱుకు = నేత్రధారాధళ్యము
కన్ను = 1. మృదంగవాద్యముఖపు గీఁగ
2. జాడ
కఫోణి = మోచేయి
కమన = కామించువాఁడా
కరక = వడగల్లు
కరభము = మనికట్టు మొదలు చిటికెన వ్రేలివఱకు గల చేతి బయటి భాగము
కరవటము = బరిణి
కరి = సాక్షి
కరుళ్లు = గడ్డలు
కర్కటిక = దోస
కఱ (ట్టి, ఱు) కుట్లు = ఇనుపసలాక యందు గ్రుచ్చి కాల్చెడు మాంస ఖండము, శూల్యము
కల్పు = కరంచు
కవురుమాసిని = కపటముగలవాఁడు
కసీనము = మైలుతుత్తపు నలుపు
కాంబవ = కంబు (= శంఖము)యొక్క.
కాడుపడి = దారితప్పి, విభ్రమచెంది
కాసఁగ = వెలుంగునట్లు
కార = చెఱసాల
కారుకుఁడు = శిల్పి
కావులు = కావివస్త్రములు
కిటకిటన = కృశము
కిట్టు = తగులు
కిరి = పరాహము

కీకటులు = మ్లేచ్ఛులు
కీకనము = వచ్చియెముక
కీలుమదము = కీలు (వన్నె-నలుపైన) మదము
కీల్కొనఁ = నాటునట్లు
కుండము = కొలను, కుండ
కుట్టుసురు = కొఱప్రాణము
కువ్వసము = అవిక
కుబుసము = చొక్కా
కుఱు = చిన్న
కూపెట్టు = మొఱయిడు
కెలనము = పని, హేతువు.
కెళవు = ప్రక్క, పార్శ్వము
కేదారము = శిరస్త్రము (helmet)
కేరడము = పరిహాసము
కైజా = కళ్ళెము
కైశికము = టక్కు
కొట్టికాఁడు = వేఁగులవాఁడు
కొడిమె = నింద
కొదవెట్టు = లోపము కల్పించు
కొప్పెర = కటాహము
కోటియిడు = వేగు ఉంచు
కోరు = ధాన్యరూపమైన పన్ను
కోలము = వేషము
క్రంత = పెండ్లికొడుకువారు పెండ్లికూఁతు నకు తీసికొనిపోవు ప్రధాన ద్రవ్య సముదాయము
క్రందుగా = దొమ్మిగా
క్రాయు = ఉమియు, క్రక్కు

## ఖ

ఖంజన = కాటుక పిట్ట
ఖని = గని
ఖనిత్రము = గడ్డపాఱ
ఖలూరిక = గరిడీ

## గ

గంప = వైరుదుంప
గంటు = ముడి
గండె = మత్స్యము
గంధర్వము = గుఱ్ఱము
గచ్చు = పూఁత
గడి = ఎల్ల
గనెలు = ఖండములు
గరిగ = చిన్నపాత్ర
గరుసు = వచ్చితోలు
గల్లము = చెక్కిలి
గామిడి = ప్రౌఢము
గిరిక = చిట్టెలుక
గిఱవు = కుదువ
గుట్టుకీడు = గూఢశత్రువు
గుటి = గుఱుతు
గూడ = బుట్ట
గొంతుక్రోల్ = కంఠనాళము
గోపిక = కావలియాడుది
గోము = సౌకుమార్యము
గోంగగ్గెర = కాళ్లుచేతులు పసరమువలె చేర్చి కట్టుట
గౌదకట్టు = చెంపలను మూసి కట్టినగుడ్డ

## ఘ

ఘరట్టము = తిరుగలిపై రాయి
ఘుణ = ప్రమానుతొలుచు పురుగు

## చ

చండాతకము = చల్లాడము
చంద్రము = సిందూరము
చక్కఁజేయు = ముగించు, చంపు.
చదుము = చదును ప్రదేశము
చనుమఱు = చన్నునలువు

చలి = 1. సీతు 2. జంకు
చల్లువెన = పిడికిళ్లతో చల్లకము
చవి = 1. స్వాదిమ, 2. ముత్తెము బరువు
చాఁగు = పేఁగు
చాఁవట్టు = పలుచని యట్టు
చిట్టకము = కపటము
చెండాడు = చెండు. కొఱుకు
చెదరు = విదరు
చెలుకదము = బెల్లము
చెఱ్ఱ = బీడినేల
చేమమడి = చేమకాడల పొలము
చొచ్చు = ఇచ్ఛగించు
చౌతు = కళ్లాయి
చౌదంతి = నాలుగు కొమ్ముల యేనుఁగు
చౌరుకొట్టు = వాసనకొట్టునట్లు సమలు

## ఛ

ఛత్రాకము = పుట్టగొడుగు

## జ

జంభలము = నిమ్మ
జక్కులభోనము = మిథ్యాభోజనము
జజ్జుకొను = జజ్జుపడు
జడను = అలస్యము, జాడ్యము.
జల్లులు = జాఁరులు
జాంగలము = మెట్టచేను
జానుదిప్ప = మోకాలిబంటి
జాలి = ఖేదము, వెత
జిలుగుపని = స్వల్పకార్యము
జీలుఁగు = ఒక చెట్టు పేరు
జూటుఁదనము = మోసము
జెన = గ్రంథ్లసమూహము
జోదన = జంట
జౌకుమడి = బురదకయ్య
జ్ఞప్తి = నిద్రనుండి మేలుఁకువ

## ట

టంకసాలవాటులు = నాణెములు
టెక్కు = టోపి.

## డ

డంబు = వేషము
డింగరీఁడు = భక్తుఁడు
డాత్కూటము = చేఁదు చేఁవ
డోఁగు = డోఁగు = మోకాళ్లపైన నడుచు

## త

తక్కుము = విడుము
తగడు = రేకు
తగులము = అడ్డు
తప = విరోధము
తడుకు = వెలుగు
తతము = పీట
తమూర్ధ్వచ్ఛాయ = పైకి వ్యాపించు అతని కాంతి
తని = సన్నని
తనుపారు = చల్లనైన
తపారము = టోపి
తరవాయి = ఉపక్రమించి జరుపుచున్నట్టిది
తరకసము = అమ్ములపొది
తటియు = చొచ్చు
తల = మీఁద
తలరి = ఉంకించి
తాపిన = చెక్కిన
తావలు = మెట్లు
తిమ్మనము = మజ్జిగ పులుసు
తియ్యము = ప్రియము
తివిరించు = యుద్దోపిడిచేయించు
తుసికిలు = జాలు

తూఁగింపు = నెఱవేర్పు
తుంపరాణి = తూను
తెరవేఁట = తెరలతో ఆవరించిన చోటి వేఁట
తేట = 1. నీటితేట
2. ముత్తెపుఁగాంతి
తేరకత్తె = పనిలేనిది, అక్కఱలేనిది
తొగరు = ఎఱుపురంగు
తొడిబడి = తొట్రుపడి
తొలఁకు = అల
తోమాలె = ఆకులు పువ్వులు చేర్చి కట్టిన మాలె
తోయి = మేఘము
త్రస్తరి = క్రింద ; పరిహాసము
త్రోపాడు = త్రైకొను

## ద

దంచనము — పెద్ద ఫిరంగి
దండ = భుజము
దండెత్తు = విజయార్థము సేనతో తరలు
దంశితము = మఱుపుదాల్చినది
దడములు = దట్టములు
దళ = కోఁత
దాత్ర = కొడవలియైనవాఁడా
దానవట్టు = దానముగాను
దీము = ఆకర్షకము
దును = దున్ను
దూపించు = దప్పిచే పీడనొందు
దౌ = దవ్వు
ద్రుహిణజ = నారద
ద్వయము = రెండువాక్యములు (వైష్ణవుల యొక్క నారాయణ రహస్యము)
ద్వైతము = జీవేశ్వర భేదము

## ధ

ధర్మము = లక్షణము

## న

నంబి = పూజారి (విష్ణు పూజకుఁడు)
నప్త = మనుమఁడు
నయము = సులువు
నల్లదాసరిగాఁడు = తాబేలు
నాకు = అనకు
నాగరము = సొంటి
నాగవాసము = వేశ్యలమేళము
నాటి = పాదుకొని
నిగ్రహస్థాన = పరాజయ హేతువు
నిట్టు = ఉష్ట్రవాసము
నిమితికాఁడు = బోయవాఁడు
నిర్వాణము = మోక్షము
నిశారజస్సు = పసుపుపొడి
నీరాజనము = నివాళి
నీర్వట్టు = దప్పి
నెత్తము = 1. జూదము
2. ఉమ్మడిబీడు
నెరవు = అగ్గము
నెరసెఁ = వ్యాపించెను
నెఱి = 1. విధము 2. ఆచారము
నెఱిక = కుచ్చెళ్లు
నెఱికురులు = కుటిలకుంతలములు
నెఱియలు = చీలికలు
నెఱుఁగు = ఒరుఁగు

## ప

పంజరంబు = బురఖా, గవుసెన
పండించు = వంచించు
పట్టము = తిరుప్పరివట్టము
పదరులు = గద్దింపులు

# ప్రకరణోచితార్థములు

పదువు = తండము
పసంటి = కుండ
పసివిసు = వచ్చు
పరి = 1. విధము 2. తోడిదండు
పరికరము = సొత్తు
పరుజించు = సిద్ధముచేయు
పలపల = ఇంచించుక ఎఱుపు
పలాలము = గడ్డిపోచ
పల్యాడి = కోటల రైక్ష్యము
పాకలము = ఏనుఁగు రోగవిశేషము
పాత్ర = ఆటవెలఁది
పిచ్చుగుంటు = కుంటివాఁడు
పినుగు = పీనిసివాఁడు
పిష్టాతకము = బుక్కా (గంధపుఁబొడి)
పీలువు = పఁమాఁవు
పులుగు = గుఱటు
పుష్కరము = గజతుండాగ్రము
పూగము = సమూహము
పృథుకము = పిల్ల
పెండెము = వలుకాఁడితలువు
పొగచూఱు = పొగచే నలుపెక్కు
పొగరు = సలువు
పొదువు = ధనము
పొరి = మెండు
పొలము = పోటు
పొల్లకట్టు = తుక మొత్తము
పొజులు = దండులు
ప్రకీర్ణము = చామరము
ప్రజానాథుఁడు = ప్రజాపతి, బ్రహ్మ
ప్రతిప్రవర్తకుఁడు = విపరించినవాఁడు
ప్రతిసూర్య = సూర్యుని ప్రతిబింబము
ప్రయాణము = మఁటి
ప్రౌఢి = నేర్పు

## బ

బందరువు = బొక్కసము
బండికల్లు = చక్రము
బంటోతు = బలిసినవాఁడు
బంహిష్ఠ = మిక్కిలి బహుళమైన
బచ్చు = సరాబు
బజీతు = అల్లరి
బంది = వెండి
బరితోలు = ప్రక్కతోలు
బఁరాది = పెక్కు
బానికము = 1. బానికెదంత
2. ఊరుమూలము
బిరుదు = ఉత్కర్ష చిహ్నము
బీతెంద = మిడియెండ
బొంది = దేహము
బొమిక = ఎముక
బొమ్మదాయి = చిన్న చేప (తలతోక మొనదేలి యుండునది)
బోధైకచుంచు = ముఖ్యబోధనచేత ప్రఖ్యాతమైన

## భ

భండారము = బొక్కసము
భద్రాసనము = 'భద్రము' అని ఒక కూర్చుండు విధము
భర్మపరికర్మవర్మ = బంగరు పనిచేసిన కవచము
భిద = భేదము, చీలిక
భూమిక = వేషము
భౌముఁడు = భూదేవి కొడుకు నరకాసురుఁడు.

## మ

మందు = అరుదు
మట్టు = పరిమితి

మధూళిక = మధువు
మరుత్తృణము = ఇంద్రధనసువు
మర్కటము = సాలెపురుగు
మలుచుట్లు = తిరుగుడు మలులు
మహౌషధి = సొంటి
మానిని = కూరుడు
మాఱుమలయు = ఎదిరించు, పోటికివచ్చు
మానరము = అతిశయము
మిథము = పరస్పరము
మిహిక = మంచు
ముంజి = మొలత్రాడు
ముఱు = దుర్గంధము
ముల్లుచూవు = హెచ్చగు
మూరింటోవు = అతిశయించు, విజృంభించు
మూలమంత్రము = (నారాయణ) అష్టాక్షరి
మృత్యువు = (మనుష్య) సామాన్య ప్రమాదము.
మైవడి = సమ్మతి
మొఱుగు = దాచు
మొగిల్చిరి = మబ్బుపడిచిన
మోటనము = నుగ్గునేయుట
మోరు = శిఖరము
మోహము = అవిద్య
మ్రాన్పడు = ఏమియు తోచకుండు

## య

యమి = (పరమ) హంస, ముని
యవసము = గడ్డి
యవసరాశి = గడ్డిమేటి, వామి
యామ్య = యమసంబంధమైన
యోగము = 1. చింతించుటలో నేర్పు
ధ్యానించుటలో నేర్పు
2. చిత్తనిరోధము.

## ర

రంతు = శబ్దము, రచ్చ
రసము = రుచి
రాంకవము = బూర్నీసు
రాహూయమాణ = రాహువువలె (పాము వలె) నగుచున్న
రెంట = విరోధము
రెంటంపు = రెట్టనేతవస్త్రము
రెంటము = గోచి
రెయి = రేయి
రైవేశ్మ = ధనాగారము
రోహితము = కొరకు, ధనుస్సు
ఱిచ్చ = దిగులు
ఱొచ్చు = ఒరుల సంపర్కము

## ల

లక్ష్మణ = వెంటిబెగ్గురు
లఘువు = గంతు
లడ్డిగ = నన్నమూతిపాత్ర
లచి = అనురక్తి
లన్నకము = వింటిపిడికట్టు
లాంపట్యము = లోలుపత్వము
లాచు = కాంక్షించు
లాతు = అధికము
లావరా = జలదారిమూయు పలక
లావణ్యము = ఉప్పుదనము
లోగు = వెనుదివియు
లోహండి = వంటకుండ

## వ

వంగళ్ళు = నిజికొట్లు
వడిబెట్టు = శుద్ధముచేయు
వయస్సు = ఆయుస్సు
వరుగు = గద్ద
వర్గాటులు = కప్పలు

వలిపె ఒల్లె = సన్నని వస్త్రము
వశ్యము = వశపఱచుకొనుట
వని = ఉత్సాహము
వాచవి = ఆస్వాదము
వారవాణము = కవచము
వారు = వట్టు
వార్చు = కనుపెట్టుకొను
వార్ధుషిక = వడ్డికాసులవాఁడ
వాహారులు = దున్నలు
వింగడము = 1. అందము
2. విశాలము
విచ్చుమొగ్గ = గుమి చెదఱిపోవుట
విరాళి = వలపు
విఱుగు = వరారియగు
విఱుచు = తేర్చు
విలుమంగి = విలుకాండ్రు
వీడిగలుపు = నష్టము గావించు
వీవధము = కావడి
వీశుఁడు = ఈశుఁడు జగత్కారణము
గాదనువాఁడు
వృత్తులకు = క్షేత్రాదిజీవనములకు
వృద్ధి = వడ్డి
వెంట = కార్యము
వెద = 1. చల్లకము, 2. గర్భాధానము
వెరంజు = ఇవురు
వేరువెల్లఁకి = మూలగర్త
వైజయంతము = ఇంద్రప్రసాదము
వైయాత్యము = దిట్టతనము

## శ

శకటి = చిన్నబండి (కుంవటి)
శణ = జనుము
శలాక = కమ్మి
శశాంకము = కర్పూరము
శశికదళము = కర్పూరవుటనఁటి
శింశుమారము = మొసలియాకారముగా
నుండు ఒక జ్యోతులగుంపు
శుభాశ్రయము = మంగళమైన తావు-
అనఁగా ధ్యేయము
శృంగాటము = నాలుగు దారులు కలియు
చోటు
శ్రీవత్సము = తెల్లవెంద్రుకలతోడి మచ్చ

## ష

షాడబము = రుచి.

## స

సంబదము = దారిబత్తెము
నడి = నింద
నమయము = మత సిద్ధాంతము
నరవణులు = ఇసువగోలునులు
సరియగు = నష్టమగు
నవతు = సామ్యము
సవరణలు = సామగ్రి
నవి = అని
సాత్కరించి = అధీనము చేసి
సాత్తని = శిఖాయజ్ఞోపవీతములులేని
సాత్తిన = అవి (అనఁగా శిఖాయజ్ఞోప
వీతములు) కలిగిన
సాత్త్వికము = నత్త్వగుణముతో చేసినది
సామి = నగము
సాహిణీలు = రౌతులు
సిరి = 1. ఐశ్వర్యము 2. కాంతి
సుంకము = ప్రతిబంధకము
సుమాళము = చిత్తోత్సాహము
సురియాలు = మాల
సూఁడు = వగతీర్చుకొను కోరిక

సేతువు = ఆనకట్ట
సొమ్ము = ఆభరణములు
సోకు = ప్రయాస
సోడాల్ = ముక్కెముకలు
స్థానికులు = దేవస్థానాధికారులు
స్రవంతి = 1. ఏఱు 2. ఇసుక గడియారము.

## హ

హట్టము = అంగడి
హఠము = బలాత్కారము
హరి = కోపము
హసంతిక = కుంపటి
హావడి = ఉపద్రవము
హేవాకము = ఇచ్ఛ

— : o : —

# శోధనము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ఉపోద్ఘాతము | | | |
| 2 | 3 | అఱి | అరి |
| 9 | 26 | డితో | డితితో |
| 15 | 25 | జ్గస్యకి | జ్గస్యచకి |
| 20 | 23 | సూల | స్థూల |
| 21 | 1 | వత్ప్రి | ఱత్ప్రి |
| 25 | 2 | దజ్గి | దజ్గ |
| 26 | 2 | క్లేష | శ్లేష |
| 29 | 8 | రగి | రవి |
| 33 | 9 | చొఱ | చౌర |
| 35 | 5 | నాపి | నాప్తి |
| 37 | 19 | పితి | స్థితి |
| .. | 20 | వాదము | వాదముఖ |
| 38 | 25 | రక్షి | రక్ష |
| | | పుట్ట | పుట్టి |
| 39 | 19 | బరి | పరి |
| 40 | 30 | పెంచు | పెంచుకొం |
| ఆముక్తమాల్యద | | | |
| 10 | 2 | పీఁటి పీఁటి | పీటి పీటి |
| 12 | 18 | నగ | నగ |
| 22 | 4 | సూష్మ | సూక్ష్మ |
| | 22 | మలు | మల్లు |
| | 28 | ద్లురు | ద్గురు |
| 24 | 24 | వేల | వేళ |
| 26 | 12 | ర్చుఁగా | ర్చుచుఁగా |
| 29 | 13 | వాఁటి | వాటి |
| 34 | 28 | బోఁఋ | దోఁఋ |
| 35 | 1 | స్వన | స్వన |
| 37 | 22 | జిజ్ఞా | జజ్ఞా |
| 38 | 12 | నాగ | నాక |
| 48 | 15 | న్ననఁగా | వన్నఁగా |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 59 | 14 | వరమ | వర |
| 63 | 9 | వారె | న్లారె |
| 66 | 22 | రంబం | రుంబం |
| 71 | 13 | తప్పి | యప్పి |
| 81 | 2 | నేపె | పేపె |
| 90 | 4 | పీనఁబు | పీవంబు |
| 91 | 9 | డూఁగి | డూఁది |
| | 11 | పిత | పిత |
| 110 | 2 | ల్గడు | గడు |
| 112 | 17 | కాల్యా | కల్య |
| 121 | 5 | ట్రాకెఁడు | ట్రాఁకెడు |
| | 25 | దోక | దోఁక |
| 135 | 8 | మొలిచె | మొలచె |
| 140 | 27 | పివియు | పివియు |
| | 28 | టగు | ట్లగు |
| 148 | 24 | వమచు | పనుచు |
| 149 | 4 | రతి | రత |
| 150 | 20 | గర్గెర | గగ్గెర |
| 151 | 14 | యాయట్ల | మాయట్ల |
| 163 | 15 | నెద | నెదు |
| | 22 | బుఁగొండు | బు గొండు |
| 165 | 19 | గుదియు | గుదియ |
| 170 | 1 | నెపంబువ | నెపంబున |
| | 14 | యసుఋ | యుసుఋ |
| 176 | 19 | శాంట | శాటం |
| 177 | 5 | రింవ | రింప |
| | 6 | క్నేమ | క్నేను |
| 178 | 21 | కృదృ | కృద్మ |